# అలాంటి క్యారెక్టర్ చేయను

## -నివేదా థామస్



**గత సంవత్సరం 'జెంటిల్‌మన్'తో ప్రేక్షకులను పలకరించిన నివేదా థామస్ ఈ సంవత్సరం మరో రెండు సినిమాలతో తెలుగు అభిమానులను అలరించబోతోంది. ముందు బాలనటిగా, ఇప్పుడు హీరోయిన్‌గా సినీ అభిమానులను అలరిస్తున్న నివేదా థామస్‌కు కెరీర్ పట్ల స్పష్టమైన అవగాహన ఉంది. అదేమిటో ఆమె మాటల్లోనే....**

### నానితో రెండోసారి చేయడం ఎలా ఉంది?

'జెంటిల్‌మన్'లో తనతో చేసే సమయంలో నాకు టాలీవుడ్ కొత్త. అంతా కొత్త కొత్తగా ఉండేది. సినిమా పూర్తయ్యేసరికి కొత్త కొత్త పరిచయాలు ఏర్పడ్డాయి. ఆ సినిమా సమయంలోనే నానితో నాకూ మంచి స్నేహం ఏర్పడింది. ఈ సినిమా సమయంలో ఆ స్నేహం మరింత బలపడింది. ఎంత ఎదిగినా ఒదిగి ఉండాలనేది నాని తత్త్వం. ఇది చాలా కొద్దిమందిలోనే కనిపిస్తుంది. తన మంచితనం గురించి నేను చెప్పడం ఎందుకు అది అందరికీ తెలిసిన సంగతే. చాలా కష్టపడి పైకి వచ్చిన వ్యక్తి. సెట్‌లో ఎంత జోవియల్‌గా ఉంటాడో బయట కూడా అలాగే ఉంటాడు. ఎవరికి ఏ సహాయం కావలసి వచ్చినా ముందు ఉంటాడు.

### జూనియర్ ఎన్టీఆర్ సినిమాలో చేస్తున్నారట?

అవును. 'జై లవకుశ' సినిమాలో నేను ఒక హీరోయిన్‌ని. ఈ సినిమా గురించి ఇప్పుడు చెబితే బాగుండదు.

### పవన్‌కల్యాణ్‌గారికి నో చెప్పడానికి కారణం?

ఆయన సినిమాలో అవకాశం రావడం ఏ నటికైనా అదృష్టమే! నాకా అదృష్టం తక్కువ కాలంలోనే లభించింది కానీ దాన్ని వదులుకున్నానంటే దానికి కారణం ఉంది. అసలు పవన్‌గారి సినిమాకి నో అని చెప్పడానికి ఎంత బాధపడ్డానో నాకే తెలుసు. తెలుగులో నేను హీరోయిన్‌గానే పరిచయమయ్యాను. పవన్‌గారి సినిమాలో నాది చెల్లెలి క్యారెక్టర్ అన్నారు. హీరోయిన్‌గా చేసి చెల్లెలు పాత్ర చేయాలంటే కష్టం కదా! ఒకసారి అలాంటి పాత్ర చేస్తే ఇక హీరోయిన్‌గా చేసే అవకాశాలు తగ్గిపోతాయి. అందుకే ఆ సినిమాకి నో చెప్పాను. భవిష్యత్తులో ఆయన సినిమాలో కొద్ది సేపు కనిపించే అవకాశం వచ్చినా తప్పకుండా చేస్తాను.

### సినిమాల్లోకి వస్తానంటే మీ కుటుంబం నుంచి అభ్యంతరం రాలేదా?

బాలనటిగా సినిమాల్లో చేశాను. సినిమాల మీద ప్రేమ చిన్నతనంలోనే మొదలైంది. కానీ ముందు చదువు పూర్తి చేశాకే నచ్చిన రంగంలోకి వెళ్ళమన్నారు మా పేరెంట్స్. అందుకే చదువు పూర్తయ్యాక ఫుల్‌టైం నటినయ్యాను. నా మాతృభాష మలయాళం కన్నా తెలుగు, తమిళం భాషల్లోనే ఎక్కువ సినిమాలు చేశాను. తెలుగులో వరుసగా మూడు నాలుగు సినిమాలకు ఓకే చెప్పాను. నటిగా నేను హ్యాపీ, నన్ను చూసి మా కుటుంబం హ్యాపీ.

### గ్లామర్‌గా కనిపించడం గురించి....

సినిమాల్లో గ్లామర్‌గా కనిపించడం మామూలే! ఆ విషయం తెలిసే ఇక్కడకు వస్తాం. వచ్చిన తరువాత గ్లామర్ అంటే ఇష్టం లేనట్టు మాట్లాడితే ఎలా? కొన్ని సందర్భాలలో గ్లామర్‌గా కనిపించాల్సిందే. దానికి నేనేమీ మినహాయింపు కాదు కదా? అలాగని మితిమీరిన గ్లామర్ ఒలకబోయడం నాకు చేతకాదు. దానికి నేను వ్యతిరేకం కూడా! ఏదైనా సరే హద్దు మీరకుండా ఉండాలి అన్నది నా పాలసీ.

### డ్రీం రోల్స్?

అలాంటివి ఏమీ లేవు. ఇప్పటి దాకా నచ్చిన సినిమాలు చేస్తున్నాను. కాకపోతే హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమా చేయాలని ఉంది. అది ఇప్పుడే కాదు. భవిష్యత్తులో అంటే మరో మూడు నాలుగు సంవత్సరాల తరువాత వాటి గురించి ఆలోచిస్తాను.

### ప్రేమ పెళ్ళి గురించి...

దానికి చాలా సమయముంది. నా పెళ్ళి బాధ్యత మా పేరెంట్స్‌కే వదిలేశాను. వాళ్ళు ఎవరిని చేసుకోమంటే వారినే చేసుకుంటాను. పెళ్ళి తరువాత నటిస్తారా? అంటే చెప్పడం కష్టం. అప్పటి పరిస్థితులను బట్టి నా నిర్ణయం ఉంటుంది.

—భరత్ కుమార్



# అల్ట్రా వేరియోకు అప్‌గ్రేడ్ చేసుకోండి!

## ఎలక్ట్రానిక్ స్పీడ్ సెన్సార్ మరియు స్లో స్పీడ్ ఫంక్షన్‌గల ఏకైక మిక్సర్ గ్రైండర్




Perfectly made

వేరియో+ 750
జ్యూసర్‌తో



వేరియో+ 750
చాపర్‌తో





**స్లో స్పీడ్ జ్యూసింగ్**

ఇందులోని గింజలను తీసి, గట్టి అయిన పోషకాలుగల పళ్లరసం పొందడానికి తగిన వేగం

**గోధుమ పిండి కలపడం**

150 గ్రాం/8 చపాతీలు చేయడానికి తగిన పిండి ఒత్తడానికి తగిన వేగం



**కాయగూరలు తరగడానికి**

కేరట్, ఉల్లిపాయ, క్యాబేజి, బీట్‌రూట్ లాంటివాటిని తరుగుతుంది

మనం వండే ప్రతి ఆహార పదార్థానికీ ప్రత్యేకమైన పక్వత, రుచి కావాలి! అందువలననే వేరియో మిక్సర్ గ్రైండర్లు 4 ప్రత్యేకతలుగలిగిన వేగంతో డిజైన్ చేయబడి ఒక ఎలక్ట్రానిక్ స్పీడ్ మోటర్‌తో అనుసంధానం చేయబడింది. ఇందువలన అవసరమైన వేగాలలో, వేడి ఎక్కువ కాకుండా, పోషకాలు అన్నిటినీ నిల్వచేసుకుని సరైన పక్వంలో పదార్థాలను రుబ్బడం సాధ్యమవుతుంది.


ప్రతియొక్క ప్రత్యేక ఉపయోగానికీ తగినట్లు సరైన వేగంలో రుబ్బే ఎలెక్ట్రానిక్ స్పీడ్ సెన్సార్


తుప్పపట్టని, ఫుడ్ గ్రేడ్, AISI 304, స్టెయిన్‌లెస్ స్టీల్ జార్లు, శుభ్రమైన ఆహారానికి భరోసానిస్తున్నాయి


750 వాట్ శక్తిగల మోటార్ చక్కగా రుబ్బడానికి, వివిధ పనులను చేయడానికి తగినది


స్లో స్పీడ్ జ్యూసింగ్/చాపింగ్‌ల 4 ప్రత్యేక స్పీడ్‌లు గలది


2 ఏళ్ళ వారంటీ

 www.elgiultra.com  /ultraappliances  /ultraappliancess

Elgi Ultra Industries Ltd., #30-18-28 A, KVS Guptha Street, Seetarampuram, Vijayawada, Andhra Pradesh 520 002. Toll Free Customer Care: 1800 102 2040
E-mail: ultracare@elgiultra.com For enquiries, call: Hyderabad - 91779 64566, 98665 34477, 91779 64566, 95503 63131, Warangal - 9100931868, Vijayawada - 99084 34477, Rajahmundry - 90004 54333, Visakhapatnam - 78937 05252, Tirupathi & Kurnool - 77026 14747, Guntur & Prakasam - 70950 42555



8

## నవ్వుల డాక్టర్ల మ్యాజిక్ ట్రీట్‌మెంట్

మెడలో స్టెతస్కోప్, తెల్లకోటు, చేతిలో ఇంజెక్షన్, సీరియస్ ఫేస్...! వీళ్ళంతా రోగాలు నయం చేసే డాక్టర్లు. కానీ ఇప్పుడు నవ్వుల పువ్వులు పూయించే సరికొత్త డాక్టర్లొచ్చారు. విదేశాల్లో వీళ్ళు చాలా పాపులర్. ఇప్పుడిప్పుడే మనదేశంలోనూ పుట్టుకొస్తున్నారు.

38

### సంగతులూ! సందర్భాలూ!

(కొత్త శీర్షిక ప్రారంభం)

ఆహా! ఈ సంపెంగల్ని దండకట్టి ఆమె జడలో తురిమిస్తే...ఎంత అందంగా ఉంటుందీ! చీకటికొసవేళ ఉషస్సులా ఉండదూ? అనుకున్నాడాయన. ఎవరాయన? ఏమా కథ?

64

### రంగురంగుల సాగరతీరాలు

సముద్రం ఒడ్డున ఇసుక ఏ రంగులో ఉంటుంది? ఇదేం ప్రశ్న అనుకుంటున్నారా? ఈ ప్రకృతిలో ఇంద్రధనుస్సు రంగుల్లో మెరిసే అద్భుతమైన సాగరతీరాలెన్నెన్నో. చూసొద్దాం రండి.

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: సాయేషా సైగల్


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### జీతాలరోజు

సుబ్బారావు, గిరిబాబు ఇద్దరూ నడుచుకుంటూ వచ్చారక్కడికి. సడన్‌గా సుబ్బారావు ఆగిపోయాడు. అతను ఆగడంతో గిరిబాబు కూడా ఆగిపోయాడు. ఎదురుగా ఉన్న మూడుచెట్లని చూసి అన్నాడిలా సుబ్బారావు.

"గిరీ! ఇవాళ జీతాలరోజు కదా! ఇద్దరం ఫుల్‌గా తాగేద్దాం. ఎంతలా తాగుదాం అంటే అక్కడ మూడు చెట్లు ఉన్నాయి కదా! అవి ఆరుచెట్లలా కనిపించాలి. అంతలా తాగుదాం. ఏఁవంటావు?"

"మనం ఇక తాగడం ఆపడం బెటరంటాను." అన్నాడు గిరిబాబు.

"ఏం?"

"ఏఁవంటే...అక్కడ మూడుచెట్లు లేవు. ఒకటే చెట్టుంది."

### గుడ్డివాడు

"అయ్యా గుడ్డివాణ్ణి, ఓ రూపాయి దానం చెయ్యండయ్యా."

"నువ్వు గుడ్డివాడివేంటి, ఓ కన్ను కనిపిస్తోందిగా."

"అయితే అర్థరూపాయి దానం చెయ్యండి బాబూ."

### గురువు

మాస్టర్‌ని అడిగాడిలా ఓ కుంగ్‌ఫూ స్టూడెంట్.

"సార్! నేనెందుకు పెద్దగా ఫైట్ చేయలేకపోతున్నాను? ఎప్పుడూ ఓడిపోతున్నానెందుకు? నాలో ఉన్న లోపం ఏమిటిసార్"

సమాధానంగా సన్నగా నవ్వుతూ అడిగాడిలా మాస్టర్.

"చూడటు! అస్తమిస్తున్న సూర్యునివైపు ఎగురుతున్న కొంగలబారు బలేగా ఉంది కదూ? వాటి రెక్కలు బంగారు రంగులో మెరిసిపోతున్నాయి, అవునా?"

"అవున్సార్, నేనెప్పుడో గమనించానది." చెప్పాడు స్టూడెంట్.

"ఇటు ఈ జలపాతాన్ని చూడు! అంత ఎత్తు మీదనుంచి నీరెలా పడుతోందో! పాలు ఒలికిపోతున్నట్టుగా ఉంది కదూ?"

"అవున్సార్, ఈ జలపాతాన్ని చూసినప్పుడల్లా నేనూ ఇలాగే అనుకుంటాను."

"రాత్రి అయితే వెన్నెల్లో, ఈ సరస్సులో చంద్రుడు ఎలా ఉంటాడో ఎప్పుడైనా గమనించావా? పెద్దసైజు వెండిరూపాయి నీళ్ళడుగున ఉన్నట్టుగా ఉంటుంది. అవునా?"

"అవున్సార్, కరెక్ట్‌గా చెప్పారు. నేనెప్పుడూ అలాగే ఫీలవుతాను."

"నీలో ఉన్న లోపం ఇదే! ప్రకృతికి పరవశిస్తూ కుంగ్‌ఫూను పక్కన పెట్టావ్. అందుకే ఓడిపోతున్నావు." అన్నాడు మాస్టర్.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 20
19-7-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజి

## తిరిగిరాత

ఆరోగ్యం కుదుటపడింది. అయినా కొన్నాళ్ళింకా మందులు వాడాలి. వాడాల్సిన మందులు రాసిచ్చి, పద్మను ఆసుపత్రి నుంచి డిశ్చార్జి చేశారు. తనని డిశ్చార్జి చేస్తున్నారని చెప్పి, సాయంగా రమ్మని ఇద్దరు ముగ్గురు స్నేహితులకి ఫోన్ చేసింది పద్మ. ప్రాధేయపడింది. వీలుకాదని చెప్పారంతా. తనతో మాట్లాడడం ఇష్టం లేనట్టుగా, కష్టం అయినట్టుగా ప్రవర్తించారు. తప్పదు! బలాన్ని కూడదీసుకుంది పద్మ. క్యాబ్ బుక్ చేసుకుని ఆసుపత్రి నుంచి బయల్దేరింది. ఇంటికి చేరింది. ఇంటితాళం తీసి చూసింది. ఇల్లంతా దుమ్ముకొట్టుకుపోయి ఉంది. ముక్కవాసన వేస్తోంది. సోఫాలపైనున్న గోడమీది ఫొటోని చూసింది. ఎంతగా అదుముకున్నా ఏడుపు ఆగలేదు. ఏడుస్తూనే వెళ్ళి, ఫొటోను అందుకుంది పద్మ. ఫొటో మీది దుమ్మును చీరకొంగుతో తుడిచింది. ఫొటోలో స్పష్టంగా కనిపిస్తున్న తననీ, కార్తీక్‌నీ, ప్రభాకర్‌నీ చూసింది. బాధగా కళ్ళు మూసుకుంది.

పద్మ టీచర్. ప్రభాకర్ జర్నలిస్ట్. ఇద్దరికీ పెళ్ళై ఏడేళ్ళైంది. వాళ్ళకోబాబు. పేరు కార్తీక్. అయిదేళ్ళు వాడికి. ప్రభాకర్‌కి సెలవుదొరకడం అదృష్టం. సెలవు దొరికిందంటే ముగ్గురూ నేలమీద ఉండేవారు కాదు. కార్లో తేలుతూ ఉండేవారు. నాగార్జునసాగర్, శ్రీశైలం, తిరుపతి, శ్రీకాళహస్తి...తిరుగుతుండేవారు. పుణ్యక్షేత్రాలంటే ప్రభాకర్‌కి చాలా ఇష్టం. దైవదర్శనం, అక్కడి ప్రసాదం అంటే చాలు, పులకించిపోయేవాడు. తిరుపతి లడ్డూ, ఒంటిమిట్ట పులిహోర అంటే అతనికి ప్రాణం. శని ఆదివారాలు పద్మకి సెలవు దొరకలేదోసారి. స్కూల్లో వరుస మీటింగ్‌లు ఉన్నాయి. ప్రభాకర్‌కి దొరికింది. దాంతో తానూ, కార్తీక్ శ్రీశైలం వెళ్ళి వస్తామన్నాడు ప్రభాకర్. ఆదివారం సాయంత్రానికల్లా తిరిగి వస్తామన్నాడు. వద్దని చెప్పలేకపోయింది పద్మ. చెప్పినట్టుగానే ఆదివారం సాయంత్రానికే వచ్చారిద్దరూ. కాకపోతే ఇద్దరూ ప్రమాదానికి గురై, మృతదేహాలుగా తిరిగి వచ్చారు. వేగాన్ని అదుపు చేయలేకపోయాట్ట ప్రభాకర్. లారీని ఢీకొన్నాట్ట! చనిపోయారన్నారు పోలీసులు. నుజ్జునుజ్జు అయిన కారుని కూడా తెచ్చి ఇంటి ముందు పడేశారు. దిగ్భ్రాంతి చెందింది పద్మ. ఆ దిగ్భ్రాంతిలో ఆత్మహత్య చేసుకోబోయింది. గమనించారెవరో. వారించారు. అయినా ఆత్మహత్యాప్రయత్నాలు మానుకోకుంటే... పిచ్చెక్కిందన్నారు. పిచ్చాసుపత్రిలో జాయిన్ చేశారు. వారంపాటు ఉన్నదక్కడ. ఆ వారానికే అయినవాళ్ళంతా దూరమైపోయారు. బయటపడి, ఇంటికి చేరింది. ఏమిటో తెలియని నీరసం, అనారోగ్యం. మళ్ళీ ఆసుపత్రి పాలైంది. నెలరోజులు ఉన్నదక్కడ. ఆ నెల రోజులకీ చెప్పలేనంత ఖర్చైంది. లక్షలుపోయాయి. వేలు మిగిలాయి.



చేతిలోని ఫొటోను యథాస్థానంలో ఉంచింది పద్మ. పనిలో పడ్డది. ఇంటిని శుభ్రం చేసుకుని, ఇంత వండుకుని తిన్నది. ఆ రాత్రి ఆలోచిస్తూ కూర్చున్నది. ఇంతేనా జీవితం? ముప్పయి అయిదేళ్ళకే ముగిసిపోవాలా? అనుకున్నది. కాదు, కూడదనుకున్నది అంతలోనే! గుండెనిండుగా ఊపిరి పీల్చి, లేచి నిల్చున్నది. తెల్లారిందో లేదో ముందుగా పని చేస్తున్న స్కూలుకి వెళ్ళి, టీచర్‌గా తన ఉద్యోగానికి రాజీనామా చేసింది. ఆ సాయంత్రం యోగాకేంద్రంలో జాయినైంది. ఏడాదిపాటు యోగా నేర్చుకున్నది. యోగా నేర్చుకుంటూనే అక్కడ పళ్ళూ, పాలూ, మొలకెత్తినగింజలూ, డ్రైఫ్రూట్సూ అమ్మజూపింది. అది లాభదాయకం అనిపించడంతో కేంద్రం కిందనే చిన్నషాపు తెరిచింది. కొన్నాళ్ళకి ఆ షాపుసహా తానూ తరలిపోయి వేరే చోట యోగాకేంద్రం ప్రారంభించింది పద్మ. యోగాటీచర్ అయింది. యోగాటీచర్‌గా కొనసాగుతున్నప్పుడే రాంనాథ్‌తో పరిచయం పెరిగింది. ప్రేమలోపడ్డది. పెళ్ళి చేసుకున్నదతన్ని. ఏడాది గడిచింది. పెళ్ళిరోజును పురస్కరించుకుని, రాంనాథ్ కొత్తకారుని ప్రెజెంట్ చేస్తే పొంగిపోయింది పద్మ. ఆ సాయంత్రం తానే డ్రైవ్ చేసి, రాంనాథ్‌ని ఆలయానికి తీసుకుని వెళ్ళింది. అక్కడ ప్రసాదంగా పులిహోరపెడితే, ఇష్టంగా తింటున్న రాంనాథ్‌ని చూసి, ముద్దుపెట్టుకున్నదతన్ని.

త్వరలోనే పద్మా యోగాసెంటర్ బ్రాంచీలు వెలిశాయి. క్షణం తీరికలేకుండా పోయింది పద్మకి. ఆ తీరికలేని ఒకానొకక్షణంలోనే ఆమెకి ఓ చల్లనివార్త తెలిసింది. ఆమె గర్భవతి. ఆనందాశ్చర్యాలుపోయింది పద్మ. తలుపులు మూసి, ఒంటరిగా నిల్చుని, పెద్దగా అరిచింది. అరిచి అరిచి ఆనందబాష్పాలు వర్షించింది.

***

**జీవితం ఓ కథ అనుకుంటే, అవసరమైతే ఆ కథను తిరిగిరాయాలి. రాస్తేనే అందం! ఆనందం!!**

నవ్య




## పెద్దవాళ్ళకు మాత్రమే!

పిల్లలు విదేశాల్లో ఉన్నారంటే ఇక ఆ తల్లిదండ్రుల సంతోషానికి అవధులే ఉండవు. ఆ సంతోషంలో తాము ఒంటరివాళ్ళమవుతామనే ఆలోచన కూడా రాదు వాళ్ళకి. అసలే మీదపడిన వయస్సు, దానికి తోడు రకరకాల ఆరోగ్య సమస్యలు, వీటితోపాటు తామే బయటి పనులు కూడా స్వయంగా చేసుకోవాల్సి రావడం... కాస్తంత ఇబ్బందికరమైన అంశాలే! అలాంటివారి సమస్యలకు పరిష్కారం చూపించేందుకు అన్వయ.కామ్‌ని ప్రారంభించింది దీపికారెడ్డి. మాటసాయంతో మొదలుపెట్టి అన్ని పనులూ చేసిపెట్టే కేర్ మేనేజర్లూ, అనారోగ్యం తలెత్తితే క్షణాల్లో అందించే వైద్యసేవలూ అన్వయ ప్రత్యేకం!

పెద్దవాళ్ళకు అవసరమైన దాదాపు 32 రకాల సేవలు అన్వయ.కామ్‌లో అందుబాటులో ఉన్నాయి. ఈ సేవల్ని యాప్, ఒక ఫోన్ ద్వారా ఎలా పొందవచ్చో అందులో వివరంగా ఉంటుంది. ఒక్కసారి అన్వయ.కామ్‌లో రిజిస్టర్ చేసుకుంటే... ఒక కేర్‌మేనేజర్, నర్స్, సెక్యూరిటీ ఆఫీసర్ ముగ్గుర్నీ ఇంటికి పంపుతారు. వీళ్లలో నర్స్ ప్రాథమిక ఆరోగ్య పరీక్షలన్నీ చేస్తుంది. ఎవరైనా హృద్రోగులుంటే ఆసుపత్రులు ఇచ్చిన రిపోర్ట్ ఆధారంగా ఎమర్జెన్సీ ప్లాన్ రూపొందిస్తుంది. దగ్గర్లోని ఆసుపత్రులూ, అంబులెన్సుల వివరాలని అందులో నమోదు చేస్తుంది. ఇక సెక్యూరిటీ వాళ్లు... ఇంటికి అవసరం అయిన భద్రత విషయంలో జాగ్రత్తలు తీసుకుంటారు. ఇక తర్వాత పనంతా కేర్‌మేనేజర్ల చేతిలోనే ఉంటుంది. ఆరు కుటుంబాలకు ఓ కేర్ మేనేజర్ ఉంటారు. ఈ కేర్‌మేనేజర్ వారం రోజులకోసారి ప్రతి ఒక్కరినీ పలకరిస్తాడు. ఈలోపు వాళ్లే ఫోన్ చేసి ఏదైనా పని చెబితే వాటిని ఈ కేర్ మేనేజరే పూర్తిచేస్తాడు. కాయగూరలూ, కిరాణా సరుకులూ, మందులూ, బంధువులు వస్తే స్వీట్లు తేవడం మొదలు బ్యాంకు వ్యవహారాలూ, బిల్లుల చెల్లింపులూ.. ఇలా అన్నీ చేస్తారు.



ఎవరికైనా ఏ అర్ధరాత్రో గుండెపోటో, మరేదైనా అనారోగ్యం వస్తే... అన్వయ యాప్‌లో ఒక బటన్ నొక్కితే చాలు... అంబులెన్స్, దగ్గర్లోని ఆస్పత్రీ, కేర్ మేనేజర్ అందరూ ఒకేసారి స్పందిస్తారు. క్షణాల్లో వాళ్లకు అవసరం అయిన సేవ చేస్తారు. ఒకవేళ పెద్దవాళ్లు ఎక్కడికైనా వెళ్లాలనుకుంటే క్యాబ్ ఏర్పాటుచేస్తారు. అమెరికాలో ఉన్న వాళ్ల పిల్లలు కోరితే గనుక ఆ పెద్దవాళ్లకోసం సర్‌ప్రైజ్ పార్టీలు కూడా ఏర్పాటు చేస్తున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే వాళ్లకు ఏ అవసరం వచ్చినా క్షణాల్లో అందుబాటులోకి వస్తారు.

నవ్య

# మెయిల్ బాక్స్

### కథ బాగుంది

అత్తలూరి విజయలక్ష్మిగారి దిశ మార్చిన ప్రత్యూష పవనం కథ బాగుంది. కన్నతల్లి గుండె పగిలి చనిపోతే మళ్ళీ తిరిగి వస్తుందా? అని శశాంక్ అన్న మాట అక్షరాల నిజం.

–టి.బాల్‌ముకుంద్‌సింగ్, అమరచింత

### అలిషెంక మిస్టరీ

అలిషెంక మిస్టరీ, వింత ఆహార అలవాట్లు, రియాన్ ప్రేమికుల కాన్సెప్ట్‌కి ఫ్లాట్ అయ్యాం. ఈ జంట ఆరు ఖండాల్లో అలవోకగా షికార్లు చేస్తూ పదే పదే పెళ్ళి చేసుకోవడం వింతగా ఉంది. అలిషెంక గ్రహాంతరవాసి వైకల్యంతో పుట్టిన పసికందు అని శాస్త్రవేత్తలు నిజం వెల్లడించకముందే ఆ పసిది మాయం కావడం ఉత్కంఠ పెంచింది. రాళ్ళు రప్పలు తింటున్న ఫకీరప్ప, గాజుగ్లాసులు, బట్టలు కరకరలాడిస్తున్న జోష్ ఆహార అలవాట్లు చదివి అవాక్కయ్యాం. కథలు, సీరియల్స్ అలరించాయి. సినీతారల గ్లామర్ చిత్రాలు, ఇంటర్వ్యూలు ఆకర్షించాయి.

–తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం

### రసవత్తరం

నయనతార ముఖచిత్రంతో వెలువడిన నవ్య వీక్లీ చాలా బాగుంది. ఈ వారం నాన్నకు ప్రేమతో... వ్యాసం రసవత్తరంగా ఉంది. నటి జ్యోతిక ఇంటర్వ్యూ నచ్చింది. వారం వారం సంపాదకీయం సందేశాత్మకంగా ఉంటోంది. సీరియల్స్ బాగుంటున్నాయి.

–ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

### ఉత్కంఠ రేపుతున్న హరివంశం

హరివంశం కథనం ఉత్కంఠ రేపింది. నారదుడి హితవుతో గోపకులు వ్రేపల్లె నుండి బృందావనానికి తరలివచ్చి జీవించడం, అలవికాని అనారోగ్య మరణాలు, పరమేశ్వరపూజలో కింకరుడు విప్రుణ్ణి ఆవహించి వెలగచెట్టుగా జన్మించిన కాలకలి రాక్షసుడిని నాశనం చేయాలని చెప్పిన కథనం బాగున్నాయి.

అసంతృప్తికి మూలకారణాలైన నిర్ణయలోపం, అపనమ్మకాలను కృషి పట్టుదలతో జయిస్తే జీవిత లక్ష్యం సాధించగలమని విజయవిలాసం చెప్పింది. సురభి వింతలు ఆశ్చర్యపరిచాయి. అలిషెంక మిస్టరీ ఉత్కంఠ రేపింది. రాళ్ళు జీర్ణించుకుంటున్న వ్యక్తుల వివరాలు ఆశ్చర్యపరిచాయి. నవ్య సినిమా విశేషాలు అలరించాయి. ఇవన్నీ నిజాలేలో అప్పుల అప్పారావు పాత్ర పుట్టుక తెలిసింది. విచక్షణ కథ సంఘటనలు, పాత్రపోషణ ఆలోచింపజేశాయి. మొక్కు కథ ఆద్యంతం రంజింపజేసింది. దిశమార్చిన ప్రత్యూషపవనం, కాలంతో కదలాలి, కలుపుమొక్క కథలు ఆకట్టుకున్నాయి.

జాక్వెలిన్ ఫెర్నాండెజ్, సన్నీలియోన్ ఇంటర్వ్యూలు అలరించాయి. మార్నింగ్ కాఫీ స్కిట్లు నవ్వించాయి. వృత్తిపట్ల విశ్వాసం, ప్రజ్ఞాపాటవాలు హంసుడినేకాదు, ఎవరినైనా అందలం ఎక్కిస్తాయని మొదటిపేజి ప్రశంసాపూర్వకంగా చెప్పింది. నాన్నగురించి అనేక అంశాలు క్రోడీకరించి చెప్పారు. సరదా స్కిట్లు, తీన్మార్ నవ్వించాయి.

–కృష్ణ మాధవరపు, కాకినాడ

### అవాక్కయ్యాం

భార్యమీద కేకలేస్తే ప్రతీకారం ఏ రేంజ్‌లో ఉంటుందో మార్నింగ్ కాఫీలో చదివి అవాక్కయ్యాం. మొదటి పేజీ 'పని' కథనంలో కరుణ, ప్రజ్ఞ ప్రదర్శించిన హంసుణ్ణి తననుతాను తెలుసుకునే పనిలో నియమించడం, చదివి విస్తుపోవడం మా వంతైంది. విచక్షణ కథా రచయిత మృదులాంజలికి అభినందనలు. అర్జున్, సరసి, కాశ్యప్, బాచీ, కామేష్ కార్టూన్లు పోటాపోటీగా నవ్వించాయి. రాజ్‌తరుణ్ కుక్కలపిచ్చి గురించి చదివి నవ్వుకున్నాం.

–నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

### దాంపత్య వ్యాసాలు భేష్

దాంపత్యజీవితం గురించి నవ్య వీక్లీలో వస్తున్న వ్యాసాలు బాగుంటున్నాయి. దంపతులు కీచులాటలు, గొడవలు మానుకుని సుఖంగా, సంతోషంగా ఎలా జీవించాలో, ఎలా కలిసిమెలిసి బతకాలో మంచి చిట్కాలు చెబుతున్నారు. రచయిత్రికి ధన్యవాదాలు.

–వి.పద్మావతి, ఎస్సార్‌నగర్, హైదరాబాద్

### రాష్ట్రపతి ఉత్సవ విగ్రహం కాకూడదు

రివ్యూ -రాజశుక

తెలుగువారి ప్రియమైన పత్రిక నవ్య వీక్లి. ప్రతి పేజీ నాకెంతో విలువైంది. ప్రతి పేజీలో తెలుసుకోదగిన విషయం, గుర్తుంచుకోదగినది ఏదో ఒకటి నాకు కనిపిస్తుంది. పత్రికను తీర్చిదిద్దుతున్న సంపాదక వర్గానికి ధన్యవాదాలు. కథలు, సీరియల్స్, వింతలు, విడ్డూరాలు, రాజకీయ సమీక్షలు, పురాణ కథలు, భార్యాభర్తల సుఖజీవిత విశేషాలు, కార్టూన్లు, జోకులు....ఇలా ఎన్నో వారం అంతా నాచేత వీక్లీని చదివిస్తుంది నవ్య. ప్రతిరోజు ఏదో ఒక సమయంలో పత్రిక తిరగేయడమే నా పని.

రాజకీయ సమీక్షలు ఎంతో ఆసక్తికరంగా చక్కటి విశ్లేషణతో రాస్తారు రాజశుక. పత్రికలకు ఉత్తరాలు రాసే అలవాటు లేదు నాకు. కానీ నవ్య వీక్లీ నా చేత ఈ ఉత్తరం రాయించింది. రాష్ట్రపతి పదవి గురించి చాలా బాగా రాశారు. అది చదివిన వెంటనే ఈ ఉత్తరం రాస్తున్నాను. నిజమే, రాష్ట్రపతి అధికారాలపైన చర్చ జరగాలి. చాలామంది తెల్లారిలేస్తే పేపర్లు చదువుతారుగానీ, రాష్ట్రపతి ఏం చేస్తారో తెలీదు. రాష్ట్రపతి కేవలం ఉత్సవ విగ్రహంగా మారిపోకూడదు.

–కె.వెంకటేశ్వరరావు, కరెన్సీనగర్, విజయవాడ

# నడుము నొప్పి, సయాటికా సమస్యలకు ఆయుర్వేద చికిత్స

**ఉరకూ వరుగులు తీస్తున్నా, జీవితం ఒక్కోసారి కుంటువడినట్లే అనిపిస్తుంది కాలు కదవడమే కష్టమై మంచాన వడిపోతే ఇంకెలా ఉండాలి? నమాటికా నమన్యతో వచ్చివడే నమస్యే ఇది. నడుము నుంచి పాదం దాకా కాలంతా లాగుతూ, నలువుతూ కదలడమే కష్టమైపోయేలా చేసేదే నయాటికా వెన్ను వూనలు, డిన్కుల మధ్య తలెత్తే వలురకాల నమన్యలు ఈ నమన్యకు కారణమవుతాయి. నయాటికా, డిన్క్ ప్రొలాప్స్, డిన్క్ బల్జ్, స్పాండిలో లిన్థసిన్, స్పాండైలైసిన్. స్పాడైలోసిన్ ఇవన్నీ వివిధ రూపాల్లో ఉన్న వెన్ను నమన్యలే. ఒక్కో వ్యాధికి వివిధ లక్షణాలు ఉంటాయి. ఆ వ్యాధులు రావడానికి గల కారణాలు కూడా వేరువేరుగానే ఉంటాయి. ఎవరికి ఏ లక్షణం వల్ల ఏ బాధ వచ్చిందో తెలుసుకుని చికిత్స చేస్తే నయాటికా నమన్య నమూలంగా తొలగిపోతుందంటున్నారు. ఆయుర్వేద వైద్య నివుణులు డాక్టర్ మహేశ్ కుమార్?**

సయాటికా నరం బాగా ఒత్తిడికి గురైనప్పుడు వచ్చే సమస్యనే సయాటికా వ్యాధి అంటారు. సయాటికా అనేది ఒక వ్యాధి కాదు అది ఒక వ్యాధి లక్షణం మాత్రమే. సయాటికా నరం ఒత్తిడికి గురికావడానికి చాలా కారణాలు ఉంటాయి. నడుము వద్దనున్న ఎముకలు అరిగిపోయి ఇన్ఫ్లమేటరీ ప్రోటీన్ విడుదలై నరాన్ని నొక్కవచ్చు. స్పాండిలో లిస్థసిస్ అంటే ప్రమాదవశాత్తూ కిందపడిపోయి రెండు ఎముకలు దగ్గరగా వచ్చినపుడు హఠాత్తుగా డిస్కును పొడిచేస్తుంది. ఇలా కూడా సయాటికా రావచ్చు. కండరాలు పట్టేయడం వల్ల లేదా కండరాలు బాగా బలహీనపడినపుడు కూడా ఎముకలు దగ్గరకు చేరి సయాటికా నరం ఒత్తిడికి గురికావచ్చు. లేదా బి-విటమిన్ లోపం ఏర్పడటం వల్ల నరాలు పీక్కుపోయి ఉండవచ్చు. వెన్నుపూసల మధ్యనున్న డిస్కులు ఇలా ఏ కారణంగానైనా దెబ్బ తిన్నప్పుడు తుంటి నుంచి పాదం దాకా విపరీతమైన నొప్పి, బాధ ఉంటాయి. ఈ నొప్పులు ఒక్కొక్కరికి ఒక్కోలా ఉంటాయి. కాలునొప్పి విషయానికొస్తే, కాలు పట్టేయడం, లాగడం, బిగుసుకుపోవడం, మంటలు పుట్టడం, తిమ్మిరిపట్టడం, కరెంట్ షాక్‌లా నరాలు ఝల్లుమనడం, కాలు బరువెక్కడం, కూర్చున్న చోటు నుంచి లేవలేకపోడం, పడుకున్నప్పుడు అటూ ఇటూ మరలలేకపోవడం, భరించలేనంతటి నొప్పి వంటి లక్షణాలు కనిపిస్తాయి. ఈ నొప్పి నాలుగు స్టేజ్‌లలో ఉంటుంది.

Sciatica Pain



**స్టేజ్ - 1:** నడుము వద్ద మాత్రమే నొప్పి వస్తోంది. నడుము వరకే బరువుగా ఉంటోంది. పడుకున్నప్పుడు పక్కకు తిరగలేకపోతున్నాను. విశ్రాంతి తీసుకుంటే ఉపశమనంగా ఉంటోంది. ఓ 30 కి.మీ. దూరం బైక్ నడిపితే నొప్పి వస్తోంది. 3 గంటలు కూర్చుని పనిచేసినా నొప్పి వస్తోందని ఎవరైనా అంటున్నారూ అంటే అది స్టేజ్-1 వెన్ను నొప్పిగా గుర్తించాలి.

**స్టేజ్-2:** సమస్యను నిర్లక్ష్యం చేస్తే. అది స్టేజ్-2 దశకు చేరుకుంటుంది. ఈ దశలో అప్పటిదాకా నడుము భాగాన్నే ఉండే నొప్పి. లాగడం వంటివి, నడుమునుంచి కింది భాగానికి వెళతాయి. అప్పటికి పట్టించుకోకపోతే, కాస్త దూరదూరంగా ఉండే వెన్నుపూసలు బాగా దగ్గరవుతాయి. ఈ పూసలు దగ్గరైనప్పుడు పైసల మధ్యన ఉండే డిస్కుబయటికి వచ్చి పెద్ద నరాన్ని పొడుస్తుంది. ఈ దశలో ఇంతకు ముందున్న లక్షణాలు క్రమంగా మారుతూ వస్తాయి. ఇప్పటిదాకా లాగడం, నొప్పి, నడుము భాగాన్నే ఉండేవి. ఇప్పుడవి నరాన్ని తాకే దాకా వెళతాయి. ఈ రెండవ దశలో ఈ సమస్య ఏదో ఒక కాలుకే పరిమితమై ఉంటుంది. ఎక్కువసేపు కూర్చున్నప్పుడు గానీ, ఎక్కువ సేపు నడిచినప్పుడు గానీ, ఎక్కువ గంటలు వాహనాన్ని నడిపినప్పుడు గానీ బాధ ఎక్కువవుతుంది. సమయం అంతే ఉంటుంది కానీ, తొలిదశలో 30 నిమిషాలు కూర్చుంటే నొప్పి మాత్రమే ఉంటే, అదే సెకండ్ స్టేజ్‌లో అయితే ఆ 30 నిమిషాలకే ఒక కాలు నొప్పిగా ఉంటే మరో కాలు తిమ్మిరి పడుతుంది. ఈ స్థితిలోనైనా చికిత్స తీసుకోకపోతే వ్యాధి మూడో దశకు చేరుకునే ప్రమాదం ఏర్పడుతుంది.

**స్టేజ్-3:** అదే 30 నిమిషాలు కూర్చుంటే రెండు కాళ్ళు లాగడం, రెండు కాళ్ళు తిమ్మిరి పట్టడం, రెండు కాళ్ళు మంటలు పుట్టడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. డిస్కు ముందుకు సయాటికా నరాన్ని మొత్తంగా నొక్కడమే ఇందుకు కారణం. రెండు వెన్నుపూసల ఒత్తిడితో అరిగిపోయిన డిస్కు ఇన్ఫ్లమేటరీ ప్రోటీన్లను విడుదల చేస్తుంది. ఈ ప్రోటీన్లు రక్షణ వ్యవస్థకు సంబంధించినవి. రెండు పూసల మధ్య అరిగిపోయిన డిస్కు తనను తాను రక్షించుకోవడానికి, ఈ ప్రోటీన్లనను విడుదల చేస్తుంది. ఈ వెన్నుపూసల్ని దూరం చేయడానికి డిస్కు చేసే ఒక ప్రయత్నిమిది. ఆ లక్ష్యంగా విడుదల చేసిన ప్రోటీన్లు ఉబ్బెత్తుగా నిలబడుతుంది. కానీ, వెన్నుపూసల ఒత్తిడికి ఉబ్బెత్తుగా ఉన్న ప్రోటీన్ కూడా బయటికి





వచ్చేస్తుంది. అలా వచ్చిన ప్రోటీన్ నరాన్ని నొక్కుతుంది. మొదటి దశలో నొప్పి ఒక సంకేతంగా వస్తే రెండవ దశలో మంటలు తిమ్మిర్లు మొదలవుతాయి.

**స్టేజ్-4 :** ఇప్పటిదాకా 30 నిమిషాలు కూర్చుంటే వచ్చే నొప్పి. కొద్ది క్షణాలు కూర్చున్నా, లాగడం, మంటలు పుట్టడం, రెండు కాళ్ళూ పనిచేయకపోవడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. ఈ దశను ఫూట్ డ్రాప్ అంటాం. ఈ దశలో పాదాన్ని భూమికి ఏ కాస్త ఎత్తుకయినా లేపలేకపోతారు. గత మూడు దశల దాకా నరం కొన్ని లక్షణాలు మాత్రమే చెబుతుంది. ఈ 4వ దశలో ఆ నరం అసలే పనిచేయకుండా పోతుంది. యూరిన్ సెన్సేషన్‌ను తెలిపే నరం అచేతనంగా ఉండిపోతుంది. దీని వల్ల మూత్ర విసర్జన తెలియకుండానే జరిగిపోతుంది. అదే క్రమంలో మల విసర్జన కూడ తెలియకుండానే జరిగిపోతుంది. ఈ పరిస్థితి ఇలాగే ఉండిపోతే ఒక దశలో ఉన్న చోటు నుండి జరగలేకపోడవమే కాదు. మంచంలోంచి లేవలేని స్థితి ఏర్పడుతుంది. ఇవన్నీ ఒక్కొక్కటిగా దశలు దశలుగా వచ్చే పరిణామాలివి. మొదటి రెండు స్టేజ్‌లల్లో కూవలం మందులతోనే సమస్య తొలగిపోతుంది. అదే స్టేజ్-3, స్టేజ్-4లో అయితే పంచకర్మ చికిత్సలు చేస్తూ మందులు ఇవ్వలసి ఉంటుంది.

**ఆయుర్వేద వైద్య చికిత్సలు**

సమస్య ప్రారంభంలో ఉన్నప్పుడే వస్తే లేపన చికిత్స చేస్తాం. దీనివల్ల అక్కడ బిగుసుకుపోయిన కండరాలు రిలాక్స్ అవుతాయి తైల మర్దనం, ఎలకిడి చేయడం వల్ల కర్వేచర్ సెట్ అవుతుంది. ఎప్పుడైతే వ్యాధి తీవ్రరూపంలో ఉంటుందో అప్పుడు కండరాలకు కాకుండా నరానికి బలమిచ్చే మందులు ఇవ్వాల్సి ఉంటుంది. అందుకే ఈ దశలో వస్తి రూపంలో మేరు వజ్రీకరణ చికిత్స చేయడం వల్ల సమస్య పూర్తిగా తొలగిపోతుంది. ఏవో పెయిన్ కిల్లర్స్ వేసుకుని కాలయాపన చేయడం కాదు. కనిపించే లక్షణం ఏ వ్యాధి వల్ల వచ్చింది? స్పాండైలోసిస్ వల్ల వచ్చిందా? స్పాండైలైసిస్ వల్ల వచ్చిందా? స్పాండైలో లిస్థసిస్ వల్ల వచ్చిందా? ఇంటర్ వర్టిబ్రల్ డిస్క్ ప్రొలాప్స్ వల్ల వచ్చిందా? అంకైలో స్పాండిలోసిస్ వల్ల వచ్చిందా? ఇలాంటి పలు వ్యాధుల్లో ఏ వ్యాధి వల్ల ఈ లక్షణం కనిపిస్తోంది అన్న విషయాన్ని గుర్తించి వైద్య చికిత్సలు అందిస్తే వ్యాధి పూర్తిగా నయమైపోతుంది.

# నవ్వుల డాక్టర్ల మ్యాజిక్ ట్రీట్‌మెంట్

**డాక్టర్లు అంటే మెడలో స్టెతస్కోప్, తెల్లకోటు వేసుకుని, సీరియస్ ఫేస్‌తో ఇంజెక్షన్‌లు చేస్తారనుకుంటే పొరపాటు పడినట్లే!**

**ఈ డాక్టర్లు అలాంటివారు కానే కాదు. చిన్నారుల మోములపై నవ్వులు పూయిస్తూ, వైద్యం చేస్తూ రోగాలు నయం చేస్తారు.**

**ఈ డాక్టర్ల తెల్లకోటు సప్తవర్ణాలమయం. ఈ డాక్టర్ల దగ్గర స్టెతస్కోప్ ఉండదు, వీళ్ళ చేతుల్లో మ్యాజిక్ స్టిక్ ఉంటుంది. వీళ్ళ ఫేస్ ఎప్పుడూ సీరియస్‌గా ఉండదు. ఫన్నీగా ఉంటుంది. ముఖాన పెన్ను పెట్టుకుని ఆలోచించే రకం కాదు వీళ్ళు. ముఖానికి మేకప్ వేసుకుంటారు. ముక్కుకు ఓ చిన్న ఎర్రని బుడగ లాంటిది తగిలించుకుంటారు. ఇది అచ్చం జోకర్ రూపమే కదూ! అవును! వీళ్ళూ డాక్టర్లలాంటి వాళ్ళే. నవ్వించే డాక్టర్లు. భయం పోగొట్టే డాక్టర్లు. వీళ్ళని క్లౌన్ డాక్టర్లు అంటారు. వీళ్ళ క్లినిక్స్‌ని క్లౌన్ క్లినిక్స్ అంటారు.**

ఇటీవలి కాలంలో మామూలు డాక్టర్లకన్నా ఈ క్లౌన్ డాక్టర్లకే ఆదరణ ఎక్కువగా పెరుగుతోంది. నిన్నమొన్నటివరకు విదేశాలలో మాత్రమే ఎక్కువగా ఉండే ఈ క్లౌన్ క్లినిక్‌ల సంఖ్య మన దేశంలోనూ పెరుగుతోంది. ఇంతకీ ఈ క్లౌన్ డాక్టర్లు ఏం చేస్తారు? ఎలాంటి ట్రీట్‌మెంట్ ఇస్తారు? అసలు ఆ వేషం ఏంటి? అనే సందేహాలు మీలో కలుగుతున్నాయా? అయితే వీరి గురించి తెలుసుకోండి మరి!



## చిన్నినవ్వుతో రోగం మాయం!

ఒక చిన్న చిరునవ్వు ఎలాంటి వ్యాధినైనా నయం చేస్తుందంటారు. మనిషికి భౌతికంగా వచ్చే వ్యాధికి మందు ఇవ్వగలంగానీ, మనో వ్యాధికి ఏ డాక్టరూ మందు ఇవ్వలేడు. అదే ఒక మనిషిని మానసికంగా బలవంతుణ్ణి చేస్తే ఎంతటి రోగమైనా మటుమాయమవుతుంది. అదేపని చేస్తున్నారు ఈ క్లౌన్ డాక్టర్లు. వీళ్ళల్లో ఎక్కువగా చిన్నపిల్లల డాక్టర్లే. కొందరు పెద్దవాళ్లను కూడా చూస్తారు. వారు సంతోషాల ఇంజెక్షన్లు, నవ్వుల బిళ్లలు, సరదాల మందు వేసి రోగాన్ని త్వరగా తరిమేసేందుకు ఫన్నీ గ్లౌజులు తొడుగుతారు. ఆటపాటలు, ట్రిక్కులు, ఫీట్లతో చిన్నారుల్ని కేరింతలు కొట్టిస్తూ ఆస్పత్రి అంటే అమ్మో! భయమనే ధోరణి పోగొడతారు. హ్యూమరోపతి, నవ్వుల థెరపీలతో మనసును కుదుట పరుస్తారు. చికిత్సను తేలిక చేస్తారు. వైద్యం అందిస్తారు.



చిన్న ఇంజెక్షన్ తీసుకోవాలంటే పెద్దవాళ్లు సైతం భయపడుతుంటారు. డాక్టర్ దగ్గరికి వెళ్లి ఇంజెక్షన్ తీసుకునే బదులు ఇంటి చిట్కాలతో రోగం తగ్గించుకోవాలని చూస్తుంటారు. అలాంటప్పుడు ఇక చిన్నపిల్లల సంగతి చెప్పనక్కర్లేదు. వారికి డాక్టర్లంటేనే భయం. పిల్లలెవరైనా అల్లరి చేస్తుంటే డాక్టరు దగ్గరికి తీసుకెళ్తా అనగానే అల్లరి మానేస్తారు. అంత భయం వారికి. అందుకే సూదిమందంటే ఆమడ దూరంలో ఉంటారు. తెల్లని దుస్తుల్లో కనిపించే డాక్టర్లంటే వారికి హడల్. ఆసుపత్రి పరిసరాలు, తోటి చిన్నారుల ఏడుపులు, పెడబొబ్బలు హార్ట్ బీట్‌ను అమాంతం పెంచేస్తాయి. స్టెతస్కోప్ పెట్టి చూస్తే గుండెలు డబడబా కొట్టేసుకుంటాయి. మరి మందు వేసేదెలా? అందుకు మేమున్నాం అంటూ ముందుకు వచ్చేశారు క్లౌన్ డాక్టర్లు. అదేనండీ! హాస్పిటల్ జోకర్లు!




## బుడతలతో ఫ్రెండ్లీగా

క్లౌన్ డాక్టర్లు అనగానే అన్నిరకాల వైద్యం చేస్తారు అనుకునేరు. నిజానికి వీరు డాక్టర్లు కానే కారు. కానీ వీరి గెటప్ చూస్తే అలా అనిపిస్తుందంతే! వీరు ఇంజెక్షన్లు చేయరు. మందులు రాయరు. కేవలం ఆస్పత్రుల్లో తమ ట్రిక్కులతో చిన్నారుల్ని ఆకట్టుకుని వైట్‌గౌన్ సిండ్రోమ్ అంటే వైద్యుల ఆహార్యం చూసి భయపడే ఒకరకమైన జబ్బు నుంచి బయట పడేస్తారు. ఆటలతో, పాటలతో బుడతల భయాలు ఎగరగొట్టేస్తారు. ఫ్రెండ్లీ నేచర్‌తో చిన్నారులలో ఉన్న అనుమానాలను తొలగించేస్తారు. మ్యాజిక్ ట్రిక్కులతో నొప్పి మాయం చేస్తారు. ఒక్క చిన్నారులకే కాదు. పెద్దలకు కూడా వీళ్ళ నవ్వుల మందు 100 శాతం పని చేస్తుంది. విదేశాల్లో ఇప్పుడు క్లౌన్ డాక్టర్ల చికిత్సకు విశేష స్పందన ఉంది. కేన్సర్ లాంటి పెద్ద పెద్ద రోగాల బారినపడిన వారికి మనోస్థైర్యం అందిస్తోంది ఈ క్లౌన్ క్లినిక్స్ చికిత్స.

వీళ్లూ వాళ్ళూ అనే తేడా లేకుండా ప్రతి ఒక్కరికీ ఓ పాజిటివ్ ఎమోషన్స్ చేకూర్చి అంతా బానే ఉందనే సంతోషం కలిగిస్తుంది.

## నవ్వుతూ నవ్విస్తూ

రోగుల జబ్బులు నయం చేయడానికి క్లౌన్ డాక్టర్లు ఎలాంటి రకం మందులు వాడతారని ఆలోచిస్తున్నారా! వారికి వేరే మందులు మాకులు ఏమీ అక్కర్లేదు. మ్యాజిక్, మిమిక్రీ, జంగ్లరీ, ఆటలు, పాటలు, సర్కస్ ఫీట్లు, కథలు చెప్పడం, బొమ్మలు, ఇవే క్లౌన్ డాక్టర్ల మందులు. తమ తమ ఫీట్లతో

రోగులకు నవ్వులు తెప్పించి ఆ సందట్లో సూదిమందు గుచ్చేస్తారు. చాక్లెట్లు చప్పరించినట్లు మందుగోళీలు చప్పరించేలా చేస్తారు. ఏదో జ్యూస్ తాగుతున్న వారిలా ఫోజులు కొట్టి చిన్నారుల చేత మూత టానిక్కును గడగడా తాగించేస్తారు. రోగుల మానసిక స్థితిని అర్థం చేసుకుని వారికి ఇబ్బంది కలిగించని అంశాలనే, వ్యంగ్యంగా ప్రయోగిస్తూ నవ్వులు పేల్చేందుకు ప్రయత్నిస్తారు. ఇలా అల్లరి చేస్తుంటే మిగతా రోగులకు ఇబ్బంది కలుగుతుంది కదా అని అనుకుంటున్నారా... అదే మామూలు డాక్టర్లకి క్లౌన్ డాక్టర్లకి తేడా. ఆస్పత్రిలో ఉండాల్సిన పరిశుభ్రత పాడవకుండా, మిగతావారు డిస్టర్బ్ అవకుండా చాలా జాగ్రత్తలే తీసుకుంటారు. ఆస్పత్రి పరికరాలను దృష్టిలో పెట్టుకుని వీరు ప్రవర్తిస్తారు. వీరికి శిక్షణ ఇచ్చేందుకు కొన్ని సంస్థలు కూడా ఉన్నాయి. చాలామంది విదేశాల్లో దీన్ని ఓ కెరీర్‌గా ఎంచుకుంటున్నారు. కేవలం క్లౌన్ డాక్టర్ కోర్సు మీద ఇజ్రాయెల్ దేశం డిగ్రీని కూడా అందిస్తోంది.

### 900 ఏళ్ళ నాడే...

ఈ నవ్వుల డాక్టర్ అదేనండీ క్లౌన్‌డాక్టర్ కొత్తగా ఏమీ రాలేదు. 13వ శతాబ్దం నుంచే ఈ తరహా ఏర్పాట్లు ఉన్నాయంటున్నారు. కానీ వైద్యరంగంలో మాత్రం ఇది వెలుగులోకి వచ్చింది నోర్మన్ కజిన్స్ వల్లనే. 'సాటర్ డే రివ్యూ' అనే పత్రికకు ఎడిటర్‌గా పనిచేస్తున్న కజిన్స్ 1970 దశకంలో తీవ్రమైన యాంకిలైస్ స్పాండిలైటిస్ అనే సమస్యతో బాధపడ్డాడు. నొప్పి నుంచి ఉపశమనం కోసం చాలా ప్రయత్నాలు చేశాడు. కానీ ఏవీ ఫలితం ఇవ్వలేదు. ఓసారి క్లౌన్ ప్రదర్శన తిలకించిన సందర్భంలో నొప్పి జాడ తెలియలేదు. ఈ విషయం పసిగట్టిన ఆయన ఇక నవ్వుల్ని వదల్లేదు. అలా కొంతకాలానికి పూర్తిగా కోలుకున్నాక తన అనుభవాన్ని పత్రికలో ప్రచురించారు. దాంతో విశేష ప్రచారం లభించింది. 1993లో ఫ్రెంచ్ సంగీతకారుడు ఆన్తోనిన్ మారెల్, స్పెయిన్‌కు చెందిన క్లౌన్ టోర్టెల్ పాల్టొవాతో కలిసి క్రొయేషియాలో శరణార్థి శిబిరం సందర్శించారు. వారు ఊహించని విధంగా సుమారు 700 మంది చిన్నారులు వారి ప్రదర్శనలకు కేరింతలు కొట్టారు. భయానక పరిస్థితుల్లో అప్పటి వరకు విచారంగా గడిపిన వారంతా ఒక్కసారిగా హుషారెత్తిపోయారు. ఈ రంగానికి ఇదో బూస్ట్. న్యూయార్క్‌లో 'బిగ్ ఆపిల్ సర్కస్ క్లౌన్ కేర్ యూనిట్ 1986లోనే ఈ క్లౌన్ సేవల్ని మొదలెట్టేసింది. అయితే తొలుత చికిత్సలో దీన్ని ఉపయోగించింది మాత్రం ప్యాచ్ ఆడమ్స్ అనే అమెరికా వైద్యుడు. వైద్యరంగంలో హ్యూమర్ థెరపీ ప్రభావానికి గుర్తింపు తెచ్చిన ఆయన మీద ఓ సినిమా కూడా హాలీవుడ్‌లో తెరకెక్కింది. అమెరికా, యూరోప్ దేశాల్లో క్లౌన్ డాక్టర్లను ప్రత్యేకంగా వినియోగించుకుంటున్న ఆస్పత్రులు చాలానే ఉన్నాయి.

### మిస్ హీ హీ మిస్టర్ హా హా

చండీగఢ్‌లోని ప్రఖ్యాత పిల్లల హాస్పిటల్ (పీజీఐఎమ్‌ఈఆర్) డాక్టర్లు భవనీత్ భారతి, ప్రభుజ్యోతి మాల్హీ. వీరిద్దరూ 'మిస్ హీ హీ' – 'మిస్టర్ హా హా'గా చండీఘఢ్ వాసులకు సుపరిచితం. పిల్లలకు వారు డాక్టర్లుగా కాదు స్నేహితులుగా అల్లుకుపోతారు. ఆసుపత్రిలో సందడిచేస్తూ పిల్లలకు హాస్పిటల్ అంటే ఉండే భయం పోగొడతారు. అందులోనే ఉన్న అకాడమీ ఆఫ్ పీడియాట్రిక్ కేర్ విభాగానికి కూడా సారథ్యం వహిస్తూ క్లౌన్ డాక్టర్ సేవల ప్రభావాన్ని మిగతా వారికి కూడా తెలియచేస్తున్నారు. నిత్యం ఎంతోమంది ఈ హాస్పిటల్‌ని సందర్శిస్తుంటారు. వారందరి నుంచి చిరునవ్వుల గలగలలు పొంగిపొర్లడానికి ఈ వైద్యజంట ముందడుగే కారణం. అలాగే అదే రాష్ట్రానికి చెందిన రంగస్థల దర్శకులు సుఖ్‌మణి కోహ్లీ ఇదే బాట. ఆయన కూడా వివిధ వర్క్‌షాపుల ద్వారా క్లౌన్ డాక్టర్లపై అవగాహన కలిగిస్తున్నారు. 'ఫ్రెండ్ దెయిర్ క్లౌన్' పేరిట క్లౌన్ థెరపీ అందిస్తున్నారు. చెన్నై, పుదుచ్చేరి లాంటి నగరాల్లో ఇప్పుడిప్పుడే క్లౌన్ డాక్టర్ల సందళ్లు మొదలయ్యాయి ఇదీ ఓ రకమైన వృత్తి అనే స్పృహ కలిగితే ఈ రంగానికి ఆస్పత్రి యాజమాన్యాలు, వైద్య బృందాల ప్రోత్సాహం లభిస్తే విదేశాల్లో మాదిరిగా క్లౌన్ థెరపీ కూడా ఓ కెరీర్‌గా మారే అవకాశం ఉంది. దీనివల్ల ఉద్యోగావకాశాలతో పాటు ఆస్పత్రి సేవలు మెరుగుపడతాయి.

–విజేత



## మనదేశంలో ఇప్పుడిప్పుడే



విదేశాల్లో ప్రాముఖ్యం పొందిన ఈ క్లౌన్ థెరపీ మనదేశంలో చాలా తక్కువ. మనదేశంలో చాలా ఆస్పత్రుల యాజమాన్యాలకు ఇటువంటి సేవలు ఉంటాయనే విషయం కూడా తెలీదు. క్లౌన్స్ విత్‌అవుట్ బోర్డర్స్, ది హ్యూమర్ ఫౌండేషన్, క్లౌన్ హీలర్స్, హోప్ డాక్టర్స్ వంటి సంస్థలు మహా నగరాల్లో ఈ వృత్తిని అలవాటు చేస్తున్నాయి. ■

## ఖుషీ ఖుషీగా నవ్వుతూ



'మనిషికి కష్టకాలం ఉండొచ్చు. అంత మాత్రాన నవ్వుల పరుగు ఆపకండి. నవ్వులతో మీ కష్టాలన్నీ దూరమవుతాయి. నవ్వులు మీ ఆలోచనను పక్కకు తప్పిస్తాయి.' సిస్టంని రిఫ్రెష్ చేయకపోతే ఎలా హ్యాంగ్ అవుతుందో మనిషి మెదడు కూడా అంతే. మెదడును నవ్వుతో రిఫ్రెష్ చేయాలి. లేకపోతే మనిషి బుర్ర కూడా ఆలోచనలతో హ్యాంగ్ అవుతుంది. ప్రతిదాన్నీ సమస్యగా చూసేవారికంటే ఎక్కువగా నవ్వుతూ ఉండేవారే ఎక్కువకాలం జీవిస్తారని అనేక పరిశోధనల్లో తేలింది. అంతేకాదు అది గాయాల తాలూకు బాధ, నొప్పి తీవ్రతల్ని తగ్గిస్తుంది.

నవ్వు జీవక్రియల వేగాన్ని పెంచుతుంది. ఆరోగ్యవంతమైన డైటింగ్‌తో ఇది జతకడితే కొవ్వును కరిగించేస్తుంది. స్థూలకాయం నుంచి బయట పడేస్తుంది. ■

# అర్థంలేని ఆత్మాభిమానాలు

సుంకర కోటేశ్వరరావు

**పనికట్టుకుని బదిలీ చేయించుకుని పూనే వెళ్ళిపోయాడు మంగతాయారు పెద్దకొడుకు భాస్కర్. అక్కడ కాపురంపెట్టిన పక్షం దినాలకు తమ్ముడు రమేష్‌కు ఓ సుదీర్ఘమైన లేఖ రాశాడు. ఆ లేఖను లాయర్ విష్ణుమూర్తి చిరునామాకు కొరియర్ చేశాడు. రమేష్ ఆయన దగ్గర జూనియర్‌గా పని చేస్తున్నాడు. అన్నయ్య రాసిన లేఖ అందుకుని ఆశ్చర్యంగా ఆ కవరు విప్పాడు రమేష్.**

"తమ్ముడూ, ఎంతోకాలంగా నాలో దిగులు రేపుతున్న కొన్ని విషయాలు నీకు చెప్పి నా ఆవేదన, ఆందోళన నీతో పంచుకోవాలనీ, నువ్వు లాయరువి కాబట్టి బాగా ఆలోచించి సమస్యలన్నీ పరిష్కరించే ప్రయత్నం చేస్తావనే ఆశతో ఇది రాస్తున్నా. రమేష్! ఒక ముఖ్య విషయం, చదవగానే ఈ ఉత్తరం చించిపారేయడం మరచిపోకు.

రమేష్! కూడూ, గుడ్డకు కొరతలేకపోయినా మన ఇల్లు ఒక శత్రుశిబిరంలా తయారైంది. ఉన్న నలుగురైదుగురిలోనే ఒకరంటే ఒకరికి పడదు. అకారణ ద్వేషం, విముఖత, ఒక్కొక్కరు మాట్లాడే విధానంలోనూ, ఉపయోగించే భాషా స్థాయిలోనూ తేడాలుంటాయి. సౌమ్యత, రమ్యత, ఆప్యాయత, ఆకట్టుకునే విధానం ఆ మాటల్లో కనిపించనే కనిపించదు. ఎందుకో ఏమిటో అర్థం కాదు. పదవీ విరమణ తర్వాత నాన్న, ఇంటి యజమాని పదవిని కూడా కోల్పోయాడు. ఇంట్లోవాళ్లకి ఆయనో డెడ్‌వుడ్‌లా కనిపిస్తున్నాడు. చాలా ఆశ్చర్యకరమైన విషయం ఏంటంటే తెలుగు ఇల్లాలు ఎక్కడా ఏ పరిస్థితుల్లోనూ చదువు, సంస్కారం, ధనబలంతో బలిసిపోతేతప్ప భర్తల గురించి చెడుగా తప్పుగా మాట్లాడడం నేను ఎక్కడా కనలేదు, వినలేదు. మరి అమ్మ ఎందుకిలా ద్వేషం కుమ్మరిస్తోందో నేను అర్థంచేసుకోలేక పోతున్నారా తమ్ముడూ!

'మీనాన్నకు మీరంటే ఇష్టం ఉండదు. అందుకే మీకు మంచి చదువులు చెప్పించలేదు. సరైన సంబంధాలు కుదర్చలేదు. దానివల్లనే మీరు అత్తింట సుఖంగా ఉండలేక నానా దిక్కుమాలిన యాతనలు పడుతున్నారు...' లాంటి నూరిపోతలతో తరచూ ఆడపిల్లల ఆలోచనల్ని డైవర్ట్‌చేస్తోంది. వాళ్ళు కూడా అమ్మ చెప్పేదాంట్లో సత్యం ఎంతుంది, నిజంగానే తండ్రివల్ల తమకు అన్యాయం జరిగిందా? ఆయనకు నిజంగానే తమపై ప్రేమలేదా! అని ఆత్మవిమర్శ చేసుకోకుండా గుడ్డిగా నమ్మేసి ఆయన్ని దూరంగా ఉంచుతున్నారు. దానికి తోడు అన్నిటికీ సమాధానంగా ఆయన తన పంథాలో ప్రకటించే సుదీర్ఘ మౌనం, ఈ ప్రచారానికి రుజువుగా నిలిచి ఆయనపట్ల ఎవరికీ గౌరవమే లేకుండా పోయింది.

ఆయన పట్ల ఈ కాటక పరిస్థితులకు కారణం కేవలం ఎప్పుడో చనిపోయిన నానమ్మపట్ల నాన్న ప్రకటించే ప్రేమ, అమ్మకు అప్పటికే ఆమెపట్ల స్థిరపడ్డ విముఖత, ద్వేషం మాత్రమేనని నాకు అనిపిస్తుంది. దాంతో తరచూ గొడవలు. ఈ రావణకాష్టం వల్లనే మన చదువులు ఆశించినంతగా సాగకపోవడం, ఎదురయ్యే ప్రతి విషయంపైనా అనుమానాలు, నిరంతరం అభద్రతాభావం ఇలా మానసికంగా పారిపోతున్నామేమోనని నేను తరచూ ఆలోచిస్తుంటా!

అమ్మ సామ్రాజ్యంలోకి నీరజ అడుగుపెట్టిన తర్వాత అమ్మ పోరుదారి మారింది. అమ్మ నోటికీ మనసుకూ నీరజ ఆటబొమ్మలా అందింది. ఇంకేముంది కొత్త తరహా పోరు! ఈ కొలిమిని ఆర్పి ప్రశాంతత చేకూర్చడానికి నేనేమీ చేయలేకపోయాను. ఇంటికి సంబంధించిన ఇలాంటి విషమ పరిస్థితుల్లో అశక్తత, అనాసక్తతతో ఒక గబ్బిలంలా ఉండిపోయాను. సమస్య తలెత్తగానే పిరికితనాన్ని కప్పుకొని తప్పించుకుపోయేవాణ్ణి. నువ్వు చదువుకోసం ఇంటికి దూరంగా ఉండడంతో నీకు పూర్తి అవగాహన లేదు. నేను మాత్రం ఎవర్నీ ఒప్పించలేని, నొప్పించలేని జడత్వంతో పూర్తిగా ఓటమి ఒప్పుకోలేక నీరజ రక్షణ, నా మనశ్శాంతి, పిల్లల భవిష్యత్తు ఆలోచించి నాకిష్టం కాకున్నా ఇలా దూరంగా పారిపోయి వచ్చేశాను.



మీ వదిన నీరజ అమాయకురాలురా! తనకు ఓర్పు అనంతం. తన పట్ల జరిగే హింస, అన్యాయాలపై తిరగబడే నేర్పు లేదా అందర్నీ తనవైపు తిప్పుకోగలిగే లౌక్యం ఆమె తల్లి ఆమెకు నేర్పి ఉంటే పరిస్థితులు ఇంకోవిధంగా ఉండేవేమో! సుజాతలా నీరజకు గట్స్ లేవు. నేనెవరినీ ఉద్దేశించి నిందాపూర్వకంగా ఈ మాటలు అనడం లేదురా. అమ్మంటే నాకెంతో భయభక్తులున్నాయి.

ఒక కోడలుగా, అమ్మగా, అత్తగా అనేక అనుభవాలపై నడిచి వచ్చిన అమ్మ, తన కూతుళ్లు సుఖంగా ప్రశాంతంగా సంసారాలు చేసుకోగలిగే సూత్రాలు, చిట్కాలు, వాళ్లకి బోధించకపోగా చిత్రంగా వ్యతిరేకతను మప్పింది. సరళక్క ఎన్నో ఒడిదుడుకుల తర్వాత భర్త బదిలీవల్ల దూరంగా బెంగుళూరు చేరి ఇప్పుడు బావ, పిల్లలతో ప్రశాంతంగా ఉంది. ఇక సుజాత పెళ్ళప్పుడు అప్పగింతలకు ముందే దానికి అన్నీ నూరిపోసింది. 'అత్తా ఆడబిడ్డలతో అతిగా రాసుకు పూసుకోకు. వాళ్ళతో ఎంతవరకో అంతవరకే బెట్టుగా ఉండాలి. ఎప్పుడైనా ఎవరైనా మాట మిగిలారో ఒకటికి రెండంటించు..నంగిలా మే..మే అన్నావో నెత్తికెక్కుతారు' లాంటి మాటల్తో ఈమెను వాళ్ళక్కాదు, వాళ్ళనే కూతురికి అప్పగింతలు చేసింది అమ్మ.

ఆచరణలో సుజాత అంతవరకే ఆగక ఇంకా రెండాకులెక్కువగానే చదివానన్నట్లు మొగుడు కన్నతల్లితో మాట్లాడినా, తన దగ్గర తల్లి విషయం ప్రస్తావించినా కస్సున లేచి 'మీ అమ్మమాట నాదగ్గర చెప్పొద్దు' అంటూ నోరు మూయించేది. అతనికి ఉద్యోగం ఉన్నవూళ్లోనే అయినా మొత్తుకుని బెదిరించి వేరింటి కాపురం పెట్టించింది. పోనీ అద్దైనా పదిలం చేసుకుందా అంటే లేదు! భర్త కొంచెం ఆలస్యంగా ఇంటికొస్తే..'అమ్మ దగ్గరకెళ్లొస్తున్నారా?..మీ నాన్నను ఆసుపత్రికి తీసుకెళ్ళడానికి మీరే వెళ్ళాలా? ఇంకెవరూ లేరా?..మొన్న ఆ మధ్య మీ చెల్లెలింటికెళ్ళి డబ్బిచ్చి వచ్చారటగా? మీ మేనల్లుడి పుట్టినరోజున బట్టలు కొనిచ్చారటనే. సంపాదనంతా ఇట్లా నిప్పుల్లో పోస్తుంటే మేమే మైపోవాలి? దూరంగా బదిలీ చేయించుకోండి బతికిపోతాం' లాంటి అపోహలు, అభాండాలు, సూటిపోటి మాటలతో సాధించి అతనికి విసుగూ, వెరపూ పుట్టించింది. క్రమేపీ అదొక ఫోబియాగా, అర్థంలేని ద్వేషంగా మారి తిరిగి అతగాడు తన తల్లిదండ్రుల ఇంటికి మకాం మార్చక తప్పనిస్థితి వచ్చేవరకూ రగిలించింది. దాంతో పంతంపట్టి సుజాత బెదిరింపుగా పుట్టింటికొచ్చేసింది. రెండుమూర్ఖత్వాల మధ్య ఆర్నెల్లు గడిచింది. నాన్న తన ప్రయత్నాలు తాను చేశాడు. వెళ్ళి వాళ్ళతో మాట్లాడి వచ్చి వాళ్ళింట్లో దిగబెడతాను రామ్మా అంటే సుజాత వెళ్ళనంది. మొగుడు తానుగా వచ్చి వేరే ఇంట్లోనే ఉందాం రమ్మంటేనే వెళ్తానంది.

అమ్మ అయితే అల్లుడిపైనా వియ్యాలవారిపైనా పోలీసు రిపోర్టు ఇమ్మంటోంది, కేసుపెట్టి మనం ఇచ్చిన కట్నకానుకలు మొత్తం వసూలు చేయమని ఒకటే పోరు. ఆమె చెప్పేది తెగతెంపుల దశ. మరి కూతురు భవితవ్యం..? దానికి నాన్న అంగీకరించలేదు. చేయగలిగింది మరేం కనిపించక ఆయన మిన్నకుండిపోయారు. అలా ఊరుకుంటే కూతురు సంసారం గురించి పట్టించుకోవడంలేదని రభస చేస్తుంది. అది ఆయన చేతగానితనంగా చిత్రించి టముకేస్తుంది. అదిగో అందుకే అలా అన్నింటికి మౌనమే సమాధానంగా చేసుకున్నాడు ఆయన. పరిస్థితులలా శ్రుతిమించి ఆయనలోని తొలినాళ్ల చలాకీతనం, జోవియాలిటీ, నవ్వులు, మాటలు చివరకు మనోధైర్యం కూడా ఎవరో కాజేసి పట్టుకుపోయినట్లు పూర్తిగా బోసిపోయి మౌనమునిలా రోజులను వెళ్ళదీయడానికి అలవాటుపడ్డాడు.

చుట్టాలు, పక్కాలు అయినవాళ్ళందరూ అప్పడప్పుడూ వచ్చిపోతుంటేనే అది చక్కని చల్లని సంప్రదాయ కుటుంబం అనిపించుకుంటుందనీ, పరిమళాలు వెదజల్లే రకరకాల పూలచెట్లతో నిండిన సుందరనందనవనంలా ఆ లోగిలి కళకళ్లాడుతుంటేనే అందం ఆరోగ్యం సౌభాగ్యం చేకూరుస్తుందనీ ఎంత చెప్పినా అమ్మకు అర్థం కాదు. ఒప్పుకోదసలు. కనీసం ఆలోచించదు.

ఇక నావిషయానికొస్తే కొన్నాళ్లక్రితం అమ్మ నీరజ విషయంలో మనింట్లో లేవదీసిన దృశ్యం మీరంతా చూశారు కదా! ఆరోజు నేను క్యాంప్ నుండి ఇంటికొచ్చానని తెలిసి నీరజ పిల్లల్ని తీసుకుని పుట్టింటి నుంచి వచ్చింది. కోడల్ని చూస్తూనే అమ్మ భగ్గుమంది. "ఏమే! ఎన్నాళ్లైంది నువ్వు ఇల్లొదిలి వెళ్ళి? మొగుడొస్తున్నాడనే వాసనపట్టి మరీ వచ్చివాలావా? డబ్బు గురించేమన్నాడు నీ బాబు? అస

లడిగావా లేదా? మాట్లాడవేం నంగిలాగా? ఇదిగో చూడు మళ్లీ చెబుతున్నా ఇప్పటికే ఇద్దరాడగుంటలను కని మానెత్తిన ఎక్కిచ్చావు. మళ్లీ సిద్ధమైనావు. ఈసారి ఆడముండనే కన్నావో నీ ఒళ్లు కుమ్మరావంలో కెళ్లుద్ది జాగ్రత్త! బతికుండాలంటే మగనలుసునన్నా కనాలీ లేదూ ఈ ఆడగుంటల పోషణకు, పెళ్ళీ పేరంటాలకు మీ బాబు నడిగి జీవానికి ఐదులక్షల వంతున పరిహారమన్నా పట్రావాలి. అర్థమైందా? మాట తప్పావో...తెలుసుగా ఈ మంగతాయారు వీరంగం?" అదిరా అమ్మ ఆర్డినెన్సు. నా కళ్ళ ముందే ఇదంతా! నేనేమనగలను. నోరు విప్పి అమ్మ ముందు ఇంట్లో మనగలనా?

రమేష్! నీరజ ఈసారీ ఆడబిడ్డనే కంటుందని నాకు తెలుసు. కారణం పునరుత్పత్తి ప్రక్రియలో ఒక్క భార్య ప్రమేయమే ఉండదు. ఆడసంతానం విషయంలో మగవాడి క్రోమోజోమ్స్ ఎక్కువ ప్రభావం కలిగిస్తాయని విన్నా. అమ్మకు ఏమని చెప్పగలం? చెప్పినా ఆమె నమ్మదు. అసలు ఒప్పుకోదు. ఒక్క అమ్మే కాదురా చాలామంది అత్తలు ఆడపిల్లల్ని కనే విషయంలో కోడళ్లది తప్పే కాదు, నేరం అని కూడా తీర్మానిస్తారు. అందులో తమ కొడుకు ప్రమేయం ఏమీ ఉండదనే గట్టి నిశ్చయంతో ఉంటారు.

**మొండి వైఖరితో చక్కని కుటుంబంలో మనశ్శాంతిని పాడు జేసింది ఆ కన్నతల్లి. దాంతో యజమాని పదవి కోల్పోయాడు తండ్రి. కూతుళ్ళకు లేనిపోనివి నూరిపోసి కన్నతండ్రిపై వారికి విరక్తి కలిగించింది. కోడలిని రాచిరంపాన పెట్టింది. చేయగలిగినవన్నీ చేసింది. పెద్దకొడుకు అశక్తుడై దూరంగా వెళ్ళిపోయాడు. మరి చిన్న కొడుకు ఏం చేశాడు? ఆ కుటుంబాన్ని అతడేమన్నా ఉద్ధరించ గలిగాడా?**

నాకు మరోపెళ్ళి చేసైనా సరే వంశాకురాన్ని పొంది తీర్తానని అమ్మ తరచూ సవాల్ విసురుతోంది. ఈ విషయమై పదేపదే హెచ్చరిస్తూ నీరజను భయభ్రాంతురాల్ని చేస్తూ ఉంటుంది. ఈ భయంతో నీరజ మనస్థిమితం కోల్పోయే పరిస్థితి. ఈమధ్య నేనూ అప్సెట్ అవుతున్నాను. దౌర్భాగ్యం షుగర్ ప్రాబ్లం కూడా కన్పించిందీ మధ్య. ఎన్నో రోజులు ఎన్నో విధాలుగా ఆలోచించాను దూరంగా వెళ్ళిపోవడానికి. లక్కీగా పూనే హెడ్డాఫీసుకు ఒక సిన్సియర్ వర్కర్ గురించి కంపెనీ వెదుకుతోందని తెలిసింది. నేను వెంటనే అప్రోచ్ అయ్యాను. నాకు హిందీ కూడా వచ్చి ఉండడంతో వాళ్లూ సంతోషంగా బదిలీ ఇచ్చారు. జీతమూ పెరిగింది. నాకూ నీరజకూ సంతోషంతోపాటు మనసులు తేలికపడ్డాయి. నేనుగా బదిలీ చేయించుకుని దూరంగా వెళ్ళిపోయానని తెలిస్తే అమ్మ నన్నెప్పటికీ క్షమించదు. ఇదిరా తమ్ముడూ! నా ఆవేదనా తరంగం!

రమేష్! ప్రత్యేకంగా నీకో సలహా. ఇది సరైనదో కాదో నాకు తెలీదు. నువ్వు బాగా ఆలోచించి నిర్ణయం తీసుకో. అమ్మ నీడలో ఇప్పట్లో నువ్వు పెళ్ళి చేసుకోకుండా వెయిట్ చేయడమే మేలని నేను అనుకుంటున్నా. నానమ్మ దురదృష్టవశాత్తూ జారి పడి తుంటి విరిగి, బతకాలనే ఆశతో కన్నబిడ్డ పంచకు వస్తే 'నీ మురికి కోక ఎవరు ఉతుకుతారే ముసల్దానా?' అంటూ అమ్మ ఆ ముదివగ్గుపై చేయి చేసుకుని నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొట్టింది. నాన్న కళ్ళూ, నోరూ తెరవలేకపోయారు. నానమ్మ గుడ్లనీరు కుక్కుకుంటూ తిరిగి వెళ్ళిపోయి ఆ మూరుమూల పల్లెలో అందరూ ఉండీ సరైన ఆలనాపాలనా లేక కుమిలికుమిలి బొగిలపోయి చచ్చిపోయింది. చెప్పొచ్చేదేమిటంటే, ఒకవేళ నువ్విప్పుడు పెళ్ళాడితే ఆ వచ్చే అమ్మాయి గడుసుదై అమ్మ మంచాన పడితే తనూ అలాంటి అవమానమేదైనా చేస్తే, అమ్మ తట్టుకోలేదురా, నువ్వూ సహించలేవు. అందుకే పెళ్ళి విషయంలో తొందర పడొద్దని నా సలహా. తర్వాత నీ ఇష్టం.'

ఉత్తరం చదవడం ముగించిన రమేష్ దీర్ఘ నిట్టూర్పు విడిచాడు.

కొన్నిరోజుల తర్వాత రమేష్ దగ్గర నుంచి వచ్చిన ఉత్తరం చదివి భాస్కర్ దిగ్భ్రాంతి చెందాడు. బాధతో కళ్ళు చెమర్చాయి.

మంగతాయారు తప్పనిసరై సుజాతతో చిన్నగా పనులు చేయించడానికి ప్రయత్నాలు మొదలు పెట్టింది. పెడద్రపుదైన సుజాత పెడిచెవిన పెట్టింది. కానీ మంగతాయారు వదల్లేదు. 'ఊరక తిని కూచుంటే కుదరదే. తిన్నది అరగడానికైనా పనులుచేయాలి' అన్నది. ఆమాటకు అభిమానపడింది సుజాత. ఇద్దరికీ మొండి పట్టుదలలూ, కరకు నోళ్లవడంచేత నిప్పు రాజుకుని రగడలు మొదలయ్యాయి. తల్లీ కూతుళ్ల మెలోడ్రామా, వాద ప్రతివాదాలు పని మనుషులకు వినోదవల్లరులయ్యాయి. రంగం సిద్ధం చేయడానికి తరచూ పనులు ఎగ్గొట్టి తమాషా చూచేవాళ్లు. పని అనే అవసరం భూతమై నిలిచి నిత్యరగడలకు నిలయమైంది ఇల్లు. కాళ్లకు అడ్డంగా



## సన్నబడదట!

నిన్న మొన్నటి దాకా కీర్తి సురేష్ అభిమానుల్లో ఓ అనుమానం, భయం ఉండేవి. అవేమంటే.... 'సావిత్రి' సినిమా కోసం కీర్తి బరువు పెరుగుతుందా? అని. గతంలో ఓ సినిమా కోసం అనుష్క ఇలాంటి పిచ్చి పని చేసే ఇప్పుడు తీరిగ్గా బాధపడుతోంది. కీర్తి కూడా అలాంటి బాధే పడాల్సి వస్తుందని ఆమె అభిమానులు ఆందోళన చెందారు. కానీ వారి బాధా, అనుమానమూ అర్థం లేనివే అని కొట్టి పారేసింది కీర్తి సురేష్. 'సావిత్రి' సినిమా కోసం తానేమీ బరువు పెరగడం లేదనీ, మేకప్‌తో దాన్ని కవర్ చేస్తాననీ చెప్పింది. వాస్తవానికి ఓ సినిమా కోసం ఉన్న బరువును తగ్గించుకుంటున్న తను తిరిగి బరువు పెరిగే ఆలోచన లేదు అని స్పష్టం చేసింది. అయితే ఈ మేకప్ ఏమైనా తేడా కొడితే అసలుకే మోసం వస్తుందన్న అనుమానాన్ని పలువురు వ్యక్తం చేస్తున్నారు.

పడి వున్న చీపురును ఎవరు వంగి ఎత్తి మూలన నిలబెట్టాలి అనే చిన్న విషయం గూడా పెద్ద రగడకు కారణమయ్యేది. కేవలం పని దగ్గర ప్రారంభమయ్యే గొడవ క్షణాల్లో తీవ్రరూపం దాల్చి ఇంకా అనేకానేక భూతవర్తమానకాల విషయాలకు మళ్లీ వాదపటిమ నిరూపణగా చివరిమాట తనదిగా నిలవాలనే మంకుపట్టు వలనా ఎవరూ తగ్గక రెచ్చిపోవడం పోరు సమసిపోక కొద్ది విరామాల్తో రగులుకుంటుంది. బద్ధ శత్రువులయ్యారు. వీళ్ల అరుపులతో వీధిలో జనాలు పోగై నవ్వులు, గుసగుసలతో ఉచిత వినోదం ఆస్వాదిస్తున్నారు. తెలియనివాళ్ళు అలా కొట్లాడుకునేది స్వయానా తల్లీ కూతుళ్లంటే నమ్మని విషమపరిస్థితి ఉంది అక్కడ.

నాన్న ఏమీ చేయలేని స్థితిలో అవమానం, ఆవేదన కలవరపెట్టడంతో ఓ తెల్లవారుజామున లేచి ఎటో వెళ్లిపోయారు. వారమైందట. అదీ సారాంశం!

భాస్కర్‌కి చాలా బాధేసింది. ఇల్లువిడిచి దూరంగా వచ్చేసి తప్పుచేశానా? నీరజ అక్కడుంటే ఇల్లు రచ్చ బండయ్యేది కాదు గదా! ఆలోచనలు కందిరీగల్లా ముసిరాయి.

ఆలోచనలు ఒక కొలిక్కి రాకముందే మరో పక్షం దినాల్లో మరో ఉత్తరం వచ్చింది రమేష్ నుండి. వణుకుతున్న చేతులతో విప్పి చదువుకుని కన్నీళ్ళు ఆనందం కలగలసిన నవ్వులతో శభాష్ తమ్ముడూ! అంటూ అప్రయత్నంగా పొలికేక పెట్టాడు. మరొక్కసారి చదువుకున్నాడు.

మార్కెట్ సెంటర్‌గా మారిన ఇంటిని చూచి ఆవేదన చెందాడు రమేష్. నిప్పునార్పలేకపోతే లా డిగ్రీ ఎందుకనుకున్నాడు. ఆలోచించాడు. సుజాతను ఎలాగైనా భర్త దగ్గరకు పంపగలిగితే ఒక సీరియస్ సమస్య వగతెగడమే కాకుండా శాంతిస్థాపనకు మార్గం సుగమం అవుతుంది. సుజాతను డీల్ చేయడమెలా? ఇటు కుదరకపోతే కుంచం తిరిగేసి కొలవాలి. తన సీనియర్ని సంప్రదించాడు. ఆయన తక్షణం పాజిటివ్‌గా స్పందించాడు. తన బంధువైన ఓ రిటైర్డ్ డియస్పీని తీసుకుని ఏరియా డియస్పీని కలిసి విషయం వివరించి తాడు తెగకుండా సున్నితంగా పరిష్కరించమని పజిల్‌ని ఆయన చేతుల్లో పెట్టారు.

డియస్పీ చాకులాంటి కుర్రాడు, సిన్సియర్. సాయంత్రానికి సుజాత భర్త కుమార్‌ను పిలిపించి పోలీసుభాషలో క్లాసు పీకాడు. కొత్తగా కాపురానికి వచ్చిన భార్య వేరు కాపురం ఉందామని భర్తను కోరడం నేరం కాదు. అదామె హక్కు కూడా. భార్య సరదాగా అలిగి పుట్టింటికి వెళ్తే స్పందించవా? వెళ్ళి వెంటబెట్టుకు తెచ్చుకోవడం అభిమాన భంగమా? ఆమె పెళ్ళినాడు తెచ్చిన మూటను నిస్సిగ్గుగా అనుభవించడం ఆత్మాభిమానం క్రిందికి రాదా? ఇదేనా చదువుల సారం? నిజంగా ఆమె నీకూ మీ అమ్మకూ అయిష్టం అనిపిస్తుంటే పెళ్ళినాడు పుచ్చుకున్న కట్నకానుకలూ, నగానట్రాపైసలతో సహా పట్టుకురా. వాళ్ళను ఒప్పించి విడిపత్రాలు రాయిస్తా. ఎవరికీ సమస్యలుండవు. అలాకాదు భార్యంటే ఇష్టమేనంటే




రెండు మూడు చినుకులకే
ఇసుక గూళ్ళలా పికిలి పోతామా!
చిన్నచిన్న జల్లులకే
కాగితం పడవల్లా కొట్టుకుపోతామా!

## వర్షం ఒక రాగం

ఆకాశం కింద అరచేతులు చాచండి
అమ్మ ముద్దుల్లా స్పర్శిస్తాయి

నిన్న మొన్నటిదాకా
నిప్పులు కురిశాయి
ఎండలకు ఎండిపోయి
దేహాలు బీటలు బారాయి
పన్నీరులా వాననీళ్ళను పారనీయండి
గుండె కాస్త చల్లబడుతుంది

తుఫానుకు బెదిరిపోవాలి కాని,
తొలకరికి వెరపెందుకు
నాలుగు చినుకులు రాలనీయండి
వేలరంగులు మొలకెత్తుతాయి

వర్షం ఒక మధురమైన రాగం
చినుకంత సౌందర్యమున్న
సంగీత సామ్రాజ్ఞి

*'కౌశికీ చక్రవర్తి'ని పాడనీయండి
మెత్తబడే దాకా తడుద్దాము
తలా కొంచెం కొంచెం
దోసిళ్ళలో పాటను పంచుకొందాము

బుడిబుడి అడుగుల్లా
ముత్యాలు జారనీయండి



మంద్రంగా వాద్యాలు మోగనీయండి
కడిగిన ముఖాల్ని
అద్దంలో కొత్తగా నవ్వనీయండి
కళ్ళు మూసుకుని మెల్లగా
తన్మయత్వం చెందనీయండి
మెత్తని పువ్వుల్లా వర్షం పడనీయండి

*Kaushiki chakra Borty
ప్రఖ్యాత Indian Vocalist

—ఆశారాజు

సెల్: 93923 02245

వెంటనే వెళ్ళి భార్యను తెచ్చుకుని వేరు కాపురం పెట్టు. అమ్మా బొమ్మా జాన్తానై. ఇది రెండు రోజులలో తేలాలి. లేలాయిస్తే 498–ఏ క్రింద నిన్నూ మీ అమ్మతో సహా కుటుంబ సభ్యులందరికీ జైలు గదులు పరిచయం చేయాల్సి ఉంటుంది. మా వాళ్ళు అసలే ఇద్దరిపై కంప్లయింటుంటే నలుగుర్ని లోపల వేసి ఆటాడుకుంటారు. బెయిల్ రాదు, ఉద్యోగమూ ఊడుతుంది. చక్కగా బొంగరాల్లా జాలీగా తిరిగే జీవితాలు ఊహించని విధంగా తిరగబడ్తయ్" కూల్‌గా ఎక్కించిన నరమింజెక్షనిది.

కుమార్‌కి బట్టలు తడిశాయి చెమట్లతో. మారు మాట్లాడకుండా అటు నుండి అటే సుజాత దగ్గర కెళ్ళి బ్రతిమిలాడి మరీ ఆమెను తీసుకుపోయాడట. తల్లితో విసిగిపోయి ఉన్న సుజాత కూడా వెంటనే మూటాముల్లె సర్దుకుని అందుకే సిద్ధంగా ఉన్నట్టు వెళ్ళిపోయిందట.

ఎంతో జఠిలమనుకున్న ఆ సమస్య అలా సులభంగా పరిష్కరించబడి, చిక్కుబడి చికాకెత్తిస్తున్న మరోముడికూడా విడిపోయేందుకు దోహదపడడం రమేష్‌కు ఎంతో ఆనందమైంది కాబోలు..

"నాన్నదేముంది అన్నయ్యా! గానుగెద్దు తిరిగి తిరిగి బయల్దేరిన చోటుకే చేరినట్లు, సుజాత భర్త దగ్గరకు వెళ్ళిపోయిందని తెలియగానే తిరిగి ఇల్లు చేర్తాడు. అన్నయ్యా నేను కూడా త్వరలో హైదరాబాద్ మకాం మారుస్తాను. రాష్ట్రం రెండుగా విడిపోయి చాలాకాలమైనా హైకోర్టు విడిపోయి మనదిగా మనకు మనరాజధాని రావడానికి ఇంకెన్నాళ్లో పట్టేట్టువుంది. అందుకని విష్ణుమూర్తిగారు హైకోర్టు లాయరుగా వెళ్తున్నారు. నే ఆయనను ఫాలో అవుతా! మూడో వ్యక్తి లేకుంటే అమ్మానాన్న ఒకరికి ఒకరుగా హాయిగా ఉంటారు. వాళ్ల కాళ్లూ చేతులూ చల్లగా ఉన్నంతకాలం వాళ్లకు మరే సమస్యలూ ఉండవు" అంటూ ముగింపిచ్చాడు.

అదీ నిజమే! కాదు అదే నిజం రమేష్... లాయరనిపించుకున్నావురా! నిజంగా యువార్ గ్రేట్ రా! థాంక్యూ రా తమ్ముడూ! థాంక్యూ వెరీమచ్! భాస్కర్ ఆనందానికి అవధుల్లేవు.

సెల్: 99480 23464




## కూరగాయలతో మెనోపాజ్‌కు చెక్!

స్త్రీ జీవితంలో ఎదురయ్యే సహజమైన ప్రక్రియ మెనోపాజ్. మామూలుగా 50 నుంచి 55 ఏళ్ళలోపు ఎదురయ్యే ఈ సమస్య ఇటీవలి కాలంలో 40 ఏళ్ళ వయస్సులోనే మహిళలు ఎదుర్కోవలసి వస్తోంది. మెనోపాజ్ ఎంత సహజమైనదే అయినా, దీని కారణంగా కొన్ని ఆరోగ్య సమస్యలు తప్పవు. త్వరగా వచ్చే మెనోపాజ్ కారణంగా ఆస్టియోపోరోసిస్, గుండె సంబంధిత సమస్యలు, నరాల అసమానతలు వంటివి వచ్చే అవకాశం ఎక్కువగా ఉంది అంటున్నారు నిపుణులు. ఇదే విషయం మీద సుమారు 85వేల మంది మహిళల మీద పరిశోధన నిర్వహించారు. వీరందరూ 40 నుంచి 55 సంవత్సరాల వయస్సు మహిళలే! వీరిలో కొందరికి ప్రతిరోజూ కేవలం కూరగాయల ఆహారమే అందించగా, మరికొందరికి వారంలో మూడు సార్లు, మరికొందరికి వారంలో రెండుసార్లు కూరగాయల ఆహారం అందించారు. అనంతరం వీరిని పరిశీలించగా ప్రతిరోజూ కూరగాయల ఆహారం తీసుకున్న వారిలో మెనోపాజ్ సరైన సమయానికి వచ్చిన విషయం గమనించారు. వారంలో రెండు లేదా మూడు సార్లు కూరగాయల ఆహారం తీసుకున్న వారిలో ఈ మార్పు గమనించలేదు. కేవలం కూరగాయల కారణంగానే అకాల మెనోపాజ్ నుంచి తప్పించుకోవచ్చా? అన్న విషయం మీద వీరు ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.



## అలసందలతో రక్తపోటు దూరం

రక్తపోటు అనేది ఇప్పుడు అందరినీ బాధపెట్టే ఆరోగ్య సమస్య అయిపోయింది. రక్తపోటు వలన అప్పటికప్పుడు వచ్చే పెనుముప్పు పెద్దగా లేకపోయినా దీర్ఘకాలంలో ఇది ప్రాణాంతకంగా మారే ప్రమాదం ఉందన్న వైద్యుల హెచ్చరికలను నిర్లక్ష్యం చేయకూడదు. ఈ సమస్యతో బాధపడేవారు మందుల మీద ఉన్న శ్రద్ధను ఆహారం తీసుకోవడం మీద ఉంచరు. ఆహారంలో ఉప్పును తగ్గించడం



మీద దృష్టి కేంద్రీకరిస్తారే తప్ప బీపీని అదుపులో ఉంచే ఆహారం గురించి ఆలోచించరు. రక్తపోటుతో బాధపడేవారికి అలసందలు మంచి మందుగా ఉపయోగపడతాయంటున్నారు నిపుణులు. వీటిని ఉడికించి చేసే ఆహారపదార్థాలు తీసుకుంటే రక్తపోటు అదుపులో ఉంటుందని వారు చెబుతున్నారు. వీటిల్లో ఉండే కాల్షియం, మెగ్నీషియం, పొటాషియం వంటి పోషకాలు రక్తపోటును అదుపులో ఉంచడానికి సహాయపడతాయంటున్నారు. రక్తపోటుతో బాధపడేవారు కాఫీ, టీలతో పాటు శీతల పానీయాలను తీసుకోవడం బాగా తగ్గించడం లేదా, తీసుకోవడం పూర్తిగా మానివేస్తే మంచిదని సూచిస్తున్నారు. వీటికి బదులుగా నీరు, పళ్ళరసాలను తీసుకోవాలని వారు సూచిస్తున్నారు.

## బరువులెత్తితే మతిమరుపు దూరం

బరువులెత్తే వ్యాయామాలు చేస్తే శరీర ఆరోగ్యంతో పాటు మతిమరుపు కూడా దూరం అవుతుంది అంటున్నారు ఫిన్‌లాండ్ పరిశోధకులు. ముఖ్యంగా బల్లపరుపుగా ఉండే బల్ల మీద పడుకొని బరువు లెత్తుతూ వ్యాయామాలు చేసేవారు వృద్ధాప్యంలో వచ్చే మతిమరుపు నుంచి చాలా వరకూ తప్పించుకోవచ్చని వీరి అధ్యయనంలో వెల్లడైంది. సుమారు రెండు వందల మంది మీద వీరు సుదీర్ఘకాలం అధ్యయనం నిర్వహించారు. వీరిలో ప్రతిరోజూ బరువులు ఎత్తుతూ వ్యాయామాలు చేసే వారు, మరికొందరు మామూలు వ్యాయామం చేసేవారు. వీరందరూ వృద్ధాప్యంలోకి ప్రవేశించిన తరువాత వీరి జ్ఞాపకశక్తిని పరిశీలించారు. బరు



వులెత్తుతూ వ్యాయామం చేసిన వారిలో మతిమరుపు లక్షణాలు బాగా తగ్గగా, మామూలు వ్యాయామం చేసిన వారిలో అలాంటి ఫలితం ఏదీ కనిపించలేదు.

## మైగ్రేన్‌తో గుండెకు ముప్పు

మైగ్రేన్ తలనొప్పితో బాధపడే మహిళల్లో గుండెనొప్పి వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్న సంగతి ఇటీవలి పరిశోధనల్లో వెల్లడైంది. అమెరికా, జర్మనీలలో మైగ్రేన్ తలనొప్పితో బాధపడే సుమారు లక్షన్నర మంది మహిళల మీద వీరు సుదీర్ఘ అధ్యయనం చేశారు. వీరిలో సుమారు పది



హేడు వేల మంది మహిళలు మైగ్రేన్ తలనొప్పితో బాధపడుతున్నారు. వీరిలో సుమారు పదిహేను వందల మంది గుండె వ్యాధుల బారిన పడినట్లు వీరు గుర్తించారు. మరికొంత కాలం తరువాత వీరిలో మూడు వందల మంది గుండెనొప్పితో మరణించారు. అయితే వీరి మరణాలకి మైగ్రేన్ తలనొప్పే కారణమన్న సంగతిని మాత్రం అధ్యయనంలో నిర్ధారించలేకపోయారు. అయితే మైగ్రేన్ తలనొప్పితో బాధపడేవారికి గుండెనొప్పి వచ్చే అవకాశాలు మాత్రం ఉన్నాయని వీరు చెబుతున్నారు. ఈ విషయం మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని వారు అంటున్నారు.

—అవినాష్

## సరదాగా....

### ఏప్రిల్‌ఫూల్

వీరేశం పరిగెత్తుకుంటూ వచ్చి, అప్పుడే కదులుతున్న సిటీబస్సు ఎక్కాడు. సీటు దొరకడంతో ఆనందంగా కూర్చున్నాడు. కండక్టర్ వచ్చి టికెట్టా, పాసా అని అడిగాడు. టికెట్ అని చెప్పి పది రూపాయలు కండక్టర్ చేతిలో పెట్టి ఎక్కడి వరకో చెప్పాడు. కండక్టర్ టికెట్ ఇవ్వగానే, వెంటనే సీటులోనుంచి పైకి లేచి "ఏప్రిల్‌ఫూల్! నా దగ్గర బస్సుపాసు ఉంది" అంటూ అందరినీ చూస్తూ చప్పట్లు కొడుతున్నాడు. ఎవరూ నవ్వక పోగా తనని పిచ్చివాణ్ణి చూసినట్టు అనిపించడంతో వీరేశం కండక్టర్ వైపు తిరిగి, "అయినా మా ఆఫీసు మా ఇంటికి దగ్గరే! మా ఇంటికి రెండు వీధుల అవతలే ఉంది. అది తెలుసుకోకుండా నువ్వు టికెట్ కొట్టావు. ఇవాళ ఏప్రిల్ 1. మరి నువ్వు ఏప్రిల్‌ఫూలే కదా! అంటూ మళ్ళీ నవ్వాడు.

### ఒక ప్రశ్న?

రమాభారతి రోజూలాగే ఆ రోజు కూడా సాయంత్రం ఆరు గంటలకల్లా పార్కుకు చేరుకుంది. తాను రోజూ మాట్లాడే, కబుర్లాడే స్నేహితురాలి కోసం చూసింది. ఆమె ఇంకా వచ్చినట్లు లేదు... ఎప్పుడూ తామిద్దరూ కూర్చునే స్థలంలో ఆమె జాడ లేదు. సరే కాసేపు అలా తిరిగొద్దామని చెప్పి నెమ్మదిగా పరిసరాలు పరికిస్తూ నడక ప్రారంభించింది. చల్లని సాయంత్రపు గాలిలో పొదలమాటున జంటల ఊసులాటలు, వాళ్ళని చూసి పెద్దవాళ్ళ రుసరుసలు గమనిస్తూ, నవ్వుకుంటూ ముందుకు వెళుతోంది. ఇంకోపక్క పల్లీలు అమ్మేవాడు, పాప్‌కార్న్, సోంపాపిడి అమ్మేవాళ్ళు వాళ్ళ బేరసారాల్లో వాళ్ళు మునిగిపోయారు. ఇంతలో దూరంగా పిల్లల గుంపు కనబడింది. అందరూ వరుసగా నిలబడి ఏదో ఆట ఆడుతున్నారు. వాళ్ళు ఆడేఆట ఏంటో చూద్దామని దగ్గరగా వెళ్ళింది రమాభారతి. పిల్లలందరూ వరుసగా కూర్చుని ఉన్నారు. అయితే ఆమె దృష్టి మాత్రం అందరిలోకి ఎత్తుగా, బొద్దుగా ఉన్న పిల్లాడి మీదే ఉంది. వాడు ఆ గుంపు లీడర్‌లా ఉన్నాడు. పిల్లలందరినీ కంట్రోల్ చేస్తూ, వారికి ఆట ఎలా ఆడాలో చెబుతున్నాడు. రమాభారతి ఎంతమంది పిల్లలున్నారో లెక్కపెట్టింది. ఆ లీడర్ పిల్లాణ్ణి చూసింది. వాడు సరిగ్గా అటునుంచి చూసినా, ఇటునుంచి చూసినా సరిగ్గా తొమ్మిదో స్థానంలో ఉన్నాడు. అయితే ఇక్కడ ప్రశ్న ఏమిటంటే అక్కడ ఎంత మంది పిల్లలున్నారు? ప్రయత్నించి మీరూ సమాధానం చెప్పేయండి.

17

సమాధానం

















మధుబాబు

# స్టార్ ఫైటర్

అనబడే ఫైటింగ్ ఫూల్

3

**'వస్తాను. ఈ గొడవకి సంబంధించిన పూర్తి వివరాలు ఇంకా కొన్ని తెలియాల్సి ఉంది. వాటిని తెలుసుకోకుండా హుహు సారు దగ్గరికి రాకూడదు. సాధ్యమైనంత త్వరగా వస్తానని, సారుకి నా అభ్యర్థనగా తెలియచేయండి' అంటూ ఫోన్ క్రెడిల్‌చేసి, తన కుర్చీలో కూలబడింది.**

**'మేడమ్... తలనొప్పిగా ఉన్నదా? వేడివేడిగా టీ తీసుకు రమ్మంటారా?' వెంటనే అడిగింది ఆ గది ముందు అటెంక్షన్‌లో నిలబడిన లేడీ కానిస్టేబుల్.**

'వేడివేడి టీతో తగ్గిపోయే తలనొప్పి కాదు ఇది...' సన్నటి కంఠంతో చెప్పింది మిచిషీ.

'నిజమే మేడమ్! హుహుసారు దగ్గరికి పోవటం కంటే షార్క్ చేపలున్న మడుగులో దిగి ఈతకొట్టడం చాలా బాగుంటుంది' చాలా సావధానంగా చెప్పి, తన చోటులోకి వెళ్ళి పోయిందా కానిస్టేబుల్.

క్షణక్షణానికి అధికం అయిపోతున్నట్టు అనిపించింది మిచిషీకి తనను ఆవరించుకున్న డిప్రెషన్. కుర్చీలో కూర్చున్నప్పుడు దూరదూరంగా పెట్టిన పాదాల్ని దగ్గరికి తీసుకున్నది. కుర్చీ చేతుల మీది తన చేతుల్ని ఒళ్ళో పెట్టుకుని గుండెలనిండా ఊపిరి పీల్చుకున్నది.

చిన్నతనంలో తనకు ఏదైనా సమస్య ఎదురైనప్పుడు, అందరి మాదిరిగా అల్లకల్లోలపడిపోకుండా ఉండటానికి ఆమె తాత ఒక చిన్న చిట్కా ఎక్సర్‌సైజును నేర్పాడు.

ఊపిరి గట్టిగా తీసుకుని మెల్లిగా బయటికి వదులుతూ, కళ్ళెదుట విరబూసిన నీలిరంగు నిగ్బా పువ్వులను ఊహించుకోమన్నాడు. అవి వెలువరించే మధురమైన వాసనలను తలచుకోమన్నాడు.

అప్పటినుంచి ఇప్పటిదాకా మనసు బాగా లేనప్పుడల్లా, ఆయన చెప్పినట్టే చేస్తూ వచ్చింది ఆమె. అరనిమిషంలో తన మనస్సులోని అల్లకల్లోలాల్ని తేలికగా ఎదుర్కోగలుగుతున్నది.

నేర్చుకున్న దగ్గర్నించీ ఎంతో ఉపయోగపడుతున్న ఆ చిట్కా ఈరోజు మాత్రం ఆమెను ఆదుకోలేకపోయింది.

అరనిమిషం కాదు పావుగంట గడిచిపోయిన తర్వాత కూడా ఏమీ ఉపయోగం లేకపోవడంతో, విసురుగా తల విదిలించి కుర్చీలో నుంచి లేచింది ఆమె. 'నేను ఒకసారి మా ఇంటికి పోయి, ఒక గంటలో తిరిగి వస్తాను. నా కోసం ఎవరైనా అడిగితే అదే చెప్పు' అంటూ గది వెలుపల ఉన్న కానిస్టేబుల్‌కి చెప్పి, వేగంగా ఆ బిల్డింగ్‌లో నుంచి బయటికి వెళ్ళిపోయింది.

'ఇంతకుముందు ఎప్పుడూ మేడమ్ ఇంత హడావుడి పడటాన్ని నేను చూడలేదు. ఏమిటి విషయం?' మిచిషీ ఎక్కిన కారు రోడ్డుమీదికి వెళ్ళిపోయిందని రూఢి అయిన తర్వాత ఆమె గది ముందున్న కానిస్టేబుల్‌ని అడిగాడు ఒక సీనియర్ కానిస్టేబుల్.

'హుహుశాన్ సారు స్వయంగా వచ్చి కలుసుకోమని కమాండ్ పంపాడు..' ముక్తసరిగా చెప్పిందామె.

'అయిపోయింది. మేడమ్ బతుకు నాశనం అయిపోయింది...' తనలో తను గొణుక్కుంటూ అవతలికి వెళ్ళిపోయాడు ఆ సీనియర్ కానిస్టేబుల్.

***

'రావే తల్లీ.... ఎప్పుడు వస్తావోనని ఎదురు చూస్తున్నా. ఫోన్ కూడా చేద్దామని అనుకుంటున్నా' ఇంటి ముందు కారు దిగిన కూతుర్ని చూడగానే గబగబా ఎదురువచ్చి చెప్పింది అరవై సంవత్సరాల వయసున్న ఆమె తల్లి.

'అమ్మ... ఇవాళ జరిగింది ఏమిటంటే...' అంటూ తన బాధను వెంటనే ఆమెకు చెప్పబోయింది మిచిషీ.

'అవన్నీ తర్వాత... ముందు వీటి సంగతి చూడు..' అంటూ వెనుక గదిలో పెరటితోటకు ఆనుకుని ఉన్న కిటికీ వైపు చూపించింది తల్లి.

అటుచూసిన మిచిషీకి వెంటనే కనిపించాయి కిటికీ అంచుమీద కూర్చుని ఉన్న రెండు చిలుకలు. ఎంతో దూరం నుంచి ఎగురుకుంటూ వచ్చినట్లు వాటి కదలికల్లోను, కనుల్లోను క్లియర్‌గా కనిపిస్తోంది అలసట.

మిచిషీ తల్లి తమను చూడగానే

అందించిన జామపళ్ళను తాకను కూడా తాకకుండా బొమ్మల మాదిరి కూర్చుని ఉన్నాయి అవి.

'నాతో మాట్లాడటం వాటికి ఇష్టం లేనట్టుంది. ఎంత అడిగినా ఏమీ చెప్పటం లేదు' వాటి వంక మురిపెంగానే చూస్తూ, కొంచెం కోపంగా అన్నది తల్లి.

'హల్లో... తాత బాగున్నాడా? కుశలంగా ఉన్నాడా?' కిటికీ దగ్గరికి పోయి, ఆప్యాయంగా అడిగింది మిచిషీ.

'మిచిషీ... జాగ్రత్తగా విను' అన్నది ఒక చిలుక.

'ఫ్యుజీశాన్ కాంటన్ వస్తున్నాడు' అన్నది రెండవది.

ముడిపడ్డాయి మిచిషీ కనుబొమలు. ఫ్యుజీశాన్ ఎవరో ఆమెకు తెలియదు. అతను తమ సిటీకి రావడం దేనికో... తెలియడం లేదు.

'వట్టి చవట... కుళ్ళుబోతు' అన్నది మొదటి చిలుక.

'హుహుశాన్ దగ్గరికి పోతాడు... నువ్వు పట్టించుకోకు' అన్నది రెండవది.

'ఎందుకు పట్టించుకోకూడదు? ఏమౌతుంది?' ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

'కుంగ్ఫూ విద్యాపీఠం... ఏదో పెద్దగొడవ..' రెండు చిలుకలు కలిసి ఒకేసారి చెప్పాయి ఆ మాటల్ని.

తల ఊపింది మిచిషీ. 'అలాగే... తాత చెప్పిన తర్వాత నేను పట్టించుకోవడం జరుగదు. ఇంకా ఏమైనా చెప్పాడా?' ఆప్యాయంగా వాటి తలల్ని తడుముతూ అడిగింది ఆమె.

'మా బంగారు మిచిషీ పెళ్ళెప్పుడు?'

ఫక్కున నవ్వి ముందుకు వంగి ఆ రెండింటినీ ముద్దుపెట్టుకున్నది మిచిషీ. 'ఇంకో నెలలో నాకు ప్రమోషన్ వస్తుంది. రాగానే చేసుకుంటాను. తాత తోపాటు మిమ్మల్ని కూడా ఆహ్వానిస్తాను..' అంటూ కిటికీకి దగ్గరగా తన తల్లి పెట్టి ఉంచిన జామ పళ్ళను వాటికి అందించింది.

అప్పటివరకూ తల తిప్పి వాటివైపు చూడని ఆ చిలుకలు వెంటనే అందుకుని ఆనందంగా ఆరగించటం మొదలుపెట్టాయి.

'అమ్మా.... కుంగ్ఫూ విద్యాపీఠంలో గొడవ అంటే చాలా పెద్దదే అయి ఉంటుంది. చేసింది చిన్నపాటి తోటమాలి పనే అయినా అక్కడి వ్యవహారాలు అన్నింటినీ కూలంకషంగా తెలుసుకున్నాడు మీ తాత..' చిలుకలు చెప్పిన మాటల్ని తను కూడా ఆలకించిన మిచిషీ తల్లి వెంటనే చెప్పింది కూతురికి.

'హెచ్చరించాడు కదా. నా జాగ్రత్తలో నేనుంటాను.' అంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది మిచిషీ.

## జరిగిన కథ

కొందరి స్వార్థపూరిత అభియోగాల మూలంగా దొంగగా మారతాడు షాడో. జపాన్ వెళ్ళి అక్కడి కుంగ్ఫూ విద్యాపీఠంలో చేరి, ఫ్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు. అక్కడినుంచి తన స్నేహితుడు గంగారాంతో కలిసి హాంకాంగ్ సిటీ కాంటన్‌లో అడుగుపెడతాడు. అక్కడ కాన్పు కష్టమై విలవిల్లాడుతున్న షాన్‌సూ భార్యను రక్షించే ప్రయత్నంలో హుహుశాన్ మనుషులతో గొడవ పడతాడు. ఇన్‌స్పెక్టర్ మిచిషీకి హుహుశాన్‌ని కలవమని ఫోన్ వస్తుంది.

**ఆ తర్వాత...**

అంతలోనే రింగ్ అయింది ముందు గదిలోని ఫోను.

'ఎస్... ఎవరు?' రిసీవర్‌ని చెవికి ఆనించుకుంటూ హుందాగా అడిగింది మిచిషీ.

'మేడమ్... మీరు వెంటనే టూటౌన్ సర్కిల్ దగ్గరికి వచ్చేయాలి. షాన్‌సూ ఇంటి దగ్గరికి ఎవరో పెద్దావిడ వచ్చి, జరిగింది తెలుసుకుని, వెంటనే వెళ్ళిపోయిందిట' అవతలి నుంచి వినవచ్చింది ఆమె అసిస్టెంట్ గొంతు.

షాన్‌సూతో తాను జరిపిన సంభాషణ వెంటనే గుర్తుకువచ్చింది మిచిషీకి. 'నేను వచ్చేస్తున్నా... ఆమెను ట్రేస్ చేయండి. వెరీ ఇంపార్టెంట్...' అంటూ రిసీవర్‌ని ఫోన్ మీద పడేసి బయటికి పరిగెత్తబోతుండగా, ఇంకోసారి రింగ్ అయింది ఫోను.

పళ్ళు బిగపడుతూ వెనక్కివచ్చి రిసీవర్‌ని అందుకున్నది ఆమె. 'హల్లో మేడమ్... మీరు వెంటనే హుహుశాన్ సారుగారి ఎదుటికి వచ్చేయండి. వెంటనే వెంటనే...' అంటూ చెప్పింది అవతలి కంఠం.

అంత తొందర దేనికో మిచిషీకి అర్థం కాలేదు. 'సార్... నాకు ఇప్పుడే ఒక ఇన్ఫర్మేషన్' అని తన అసిస్టెంటు తనకు చెప్పిన మాటల్ని రిపీట్ చేయబోయింది ఆమె.

ఠక్కున రిసీవర్‌ని పెట్టేసిన శబ్దం ఆమెకు వినిపించింది.

హుహుశాన్ ఒకసారి వెంటనే అనే పదాన్ని ఉపయోగిస్తే, అప్పటికప్పుడు ఎదుటికి పోయేందుకు సిద్ధమైపోతారు అందరూ. ఒకసారి కాదు... ఇప్పుడు మూడుసార్లు వినవచ్చింది ఆ పదం.

'ఏమిటి తల్లీ హడావుడి?' వంట ఇంట్లో నుంచి బయటికి వస్తూ తల్లి అడిగిన ప్రశ్నకు సూటిగా సమాధానం ఇవ్వలేదు ఆమె. 'అర్జంట్ పని... ఇలా వెళ్ళి అలా వచ్చేస్తాను' అంటూ పరుగులాంటి నడకతో బిల్డింగ్ వెలుపలికి పోయి కారులో కూర్చుంది.

స్టీరింగ్ మీద తలపెట్టుకుని కునికిపాట్లు పడుతూ ఉండవలసిన డ్రైవర్, ఎలర్ట్‌గా ఉన్నాడు. వెంటనే స్టార్ట్ చేసి ముందుకు కదిలించాడు.

'ఎక్కడికో అడగవలసిన అవసరం లేదా?' ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

'హుహుశాన్ సారు దగ్గరికి మేడమ్... హెడ్ క్వార్టర్స్ నించి మెస్సేజ్ వచ్చింది.' డాష్‌బోర్డు దగ్గర బిగించి ఉన్న వైర్‌లెస్ సెట్‌ని చూపిస్తూ చెప్పాడు.

***

'గురూ.... ఇటూ... ఇటు వచ్చేయ్... ఇక్కడ ఉన్నాము' అవసరం అయినప్పుడు అతిపెద్దగా వినిపించే గంగారాం కంఠం, రహస్యం చెపుతున్నట్టు అతి సన్నగా వినవచ్చేసరికి, చటుక్కున ఆగిపోయాడు పరుగెత్తుతున్న షాడో.

గతంలో ఎప్పుడో ఏదో భూకంపం వచ్చినప్పుడు కూలిపోయింది కాబోలు, రాళ్ళగుట్టగా మారిపోయిన ఒక పాతకాలపు భవనం పక్కభాగంలో నిలబడి ఉన్నాడు గంగారాం.

అతనికి పది గజాల వెనుకగా ఒక పెద్ద చెట్టు



## ఆరుద్ర – విశ్వనాథ

ఆరుద్ర వ్రాసిన 'సమగ్ర ఆంధ్రసాహిత్య చరిత్ర చదివి (లేఖ చూశా) విశ్వనాథ వారు అన్నారు (ట) 'ఆంధ్ర సారస్వతాన్ని చదువుకో



వలసిన విద్యార్థులకు నోట్స్ రాసుకునే శ్రమ తప్పించాడు ఆరుద్ర' అని. అయితే ఆరుద్ర ఏమీ తక్కువ తినలేదు. 'విశ్వనాథవారి కిన్నెరసాని పాటలు పిప్పరమెంటు పాకం' అన్నారు.

**సేకరణ: ఎస్.తారకరామారావు**

కింద పడుకోబెట్టబడి ఉంది షాన్‌సూ భార్య. బాధని భరించటం చేతకావటం లేదు కాబోలు మెలికలు తిరిగిపోతోంది. ఏ క్షణంలోనైనా కళ్ళు తేల వేసి స్పృహ కోల్పోయేటట్లు కన్పిస్తోంది.

'డాక్టరు దగ్గరికి వెళ్ళి తీరాలి. వేరే దారిలేదు. ఆలస్యం అయితే ఈమె ఇంతే సంగతులు అయిపో తుంది' షాడో దగ్గరికి రాగానే చెప్పాడు గంగారాం.

మొఖం మీది నించి కళ్ళల్లోకి జారబోతున్న స్వేదబిందువుల్ని అరిచేత్తో అద్దుకుంటూ, నిస్సహాయంగా చూశాడు షాడో.

'మనకి తెలిసిన చోటు కాదు. తెలిసిన జనం కూడా ఎవరూ లేరు. మెయిన్‌రోడ్డు మీదికి పోయిన వెంటనే వెంటబడి తరుముతారు ఆ హుహుగాడి జనం. ఇప్పుడు వాళ్ళకి పోలీసులు కూడా తోడ య్యారు' అన్నాడు.

'అలాగని చూస్తూ వదిలేస్తామా? ఏదో ఒకటి చెయ్యాలి కదా...' గిలగిలలాడిపోతున్న షాన్‌సూ భార్యవైపు చూస్తూ లోగొంతుకతో అన్నాడు గంగారాం.

'ఓకే... ఈ చుట్టుపట్ల ఉన్న వాళ్ళల్లో ఎవరైనా పెద్దవాళ్ళు కనిపిస్తే వెంటబెట్టుకు వస్తాను' అంటూ చేతులు జాచాడు షాడో.

పైజమా వేసుకుంటాడు గంగారాం. దానిమీద లాల్చీని ధరిస్తాడు. వర్షం వచ్చినా, ఎండలు మండి పోతున్నా, దారుణమైన చలి రక్తాన్ని గడ్డకట్టించే పని మొదలుపెట్టినా, అతని డ్రస్‌కోడ్ మాత్రం మారిపోయే అవకాశం లేదు.

దుమ్మూధూళితో గోనెపట్టా మాదిరిగా తయారై పోయి ఉన్న తన పైజమా జేబులో నుంచి, తళతళ మెరిసిపోతున్న రెండు రంగురాళ్ళని బయటికి తీశాడు.

ఒక్కొక్కటి కనీసం ఇరవై వేలు పైచిలుకు పలు కుతాయి. అవసరం అయితే రెండింటినీ తీసుకుని ఏదో ఒక సాయం చేయమని చెప్పు' అని సలహా కూడా ఇచ్చాడు.

చవకబారు కాటన్ సిగరెట్టును వెలిగించుకుంటూ తను పరిగెత్తుకు వచ్చిన సందుకు ఇంకో పక్కన ఉన్న మరో ఇరుకు వీధిలోకి పోయాడు షాడో.

'వెళ్ళాడు తల్లీ... మా గురువుగారు నీకు సాయం చేయగల మనిషికోసం వెదుక్కుంటూ వెళ్ళాడు. నువ్వు గాబరాపడకు.' చెట్టు దగ్గరికిపోయి, షాన్‌సూ భార్య పక్కనే మోకరించి కూర్చుంటూ చెప్పాడు గంగారాం.

నవ్వటానికి ప్రయత్నం చేసింది ఆమె. నవ్వు రాలేదు. కళ్ళ వెంట నీళ్ళు వచ్చాయి. 'ఎవరూ రారు.. అందరికీ హుహుశాన్ అంటే భయమే...' అస్పష్టంగా చెప్పింది.

'వాడెంత... వాడి బతుకెంత. నీకు ఒక విషయం చెప్పనా...' అన్నాడు గంగారాం.

అంత బాధలోనూ ఆశ్చర్యంగా చూడకుండా ఉండలేకపోయింది ఆమె.

'మా గురువుగారు తలుచుకుంటే ఆ హుహు గాడు ఈ నగరాన్ని వదిలి ఇంకో నగరానికి పారి పోతాడు. మనసుపెట్టడు మా గురువుగారు. పెట్టా డంటే ఆ పని జరిగిపోయినట్టే... నువ్వేమీ కంగారు పడకు' మరోసారి చాలా నమ్మకంగా చెప్పి, షాడో ఎంటర్ అయిన సందుకేసి చూడటం మొదలు పెట్టాడు అతను.

***

దృష్టినంతా ఎదుట ఉన్న వీధి మీద కేంద్రీకరించి వేగంగా కారును నడుపుతున్న మిచిషీ డ్రైవర్, ఉన్నట్టుండి బ్రేకుల మీద కాలు వేశాడు.

కీచుధ్వనులు చేస్తూ రెండు వంకర్లు తిరిగి, ఒక పక్కకు ఒరిగినంత పని చేసింది ఆ కారు.

'నీకు బుద్ధి ఉందా? నువ్వసలు మనిషివేనా? కళ్ళు ఏమైపోయాయి?' కోపంగా అరుస్తూ, డోర్ తెరుచుకుని కిందికి దిగబోయిన అతన్ని ఆపి, తను బయటికి చూసింది మిచిషీ.

చిటికెలో తప్పిపోయింది ప్రమాదం. ఎటోచూస్తూ వస్తోంది వయసు బాగా మీద పడిపోయినట్లు కని పిస్తున్న ఒక వృద్ధురాలు. కారు ముందుభాగం కొంచెం తగలటంతో కింద పడిపోయింది.

'క్షమించాలి తల్లీ.... పొరపాటు జరిగిపోయింది. దెబ్బ తగిలిందా?' చటుక్కున కిందికి దిగి, ఆమెకు చేతిని అందిస్తూ ఆదరంగా అడిగింది మిచిషీ.

సహాయం చేయటానికి వచ్చిన వారిని చూసి సంతోషించటానికి బదులుగా, తను ధరించి ఉన్న యూనిఫామ్‌ని చూసి ఆమె భయపడిపోతున్నట్టు తెలిసి, చిరునవ్వు నవ్వింది.

'భయం లేదు... నేను నిన్ను ఏమీ నిందించను' అంటూ భుజం తట్టింది. కృతజ్ఞతాసూచకంగా చిరు నవ్వు కూడా నవ్వకుండా పరుగెత్తుతున్నట్టు పక్కనే ఉన్న సందులోకి వెళ్ళిపోయింది ఆ వృద్ధురాలు.

ఆమె ప్రవర్తనకు ఆశ్చర్యపోతూ నిలబడిన మిచి షీని 'మేడమ్.. ఆలస్యం అయిపోతోంది' అంటూ హెచ్చరించాడు డ్రైవర్.

సందులోకి పోయిన వృద్ధురాలు పది అడు గులు కూడా సరిగ్గా వేయలేదు. ఉన్నట్లుండి కాళ్ళు మడత పడినట్టు ముందుకు తూలింది.

చెడు వాసనను వెలువరించే చవకబారు సిగ రెట్టు పొగను పీలుస్తూ, ఆరు అడుగుల దూరం లోకి వస్తున్నాడు ఒక యువకుడు. చటుక్కున ముందుకు దూకి ఆమెను గట్టిగా పట్టుకున్నాడు.

'ఏమయింది తల్లీ? కళ్ళు తిరిగాయా?' సరిగ్గా నిలబెడుతూ మృదువుగా అడిగాడు.

అటువంటిదేమీ లేదన్నట్టు తల అడ్డం తిప్పింది ఆమె. తనంతట తానుగా ఇంకో అడుగు వేసింది. అంతే మరోసారి ముందుకు తూలింది.

పెదవుల మధ్య పెట్టుకోబోతున్న సిగరెట్‌ని కిందకి వదిలేసి మళ్ళీ ఆమెను పట్టుకున్నాడు ఆ యువకుడు.

అంతకు ముందు మాదిరి తమాయించుకుని నిలబడలేదు ఆమె. ముందుకు తూలుతూ ఉండగానే తెలివి తప్పినట్లుంది. నడుములు విరిగిపోయిన బొమ్మ మాదిరి అతని చేతుల్లో వ్రేలాడిపోయింది.

***

క్షణం ఒక యుగం మాదిరి అనిపించడం మొదలు పెట్టేసరికి, కుదురుగా నిలబడలేకపోయాడు గంగారాం. 'నేను కూడా వెళ్ళి ఎవర్నో ఒకర్ని సాయం తీసుకు వస్తాను. నువ్వు నిబ్బరంగా ఉండు' అంటూ చెట్టు కింది యువతికి చెప్పి షాడో ఎంటరైన వీధిలోకి పోయాడు తాను కూడా.

ఎంతో దూరం పోలేదు... ఎదురుగా వస్తూ కని పించాడు షాడో.

'నీకు అసలు టైమ్‌సెన్స్ లేకుండాపోతోంది గురూ... అవతల ఆ పిల్ల' అంటూ గబుక్కున మాటను మింగేశాడు.

షాడో చేతుల్లో వ్రేలాడబడిపోతున్న ఒక వృద్ధు రాలు కనిపించటమే అందుకు కారణం.

గబగబా పోయి తాను కూడా ఆమెను పట్టు కున్నాడు అతను. 'తలదూర సందులేదు మెడకు ఒక డోలు అనే సామెత మనల్ని చూసే పుట్టి ఉంటుంది. ఏ క్షణంలోనైనా ఏమైపోతుందో తెలియని ఆ పిల్లకు తోడు, ఇప్పుడు, ఈ పెద్దావిడకు తెలివి తెప్పించాలి. మనవల్ల అయ్యే పనేనంటావా?' అడి గాడు గంగారాం గబగబా అడుగులు వేస్తూ.

'ఏం చేద్దాం? వదిలేసి మన దారిన మనం పారిపోదామా?' అడిగాడు షాడో.

'పారిపోవటమా? అది ఈ గంగారాం సార్ జాతకంలోనే లేదు. కాకపోతే అప్పుడప్పుడు సగౌర వంగా తిరోగమిస్తూ ఉంటాము' పాడుపడిన బిల్డింగ్

**రెండు చిలుకలు... ఆ ఇంటి పెరటితోటకు ఆనుకుని ఉన్న గది కిటికీపై వాలి ఉన్నాయి. వాటికెంతో ఇష్టమైన జామపండ్లు వాటిపక్కన ఉన్నా, కనీసం వాటివైపు తలలుతిప్పి చూడడం లేదు. ఎవరికోసమో ఎదురుచూస్తున్నాయి. ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నాయి. అసలు ఆ ఇల్లు ఎవరిది? ఆ చిలుకలు ఎవరికోసం ఎదురుచూస్తున్నాయి?**

దగ్గరికి రావటంతో మాటల్ని ఆపేశాడు గంగారాం.

చెట్టుకింద ఉన్న యువతి తల ఎత్తి చూసింది. సహాయం వచ్చిందన్న సంతోషం చటుక్కున కన బడి అంతలోనే మాయమైపోయింది ఆమె మొఖంలో.

ఆమెకు రెండు అడుగులు ఇవతలగా పడుకో బెట్టి వృద్ధురాలి బుగ్గల్ని మృదువుగా తట్టాడు షాడో.

'కళ్ళు తెరిచి చూడు తల్లీ. నీకు చెడుపు చేసే వాళ్ళు ఎవరూ లేరు ఇక్కడ. కాన్పు కష్టమై గిలగిల లాడుతున్న ఒక అభాగ్యురాలు మాత్రమే ఉంది' అన్నాడు.

అదే సమయంలో అంతవరకూ ఎంతో ప్రయత్నం మీద పెద్దపెద్ద శబ్దాలు చేయకుండా బాధను బిగ పట్టుకుంటున్న యువతి, గావురుమని అరిచి కళ్ళు తేలవేసేసింది.

'అయ్యయ్యో... అయిపోయింది. అనుకున్నంతా జరిగిపోయింది. ఈ అమ్మడి చావును కళ్ళ చూడ వలసిన దౌర్భాగ్యం మనకి కలిగింది' బాధగా అంటూ ఆమె దగ్గరికి జంప్ చేశాడు గంగారాం.

అధికం అయిపోయాయి షాడో నుదుటి మీద ఉద్భవిస్తున్న చెమటలు. ఎటువంటి డిఫికల్ట్ సిచ్యు యేషన్ ఎదురైనా పిసరంత కూడా చలించని అతని గుండెలు కలుక్కుమన్నాయి ఒక్కసారిగా.

'నీళ్ళు జల్లాలి గంగూ... మొఖం మీద చిలకరిం చాలి. తీసుకురా ఎక్కడినుంచైనా' అంటూ తనుకూడా ఆమె దగ్గరికి జంప్ చేయబోతూ, ఆగిపోయాడు.

కింద పడుకోబెట్టి బుగ్గలు తట్టినా తేరుకోని వృద్ధురాలు, గుండెల్ని కదిలించే ఆర్తనాదాన్ని ఆల కించింది కాబోలు... చటుక్కున కళ్ళు తెరిచింది. అక్కడితో ఆగలేదు. చేతుల్ని కింద ఆనించి తనం తట తనే లేచి కూర్చుంది. కూర్చుంటూనే ఆ యువ తికేసి చూసి బావురుమంది.

నీళ్ళు తీసుకురమ్మని షాడో చెప్పిన మాటను విన్నవెంటనే అవతలికి పరిగెత్తబోతున్న గంగారాం అదిరిపడి చూశాడు ఆమెకేసి.

'అమ్మా... యాగీ.... నా తల్లీ.. ఎంతకష్టం వచ్చిందే నీకు. పడుతూ లేస్తూ పరిగెత్తుకు వచ్చానే నేను. నీకు మాత్రం సాయం చేయలేక పోతు న్నాను' ముందుకు జరిగి, తెలివి కోల్పోయిన యువతి గర్భంమీద చేయి వేస్తూ గోల మొదలుపెట్టింది ఆమె.

నీళ్ళ సంగతి మర్చిపోయాడు గంగారాం. గబు క్కున వెనక్కివచ్చాడు. 'ఈ అమ్మడు నీకు తెలుసా?' అని అడిగాడు.

తల ఊపింది ఆమె ఏడుపు ఆపుకోకుండానే.

'వెరీగుడ్! ఏం చేయాలో తెలియక తలలు పట్టుకుంటున్నాము. ఇప్పుడు జరగాల్సిందేమిటో చెప్పు' ఉత్సాహంగా అన్నాడు అతను.

'గొయ్యి తవ్వి పాతి పెట్టటం ఒక్కటే మిగి లింది. కడుపులో ఉన్న బిడ్డను బయటికి నెట్టే ఓపిక తనకు లేదు. ఇంకో రెండు మూడు నిమిషాల్లో అంతా అయిపోతుంది' వెక్కిళ్ళు పెడుతూ చెప్పింది వృద్ధురాలు.

అదిరిపడినట్లు ఒక అడుగు వెనక్కివేసి, షాడో వైపు చూశాడు గంగారాం. 'సరైన సమయంలో వైద్య సహాయాన్ని అందించలేకపోయాము. తనం తట తనే తనలో ఉన్న బిడ్డను బయటికి పంపించ లేకపోతోందిట..' అన్నాడు షాడో.

అంతే.. ఆ తర్వాత ఏం చేయాలో అతన్ని అడ గలేదు గంగారాం. 'మెయిన్ రోడ్డుమీద జరిగిన గోలకు భయపడి ఈ చుట్టుపట్ల ఉన్న జనం అందరూ తలుపులు బిడాయించుకుని ఇళ్ళలోనే ఉండిపోయారు. ఇప్పుడు కట్టకట్టుకుని బయటికి వచ్చేస్తారు అందరూ... సిద్ధంగా ఉండు' అంటూ ఎడమ పాదంతో నేలను తన్ని, కుడిచేత్తో తన తొడను చరిచి, ఆకాశం వైపు చూస్తూ పెట్టాడు ఒక పొలికేక.

ఏ చెట్టుకింద వాళ్ళు మకాం పెట్టారో ఆ చెట్టు మీద ఉన్న పక్షులు అన్నీ గోలగోలగా అరుస్తూ గాలిలోకి ఎగిరి దూరంగా పారిపోయాయి.

స్పృహ కోల్పోయిన యువతి తలను, ఆమె గర్భాన్ని నిమురుతూ బావురుమని ఏడుస్తున్న వృద్ధురాలు తన పక్కన ఏవో బాంబులు పేలినట్టు అదిరిపడింది.

చటుక్కున కళ్ళు తెరిచింది తెలివి కోల్పోయిన యువతి. తెరుస్తూనే కీచుగా శబ్దం చేసింది. ఆ శబ్దం వెనుకే చెవులు గింగిర్లెత్తేటట్టు వినవచ్చింది పసిబిడ్డ ఏడుపు.

దారుణమైన శబ్దం వెలువరించటం వల్ల తీవ్ర మైన ఒత్తిడికి లోనైనాయి గంగారాం కంఠ నాళాలు. ఎర్రటి రక్తపు చారికలు రెండు వెలువడ్డాయి అతని పెదవుల చివర్లనుంచి.

## వాళ్ళిద్దరూ కలిసేది ఆ కాసేపే!

రణబీర్, కత్రినాలు మళ్ళీ కలిసిపో యారన్న వార్తలు బాగానే హల్ చల్ చేశాయి. చేస్తున్నాయి కూడా! అయితే ఇవన్నీ గాలికబుర్లే అంటు న్నారు వీరిద్దరి సన్నిహితులు. వీళ్ళిద్దరూ కలవడం ఇక జరగని పని అని, వీరిద్దరి తాజా సినిమా 'జగ్గా జాసూస్' ప్రమో షన్ల కోసం కొద్దిసేపు కలివిడిగా కనిపిస్తు న్నారే తప్ప ఆ తరువాత ఎవరిదారి వారి దేననీ, ఇద్దరూ కలిసి ప్రమోషన్ చేస్తున్న సమయంలో వారి ముఖంలో కనీసం నవ్వు కూడా కనిపించడం లేదని అంటు న్నారు. ఏదో మొక్కుబడిగా ఇద్దరూ కలిసి కొద్దిసేపు కనిపించి ఆ తరువాత ఒకరి మీద ఒకరు కారాలు మిరియాలు నూరుకుంటున్నారట! వీరిద్దరూ తెర మీదే కాకుండా నిజజీవితంలో కూడా చాలా బాగా నటించేస్తున్నారన్నది కొందరి మాట!



***

ఆరుద్వారాల్ని దాటిన తర్వాత విశాలంగా ఉన్న ఒక పెద్ద హాలులోకి మిచిషీని తీసుకుపోయారు నలుగురు ఆజానుబాహులు.

సింహాసనం వంటి ఒక మెత్తటి సోఫాలో కూర్చుని కనిపించాడు ఆమెకు హుహుశాన్. మూరెడు పొడుగు ఉన్న ఒక సన్నపాటి వెదురు గొట్టానికి ఖరీదైన సిగరెట్‌ని బిగించి, సున్నితంగా, సుతారంగా పొగను పీల్చి వదులుతున్నాడు.

అటెంక్షన్‌లో నిలబడి స్టిఫ్‌గా శాల్యూట్ చేసింది ఆమె. చేతులు కట్టుకుని, తలను కొద్దిగా ముందుకు వంచి, వినయంగా నిలబడింది.

'నీ గురించి నేను చాలా గొప్పగా విన్నాను. డ్యూటీ అంటే ప్రాణమనీ, తిండి, నిద్ర అవసరం లేనట్టు పని చేస్తావనీ నాకు తెలిసింది' కీచు కంఠంతో చిన్నగా అన్నాడు హుహుశాన్.

తలను ఇంకా కొంచెం ముందుకు వంచి, నమ స్కారం చేస్తున్నట్టు చేతుల్ని కదిలించింది మిచిషీ.

'నీ చురుకుదనాన్ని గురించి వినటం వల్లనే ఈ రోజు నిన్ను నేను ఎంపిక చేసుకున్నాను...' అంటూ తన ఎడమచేతితో తనకు నాలుగు అడుగుల దూరంలో ఉన్న ఇంకో సోఫాని చూపించాడు అతగాడు.

అటుకేసి తలతిప్పిన మిచిషీకి కరెంట్ షాక్ కొట్టినట్టు జలదరించింది ఒళ్ళు. ఎర్రటి ఎరుపు రంగుమాదిరి కనిపించే కాషాయంబరాల్ని ధరించి ఆ సోఫాలో కూర్చుని ఉన్నాడు ఒక కుంగ్‌ఫూ వస్తాదు.

అతను ఎవరో హుహుశాన్ చెప్పాల్సిన అవసరం లేకుండానే తెలిసిపోయింది ఆమెకు. అటువంటి పరిస్థితి ఎదురుపడవచ్చని ముందుగానే హెచ్చరిక పంపాడు తన మాతామహుడు.

'కుంగ్‌ఫూ విద్యాపీఠపు అధిపతిగా నియమించబడటానికి కావాల్సిన అర్హతలు అన్నీ ఉన్న ఫ్యూజీశాన్ ఈయన' మిచిషీ మనుసులోని ఆలోచనలు ఎటువంటివో తెలియని హుహుశాన్ చిన్నగా అన్నాడు.

అటుకేసి కూడా చూసి వినయంగా తల వంచింది ఆమె.

'మా పీఠానికి చాలా పెద్ద అవమానం జరిగింది. అందుకు కారకుడైన దుర్మార్గుడు సముద్ర మార్గంలో ఇటుగా ప్రయాణం చేస్తున్నట్టు మా దృష్టికి వచ్చింది' గంభీరంగా అన్నాడు ఫ్యూజీశాన్.

'కుంగ్‌ఫూ వస్తాదులు అంటే అన్ని విషయాలను అవలీలగా ఆకళింపు చేసుకోగల శక్తిమంతులు. తమ దృష్టికి వచ్చిన ఎటువంటి మాటలోనైనా నిజమే ఉంటుంది' తల వంచుకుని చిన్నగా చెప్పింది మిచిషీ.

'నీ వినయ ప్రవర్తన మాకు బాగా నచ్చింది. మాకు సహాయం చేయటం ద్వారా కుంగ్‌ఫూ పీఠానికి సేవచేసుకునే అవకాశం నీకు కల్పించదలుచుకున్నాము' గంభీరంగా ఇంకో మాట మాట్లాడాడు ఫ్యూజీశాన్.

ఆ మాటలకు ఎంతగానో ఆనందిస్తున్నట్టు మరోసారి వినయంగా తలవంచాలని మిచిషీకి తెలుసు. అయితే అక్కడ ఉన్నది ఒక్క కుంగ్‌ఫూ వస్తాదు మాత్రమే కాదు, కుంగ్‌ఫూ పీఠం వంటి అతి పెద్ద ఆర్గనైజేషన్‌ని కలిగి ఉన్న హుహుశాన్ సారు కూడా ఉన్నాడు.

నిర్మోహమాటంగా ఈసారి ఆ పెద్దమనిషి వైపు చూసింది ఆమె, తలను పూర్తిగా ఎత్తకుండానే.




ఫ్యూజీశాన్ మాటలకు ఆమె ఎటువంటి సమాధానం ఇస్తుందో తెలుసుకోవటానికి అన్నట్టు కొంచెం కుతూహలంగా చూస్తున్న హుహుశాన్ పెదవుల మీద వెంటనే ప్రత్యక్షం అయింది చిన్న చిరునవ్వు.

'నేను మీకు ముందుగానే చెప్పాను. మా నగరంలోని వారందరికీ మేమంటే ఎంతో గౌరవమని... ఇప్పుడు అర్థం అయిందా?' అన్నాడు.

'ఇది కుంగ్‌ఫూ విద్యాపీఠానికి చెందినటువంటి పని. కాదని నిరాకరించటం ఎవరికీ మంచిది కాదు' ఎందుకనో కొంచెంగా ఎర్రబడిన మొఖంతో అన్నాడు ఫ్యూజీశాన్.

'ఇది హుహుశాన్ నివసించే నగరం. ఇక్కడ అతని మాటే చెల్లుతుంది. అతను చెప్పినదే ఆచరించ బడుతుంది' సగర్వంగా చెప్పాడు హుహుశాన్.

'గౌరవనీయులైన హుహుశాన్‌సారు నన్ను పిలిపించిన కారణం ఏమిటో నేను తెలుసుకో వచ్చునా?' వినయంగా అడిగింది.

అంతకుముందే కొద్దిగా ఎర్రబడి ఉన్న ఫ్యూజీశాన్ వదనం మరింతగా కమిలిపోవటం కనిపిస్తూనే ఉన్నది ఆమెకు.

'నీ గురించి నేను తెలుసుకున్న మాటల్లో ఆవగింజంత కూడా అసత్యం లేదని నాకు పూర్తిగా అర్థం అయింది. కుంగ్‌ఫు విద్యాపీఠం అంటే చాలా పేరున్న ప్రదేశం. అక్కడినుంచి ఎవరు మన సహాయం కోరివచ్చినా మనం వెంటనే స్పందించి తీరాలి. నువ్వు ఈ వస్తాదు చెప్పినట్టు చెయ్యాలి... చేస్తావా?' సగర్వంగా అడిగాడు హుహుశాన్.

పక్కనే ఉన్న పెద్దమనిషి ముందు అతను తన అధికారాన్ని, తన పరపతిని పూర్తిగా ప్రదర్శించటానికి సిద్ధమైపోయాడని గ్రహించి, ఆలస్యం చేయకుండా తల ఊపింది మిచిషీ.

'తమరి మాట మాకందరికీ ఆజ్ఞ వంటిది. తమరు ఎలా చెపితే అలాగే' తడుముకోకుండా చెప్పింది.

తన చేతిలో ఉన్న వెదురుగొట్టాన్ని, పూర్తిగా కాలని ఖరీదైన సిగరెట్‌తో సహా, ఎదుట ఉన్న యాష్ ట్రేలో పడవేసి, చేయి ఊపాడు హుహుశాన్.

పట్టెడు లావున్న ఒక పట్టుగుడ్డ మూటను తీసుకువచ్చి అతని ముందున్న టీపాయ్ మీద పెట్టాడు ఒక ఆజానుబాహుడు.

రెండు మడతలతో మూసి ఉన్న ఆ మూటను విప్పాడు హుహుశాన్. అంతకుముందే బ్యాంకు నుంచి తీసుకురాబడ్డాయి కాబోలు ఫెళఫెళలాడుతున్న కరెన్సీనోట్ల కట్టలు రెండున్నాయి అందులో.

'నువ్వు చేయబోయే పనిలో ఏవైనా ఖర్చులు ఉంటే అందుకోసం.... అవసరం అయితే నగరాన్ని వదిలిపెట్టి ఎటైనా పోవాల్సి వస్తే అందుకు ఉపయోగపడుతుంది ఈ డబ్బు. తీసుకో..' అంటూ ఆ కట్టలు ఆమె మీదికి విసిరాడు.

తను చేస్తున్న ఉద్యోగంలో అలా ఇతరుల దగ్గర డబ్బు తీసుకోవటం చాలా తప్పు అని మిచిషీకి తెలుసు. కాని ఆ మాటను బయటికి చెపితే, అవతల ఉన్న కుంగ్‌ఫూ పెద్దమనిషికి హుహుశాన్ మీద తేలికభావం ఏర్పడవచ్చు. అది ఆ సమయంలో తనకు ఏ విధంగానూ మంచిది కాదు.

ఒట్టొట్టి మాటలు మాట్లాడే మనిషికాదు తన తాత. పనిగట్టుకుని తను ప్రాణప్రదంగా చూసుకునే జీవాలతో ఆయన వర్తమానం పంపించటానికి ఏదో పెద్దకారణమే ఉండి ఉంటుంది.

ఈ ఫ్యూజీశాన్ ఎవరోగాని, నిజంగానే చాలా ప్రమాదకరమైన వస్తాదు అయివుంటాడు. కాబట్టి ఇతని విషయంలో కూడా తను చాలా జాగ్రత్తగా ఉండాలి.

తన ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా అంతరంగాన్ని అల్లకల్లోల పరుస్తున్న ఆలోచనల్ని అతి బలవంతంగా అదుముకుంటూ, గాలిలో తేలుకుంటూ వచ్చిన కరెన్సీ కట్టల్ని అందుకుని, కృతజ్ఞతాసూచకంగా ప్రణామం చేసింది ఆమె.

'మేము ఈ నగరంలో అడుగు పెట్టీపెట్టగానే, ఎవరో ఇద్దరు అనుచరులు హుహుశాన్ అనుచరుల్ని వట్టి చేతులతోనే ఎదిరించినట్టు మాకు తెలిసింది' ఉన్నట్లుండి అన్నాడు ఫ్యూజీశాన్.

కనులు చిట్లించాడు అప్పటివరకూ చిరునవ్వులు చిందిస్తున్న హుహుశాన్. తలను పక్కకు తిప్పుకున్నాడు.

'ఆ అనామకులు ఎవరో మాకు వెంటనే తెలియాలి' తన పద్ధతిలో తను పక్కకు కూడా చూడకుండా చెప్పాడు ఫ్యూజీశాన్.

'ఇన్వెస్టిగేషన్ జరుగుతున్నది. మా హుహుశాన్ సారు ఎప్పుడో మాకు ఆ విషయంలో పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చారు' బింకంగా అన్నది మిచిషీ.

'త్వరగా పూర్తిచేయండి. వాళ్ళు ఎక్కడ ఉంటారో తెలిస్తే మేము కూడా వచ్చి వాళ్ళని వీక్షిస్తాం' అన్నాడు ఫ్యూజీశాన్.

'మీకు అంత శ్రమ అవసరం లేదు' అని చెప్పబోతున్న మిచిషీ ఆ మాటల్ని తనలోనే అదుముకున్నది. ఆ హాలు వెలుపలినించి ఒక ఆజానుబాహుడు పెద్దపెద్ద అడుగులతో లోపలికి వచ్చి హుహుశాన్ చెవిలో ఏదో చెప్పటమే అందుకు కారణం. అగ్నిగుండాల మాదిరి ఎర్రబడి పోయాయి హుహుశాన్ కళ్ళు.

**(ఇంకా వుంది)**




**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్స్
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి


# మైగ్రేన్ తలనొప్పి మళ్లీ రాలేదు

22 ఏళ్ల శశిరేఖ ఒక ప్రముఖ కంపెనీలో ఉద్యోగం చేస్తోంది. ఐదంకెల జీతం. కానీ ఆమె ఉద్యోగం కోల్పోయే పరిస్థితి వచ్చింది. కారణం ఆమె సెలవులు ఎక్కువగా పెడుతుండటమే. నెలలో 10 రోజులు సెలవుపెడితే ఏ కంపెనీ మాత్రం ఉంచుకుంటుంది. అయితే అన్ని రోజులు సెలవులు పెట్టడానికి కారణం మైగ్రేన్. ఆమె తీవ్రమైన మైగ్రేన్ సమస్యతో బాధపడుతోంది. తలనొప్పి లేచినపుడు మూడు నాలుగు రోజుల పాటు గదికే పరిమితమవుతుంది. కళ్లు తెరిచి వెలుతురు చూడాలన్నా భయం. తలనొప్పి మాత్రలు ఎన్ని వేసినా ఫలితం శూన్యం. మెదడులో ఏదైనా సమస్యేమో అనుకుని స్కానింగ్ తీయించడం, ప్రముఖ వైద్యులకు చూపించడం జరిగింది. కానీ ఆమె తలనొప్పి మాత్రం తగ్గలేదు. నెలలో రెండు, మూడు సార్లు ఈ తలనొప్పి ఆమెను వేధిస్తోంది. తలనొప్పి వచ్చినపుడల్లా ఆఫీసుకు లీవుపెట్టడం జరుగుతోంది. ఈ సమయంలోనే ఆమెకు హోమియో చికిత్స గురించి తెలిసింది. మైగ్రేన్‌కు హోమియో మాత్రమే పరిష్కారం చూపుతుందని తెలియడంతో పరుగుపరుగున మా క్లినిక్‌కు వచ్చింది.

### హోమియో చికిత్స తరువాత

మైగ్రేన్ సమస్యకు ఇతర చికిత్సా విధానాల్లో పరిష్కారం లేదనే చెప్పవచ్చు. ఇతర చికిత్సల్లో లక్షణాలు తగ్గించేందుకు చికిత్స ఇస్తారే తప్ప మూలకారణాన్ని తొలగించేలా చికిత్స ఉండదు. నొప్పి నివారణ మాత్రలతో తలనొప్పి తాత్కాలికంగా తగ్గుతుందే తప్ప పూర్తిగా పోదు. నాలుగు రోజుల తరువాత మళ్లీ మామూలే అవుతుంది. కానీ హోమియో చికిత్స అలా కాదు. మూలకారణాన్ని తొలగిస్తుంది. మైగ్రేన్‌కు కారణ మవుతున్న నరాలను సాధారణ స్థితికి తీసుకువస్తుంది. కెమికల్స్ విడుదలను అడ్డుకుంటుది. ఫలితంగా మైగ్రేన్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. సమస్య మళ్లీ పునరావృతం కావడం అంటూ ఉండదు. ఈ చికిత్సలో ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్స్ కూడా ఉండవు. శశిరేఖకు కూడా ఈ విధంగానే చికిత్స అందించడం జరిగింది. ఇప్పుడామె తలనొప్పి సమస్య పూర్తిగా తొలగిపోయింది. ఇప్పుడు ఎంతో ప్రశాంతంగా ఉందని, ఊరటగా ఉందని ఆమె చెప్పుకొచ్చింది. ఇప్పుడావిడ సంతోషంగా, ఎటువంటి సెలవులు పెట్టకుండా ఉద్యోగం చేసుకుంటోంది.

# హెపటైటిస్ బాధ ఇలా పోయింది

అతని పేరు దివాకర్. వయస్సు 32 సంవత్సరాలు. ఆరోగ్యంగా, దృఢంగా ఉండేవాడు. కానీ కొన్ని నెలల క్రితం సాధారణ లక్షణాలతో ఒక సమస్య మొదలయ్యింది. మరికొన్ని రోజులు అలస్యమైతే ప్రాణాలు కూడా పోయేవి. ఇంతకీ అతనికి అనారోగ్య లక్షణాలు ఎలా మొదలయ్యాయంటే... ప్రారంభంలో నీరసంగా ఉండటం, ఆకలి లేకపోవడం, ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. ఊర్లో తెలిసిన డాక్టర్‌కు చూపిస్తే ఏవో మందులు రాసిచ్చాడు. వారం రోజులు వాడినా కొద్దిగా కూడా ఫలితం లభించలేదు. ఈలోగా కళ్లు పసుపు రంగులోకి మారుతున్నాయన్న విషయాన్ని స్నేహితులు, కుటుంబసభ్యులు గమనించి చెప్పారు. ఇక ఆలస్యం చేయడం మంచిది కాదని దగ్గరలో ఉన్న టౌన్‌కి వెళ్లి డాక్టర్‌కు చూపించాడు. అక్కడ పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని, కామెర్లు వచ్చాయని చెప్పారు. దాంతో దివాకర్‌కి ఒక్కసారిగా పాతాళంలో కూరుకుపోయినట్టిగా అనిపించింది. హెపటైటిస్ వైరస్ ప్రాణాంతకం అని, కాలేయం పాడయిపోతుందని చెప్పేసరికి అతనిలో ఆందోళన మరింత రెట్టింపు అయింది. కాలేయ వ్యాధులతో చనిపోతున్న వారి వార్తలు రోజు వింటూనే ఉన్నాడు కాబట్టి ఏం చేయాలో పాలుపోలేదు. ఆ సమయంలోనే తెలిసిన మిత్రుడు ఒకడు హోమియో చికిత్స గురించి చెప్పాడు. అల్లోపతిలో నయం కాని ఎన్నో జబ్బులకు హోమియో మందులతో మంచి ఫలితం లభిస్తుందని, ముఖ్యంగా హెపటైటిస్ వైరస్‌ను కట్టడి చేసే మందులు హోమియోలో ఉన్నాయని చెప్పాడు. దాంతో పరిగెత్తుకుంటూ మాదగ్గరకు వచ్చాడు.

### సందేహాలు తీర్చాం

మాదగ్గరకు వచ్చినపుడు అతనిలో ఎన్నో సందేహాలు. వచ్చీ రాగానే తన సందేహాలన్నింటిని మా ముందుంచాడు. చికిత్స కన్నా ముందు అతని సందేహాలన్నీ తీర్చే ప్రయత్నం చేశాం. కొన్ని వ్యాధుల్లో లక్షణాలు వెంటనే బయటపడతాయి. మరి కొన్ని వ్యాధుల్లో ఏళ్ల తరువాత లక్షణాలు బయటపడతాయి. హెపటైటిస్ వైరస్ విషయంలోనూ అంతే. శరీరంలోకి ప్రవేశించిన తరువాత కొన్నేళ్ల పాటు నిద్రాణంగా ఉండిపోతుంది. సమయం చూసి దాడి చేస్తుంది. వైరస్ శరీరంలో ప్రవేశించినపుడు కాలేయంలో కొన్ని రకాల మార్పులు చోటుచేసుకుంటాయి. దీర్ఘకాలంలో లక్షణాలు బయటపడతాయి అనగానే ఈ వైరస్ నా శరీరంలో చాలా కాలం క్రితమే ప్రవేశించి ఉంటుందా? అనే ప్రశ్న అడిగాడు. అవును అనగానే ఎలా ప్రవేశించి ఉంటుందని మరో సందేహాన్ని అడిగాడు. అప్పుడు అతని సందేహానికి సమాధానంగా రక్తమార్పిడి ద్వారా, శృంగారం ద్వారా, వెజైనల్ ఫ్లూయిడ్ ద్వారా హెపటైటిస్ బి వైరస్ ఇతరులకు వ్యాప్తి చెందుతుందని చెప్పాం. లాలాజలం, తల్లిపాల ద్వారా, సురక్షితం కాని నీడిల్స్, సిరంజిలు ఉపయోగించడం వల్ల వచ్చే అవకాశం ఉందని వివరించాం. డ్రగ్స్, పచ్చబొట్టు, ఒకరు ఉపయోగించిన బ్లేడ్‌ను, టూత్‌బ్రష్‌ను వాడటం వల్ల హెపటైటిస్ రావచ్చని చెప్పాం. కారణం ఏదైనా భయపడాల్సిన పనిలేదని హోమియో వైద్యుల సలహా మేరకు మందులు వాడుతూ, ఆరోగ్యకరమైన జీవనం సాగించడం, పరిశుభ్రమైన ఆహారం, తగినంత విశ్రాంతి తీసుకోవడం చేస్తే ఇట్టే నయమవుతుందని చెప్పాం. వెంటనే అతను చికిత్సకు ఒప్పుకున్నాడు.

### చికిత్స తరువాత

అతని శారీరక, మానసిక లక్షణాలను పరిశీలించి చికిత్స ప్రారంభించాం. హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని ధైర్యం చెప్పాం. అతను మా ఆసుపత్రికి వచ్చినపుడు తీవ్రమైన కడుపు నొప్పితో బాధపడుతున్నాడు. ఆహారం ఏమాత్రం తీసుకోవడం లేదు. కళ్లు బాగా పచ్చగా ఉన్నాయి. వికారం, వాంతులు అవుతున్నాయి. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. మామూలుగా ఆహారం తీసుకోవడం మొదలుపెట్టాడు. నెల రోజుల తరువాత రివ్యూకు వచ్చినపుడు అతనిలో చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ తెలుసుకునేందుకు పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. ఆ విషయం అతనికి చెప్పడంతో అతను చాలా సంతోషం వ్యక్తం చేశాడు. జీవితం ముగిసిపోతుందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపిందని కృతజ్ఞతలు చెప్పాడు.


మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ,
కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106


V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి
డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.

ADVT




# సప్తవృషభసంహారం: నీల స్వీకరణ వైనం

**కృష్ణుడు వచ్చాడు. కుంభకుని ఇంట్లో ఉన్నాడు. పదంటే పదమంటూ పరుగులు తీశాయి ఆబోతులు. కుంభకుని ప్రాంగణంలోనికి ప్రవేశించాయి. పెద్దపెద్దరంకెలు వేశాయి. మునికాళ్ళతో నేలను దువ్వి, చిందులు వేశాయి. భయభ్రాంతులయ్యారంతా. తలుపులు మూసుకున్నారు. మూసిన తలుపుల్ని విరగ్గొట్టాయి ఆబోతులు. ద్వారాలను పెకిలించి వేశాయి. ఇళ్ళను కూల్చివేశాయి. ప్రాణాలు అరచేతిలోపెట్టుకుని దాగారంతా. ఆ రాత్రి గడిచింది. తెల్లారింది. గోపప్రముఖులందరినీ తన సౌధానికి ఆహ్వానించాడు కుంభకుడు. సభతీర్చాడు. పెళ్ళికూతురువేషంలో ఉన్న కుమార్తె నీలను పక్కనే కూర్చోబెట్టుకుని, శ్రీకృష్ణ బలరామాదులసహా సభలోని వారందరూ వినేట్టుగా చెప్పాడిలా.**

ప్రముఖులారా! మీరు ఆబోతుల ఆగడాలను గమనించారు కదా! దిగ్గజాల్లా కొవ్వెక్కి ఉన్నవి. గర్జిస్తున్న సింహాల్లా ఉన్నవి. గోపకులకు భీతి కలిగిస్తున్నవి. కోపించిన యముడిలా ఉండి, పదేపదే మీదికి ఉరుకుతున్నాయి. అడ్డుకునేందుకు ఎన్ని విధాల ప్రయత్నించినా సాధ్యం కావడం లేదు. నాకు తెలిసి, అవి ఆబోతులు కాదు. పగబట్టిన రాక్షసులో, యక్షులో, గంధర్వులో అయి ఉంటారు. కేవలం హింసకోసమే ఇలా అవతరించి ఉంటారు. వాటిని వెంటనే బంధించాలి. లేనిపక్షంలో విదేహరాజు శిక్షలకి తలొగ్గాలి. ఈ కారణంగానే మిమ్మల్నందరినీ ఇక్కడకు నేను ఆహ్వానించాను. మీరు విశేష బలపరాక్రమవంతులు. మీలో ఎవరైనా ఆ ఆబోతులను శిక్షించగలిగితే ఆ శూరాగ్రణికి నా కుమార్తె నీలను ఇచ్చి వివాహం చేస్తాను. ఇది నిజం.

కుంభకుని మాటలు ఒకనాటి జనకుని మాటలను గుర్తు తెచ్చాయి. శివునివిల్లు విరచగలిగితే సీతను ఇచ్చి వివాహం చేస్తానన్న జనకుని మాటలు ఆనాడు సభికుల్ని ఎంతగా ఆనందపరిచాయో అలాగే కుంభకుని మాటలు ఈనాడు గోపాలకుమారులను అంతగా ఆనందపరిచాయి. అతిలోకసుందరి నీలను చూసి ఆమె తన భార్యయితే బాగుణ్ణనుకుంటూ, అంతలోనే ఆబోతులను తలచుకుని భయభ్రాంతులు అయ్యారంతా.

అంతలో నందగోపుని దాయాది ఘోషవంతుడు పెద్దగా అరుస్తూ లేచి నిల్చున్నాడు. సభికులుసహా ఆశ్చర్యపోయి అతన్ని చూస్తున్న కుంభకునితో అన్నాడిలా.

మహామహామృగాలనే నిర్జించిన నాకు ఈ ఆబోతులు ఒక లెక్క కాదు. వీటిని తృటిలో నేల కూలుస్తాను. కూల్చని పక్షంలో ఈ నా బలపరాక్రమాలు దేనికి? చూడండి.

ఘోషవంతుడు గుండెను పొంగించాడు. జబ్బలు చరిచాడు. తొడకొట్టాడు. దూరంలో నిలిచి, గిట్టలతో నేల దువ్వుతున్న ఆబోతులను చూసి, వాటి మీదికి ఒక్కసారిగా లంఘించాడు. అతన్ని ఆబోతులు చుట్టుముట్టాయి. తీవ్రరోషజ్వాలలతో చూశాయి. ఒక్కుమ్మడిగా అతనిపైకి ఉరికాయి. ఘోషవంతుడూ, ఆబోతులూ ప్రాణాలకు తెగించి పోరాడసాగాయి. ఆ పోరాటాన్ని చాలా మంది చెట్లపైకి, గుట్టలపైకి ఎక్కి చూడసాగారు. ఘోషవంతుడు పిడికిలి బిగించాడు. గదలా గట్టిగా తయారైందది. దానితో ఓ ఆబోతుకొమ్ముల మధ్యలో మోదాడు. దెబ్బకి బైర్లు కమ్మి ఆబోతు వెనక్కి జరిగింది. చూశాడది కృష్ణుడు. పాపం అన్నాడు. ఆబోతులు గురించి జాలిపడుతున్నావా? అడిగాడు బలరాముడు. కాదు అన్నాడు కృష్ణుడు. ఘోషవంతుని గురించే నా బాధ. తొందరపడ్డాడు. బతికి బట్టకట్టడం కష్టం అన్నాడు. కృష్ణుని మాట పూర్తికానేలేదు. ఆబోతులన్నీ ఊహించనిరీతిలో ఘోషవంతుణ్ణి కిందపడవేశాయి. లేవగలిగే అవకాశాన్ని ఈయలేదు. మీదపడి కొమ్ములతో పొడిచి, గిట్టలతో కుమ్మివేశాయి. పెద్ద మాంసంముద్దగా తయారు చేశాయి. ఓ ఆబోతు ఆ ముద్దని కొమ్మునపెట్టి, దూరంగా విసిరివేసింది. ఘోషవంతుడు మరణించాడు.

ఘోషవంతుని మాంసంముద్దనీ, ఆబోతుల క్రౌర్యాన్నీ చూసి గోపప్రముఖులు భయభ్రాంతులయ్యారు. సౌధాన్ని వీడి పరుగందుకున్నారు. అయినా వారిని వదలిపెట్టలేదు ఆబోతులు. పట్టుకుని హింసించాయి. కొమ్ములతో పొడిచి, గిట్టలతో కుమ్మి చంపివేశాయి. హాహాకారాలు చేయసాగారు ప్రముఖులు. అప్పుడిక ఆలసించరాదనుకున్నాడు కృష్ణుడు. అన్న బలదేవుణ్ణి చూసి ప్రార్థించాడిలా.

అన్నా! ఇవి మామూలు ఆబోతులు కావు. నేనూరుకుంటే ఇక్కడ ఉన్న గోపకుల్లో ఏ ఒక్కరూ మిగిలే అవకాశం లేదు. వెంటనే వీటిని మట్టుబెట్టక తప్పదు. ముల్లోకాల్లో మన బలపరాక్రమాలు ప్రచారం కావాలంటే ఈ ఆబోతుల అంతు చూడాల్సిందే! కుంభకుణ్ణి రక్షించాల్సిందే!

ఆవేశపడకు కృష్ణా! ఆలోచించు అన్నాడు బలదేవుడు.

ఆలోచించిన మీదటే నేను ఈ నిర్ణయం తీసుకున్నాను. ఈ ఆబోతులు ఎవరో తెలుసా? పూర్వం తారకామయం సంగ్రామంలో నేను సంహరించిన కాలనేమి పుత్రులే ఇప్పుడు ఈ జన్మలో ఇలా జన్మించారు. నా మీద పగ తీర్చుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. బంధురక్షణకు శత్రుసంహారం తప్పనిసరైన పక్షంలో వెనుకడుగువేయడం భావ్యం కాదు. పైగా వీటిసంహారంతో నీల నాదవుతుంది. శ్రీధామునితో సఖ్యం ఏర్పడుతుంది. నువ్వు అనుమతి ఇస్తే నేను ఆబోతులను అంతం చేస్తాను అన్నాడు కృష్ణుడు.

అంగీకారంగా నవ్వుతూ తలెగరేశాడు బలదేవుడు. అన్న అనుమతి లభించడంతో కృష్ణుడు ఆబోతులవైపు కోపంగా చూశాడు. అటుగా నడిచాడు. వెళ్తున్న కృష్ణుని హెచ్చరిస్తూ బలరాముడు అన్నాడిలా.

కృష్ణా జాగ్రత్త!

ఆబోతులవైపు నడుస్తున్న కృష్ణుని చూసి, యశోదానందులు భయభ్రాంతులైనారు. కుంభకుడు ఆనందాశ్చర్యాలతో పొంగిపోయాడు. అభినందనగా చేతిని ఊపాడు. ఈ ఆబోతులను కృష్ణుడు సంహరించగలడా? లేదంటే ఈతడు కూడా ఘోషవంతుడులా ప్రాణాలు కోల్పోతాడా? ఏం జరుగనున్నది? బిగుసుకున్నారంతా. ఆకాశంలోని దేవతలూ, మునీశ్వరులూ కృష్ణుని గమనించి ఉత్కంఠకు గురయ్యారు. అతని గెలుపుని ఆశిస్తూ దేవదేవుణ్ణి ప్రార్థించారు.

ఆబోతుల దగ్గరకు చేరుకున్నాడు కృష్ణుడు. అన్నాడిలా.

దురాత్ములారా! గొల్లపల్లిని గగ్గోలుపరచి యథేచ్ఛగా తిరిగారు. గోవత్సాలను హింసించారు. ఆబోతుల ఆకారంలో ఉన్నంతమాత్రాన బతికిపోవచ్చనుకుంటున్నారేమో! కల్ల. ఈనాటితో మీ ఆయుష్షు తీరింది. చిచ్చరపిడుగుల్లాంటి నా పిడికిటిపోట్లను రుచి చూడండి.

చూస్తాం! రా అన్నట్టుగా కవ్వించాయి ఆబోతులు.

**ఆబోతులను శిక్షించిన శూరాగ్రణికి తన కుమార్తెనిచ్చి పెండ్లి చేస్తానని ప్రకటించాడు కుంభకుడు. తృటిలో వాటిని నేలకూలుస్తానంటూ ముందుకు వచ్చిన ఘోషవంతుడు ఆబోతుల మీద లంఘించాడు. గిట్టలతో కుమ్మి, కొమ్ములతో పొడిచి ఘోషవంతుణ్ణి మాంసం ముద్దగా మార్చేశాయి ఆబోతులు. అదిచూసి భయభ్రాంతులైన గోపప్రముఖులు అక్కడినుంచి పరుగందుకున్నారు. అప్పుడు కృష్ణుడు ఏం చేశాడు?**

కృష్ణుడు పిడికిలి బిగించాడు. హేళనగా నవ్వాడు. ముందుకు దూకాడు. అతని దూకుడును అడ్డు కుంటూ ఏడు ఆబోతులూ ఒకేసారిగా కృష్ణునిపై విజృంభించాయి. శూలాల్లాంటి కొమ్ముల్ని విసిరాయి. కృష్ణుడు భయపడలేదు. వెనుకడుగువేయలేదు. పిడికిళ్ళతో వాటి మోరలపై బాగా మోదాడు. వాటికి విపరీతవేదన కలిగించాడు. కృష్ణుని దెబ్బలకి కళ్ళు తిరిగి, ఏదీ కనిపించకుండాపోయాయి. ఆ స్థితిలో వాటి కొమ్ములు పట్టుకుని ఒకొక్కదాన్నీ అంతెత్తున లేపి, గాలిలోకి విసిరేశాడు కృష్ణుడు. ఒకదానికొకటి తగిలి నేల మీద పడేలా చేశాడు. రంకె వేసి మట్టుబెడ దామని వచ్చేంతలో వెనుతిరిగి, తోకనందుకునేవాడు కృష్ణుడు. ముష్టిఘాతాలతో మూపురాన్ని తుత్తునియలు చేసేవాడు. ముందు కృష్ణుడు, వెనుక కృష్ణుడు. పక్కన కృష్ణుడు, పైన కృష్ణుడు...ఎటు చూస్తే అటు కృష్ణుడుగా కనిపించి ఆబోతులను అయోమయా నికి గురి చేశాడు కృష్ణుడు. వాటి అయోమయాన్ని గుర్తించి స్నేహితులంతా కృష్ణుని అభినందిస్తూ ఈలలూ, కేకలూ వేయసాగారు. అభినందనలు అందుకున్న కృష్ణుని చూసి సిగ్గుపడ్డది నీల. తల దించుకుని సన్నగా నవ్వుకున్నది. సిరినవ్వులు చింది స్తున్న నీలను గమనించాడు కృష్ణుడు. తన ప్రతా పాన్ని రెట్టింపు చేశాడు. పిడుగుల్లాంటి గుద్దులతో ఆబోతులను రక్తం కక్కుకునేటట్టు చేశాడు. ఆఖరికి వాటి ప్రాణాలను హరించాడు. ఎప్పుడైతే ఆబోతులన్నీ మరణించాయో ఆ క్షణం ఆకాశంలోని దేవత, మునిగణాలు హర్షధ్వానాలు చేశాయి. కృష్ణునికి జేజేలు పలికాయి. ఆహోరులోనే నేల మీది గోప వృద్ధులు కూడా కృష్ణుణ్ణి గట్టిగా కౌగలించుకుని, శుభాశీర్వచనాలు పలికారు.

శుభసమయం ఆసన్నమైంది అనుకున్నాడు కుంభ కుడు. నీల చేయి పట్టుకుని, కృష్ణుణ్ణి సమీపించాడు. అతని చేతిలో, నీల చేతిని ఉంచాడు. అన్నాడిలా.

వీరాధివీరా! ఈ నీల నీ పరాక్రమానికి శుల్క స్వరూపరాలు. తన అదృష్టం కారణంగానే నిన్ను చేరుకుంది. స్వీకరించు.

నీలను దగ్గరగా తీసుకున్నాడు కృష్ణుడు. సిగ్గుల మొగ్గ నీలను బిగికౌగిట బంధించాడు. ప్రముఖులు అది చూసి ఆనందించారు. ఆనందబాష్పాలు వర్షించారు.

విదేహరాజుకి ఈ శుభవర్తమానం అందింది. వెంటనే తరలి వచ్చాడతను. జానకీదేవిని పరి గ్రహించిన శ్రీరాముడిలా వెలిగిపోతున్న శ్రీకృష్ణుణ్ణి చూశాడు. ఆశ్చర్యానందాలు చెందాడు. అమూల్యరత్నా భరణాలు, అంబరాలు కానుకలుగా చెల్లించాడు. నందుని ప్రేమగా చూశాడు. చెప్పాడిలా.

గోపాలకా! నీ కుమారుడు కృష్ణుడు అతిలోక పరాక్రమశాలి. ఆ పరాక్రమాన్ని ప్రదర్శించే మా గోపకుల దుఃఖాన్ని తొలగించాడు. మా నీలను స్వీకరించాడు. ఈ శుభసమయంలో నీకు లక్షలాది గోవులను అరణంగా ఇస్తున్నాను, స్వీకరించు.

కృతజ్ఞతగా సన్నగా నవ్వాడు నందుడు. అన్నా డిలా.

మహారాజా! ఆవులు, గొర్రెలు, మేకలు ఆదిగా



పశువుల మందలు నాదగ్గర చాలా ఉన్నాయి. ఆపై కృష్ణుడు జన్మించిన నాటి నుంచి మా పశుసంపత్తి కోకొల్లలుగా అభివృద్ధి చెందుతున్నది. పితికిన పాలన్నీ కమ్మని నెయ్యి అవుతున్నది. అలాగే అర ణ్యంలో ఫలపుష్పాలూ, కూరగాయలూ, పుట్టతేనె సమృద్ధిగా లభిస్తున్నది. అందరం సర్వదా ఆయు రారోగ్య ఐశ్వర్యాలతో వృద్ధి చెందుతున్నాం. ఇక కావాల్సిందేముంది? వద్దంటున్నానని, అన్యథా భావించి, కోపగించుకోకు.

నందుని అభ్యర్థనను మన్నించాడు రాజు. అతన్ని గట్టిగా కౌగిలించుకున్నాడు.

నీలసహా కృష్ణుడు కుంభకుణ్ణి సమీపించాడు. శ్రీధామున్ణి తనకు సఖునిగా ప్రసాదించమని కోరాడు. కాదనలేదు కుంభకుడు. ప్రసాదించాడలాగే! నీల, శ్రీధాములసహా తల్లిదండ్రులను చేరుకున్నాడు కృష్ణుడు. బృందావనానికి బయల్దేరారంతా. త్వరలోనే బృందా వనానికి చేరుకున్నారు. ఎప్పటిలాగే కృష్ణుడు గోపా లకవృత్తిని చేపట్టాడు.

చెప్పడం ఆపి, ఊపిరి తీసుకున్నాడు వైశం పాయనుడు.

మునివర్యా అని పిలిచాడు జనమేజయుడు. ఏమిటి అన్నట్టుగా చూసిన వైశంపాయనునికి చేతులు జోడించి నమస్కరించాడతను. అడిగాడిలా.

కృష్ణునికథలు ఎంతగా విన్నా తనివి తీరకున్నది. ఇంకా వినాలనిపిస్తున్నది. నువ్వు చెప్పిన ఆనాటి సంఘటనలను విని, నేనెంతగా పులకించిపోతున్నానో చూస్తున్నావుగా. విన్నదానికే నేనింతగా పులకించి పోతూ ఉంటే ఆనాడు ఆ సంఘటనల్లో పాల్గొన్న వారు ఇంకెంతగా పులకించిపోయి ఉంటారో? అదృష్ట వంతులు వారంతా. తర్వాతేం జరిగింది? దయచేసి వివరించు.

వైశంపాయనుడు వివరించసాగాడిలా.

గోపాలకుడైన కృష్ణుడు అభినవయవ్వన పరి పూర్ణుడై మృగేంద్రంవలే రూపొందాడు. బలదేవుడు కూడా అలాగే తయారయ్యాడు. ఆ ఇద్దరినీ చూడ కళ్ళు చాలవనుకునేవారంతా. అంత అందంగా అన్న దమ్ములు బృందావనంలో తిరుగుతోంటే పట్టరాని సంతోషంగా ఉండేది గోపికలకు.

రోజులు గడుస్తున్నాయి. ఒకనాడు స్నేహితులు, బలదేవుడుసహా కృష్ణుడు యమునాతీరానికి చేరు కున్నాడు. కాసేపు విహరించాడక్కడ. అలసిపోయాడు. విశ్రాంతి తీసుకునే చోటుకోసం చూస్తోంటే అతనికి ఓ మర్రిచెట్టు కనిపించింది. రండి రండి! అక్కడా మర్రిచెట్టు కింద విశ్రమిద్దాం అన్నాడు కృష్ణుడు. అతని మాట కాదనేవారెవరు? పరుగుదీశారంతా. మర్రిచెట్టు నీడకు చేరుకున్నారు. కూర్చున్నారక్కడ. దూరంగా పశువులు మేస్తున్నాయి. వాటిని ఓ కంట కనిపెడుతూ కబుర్లలో పడ్డారంతా. అంతలో వాసు దేవుడు, భరద్వాజుడు మొదలైన మహర్షులు తీర్థ యాత్రార్థమై అటుగా వచ్చారు. సువిశాలంగా ఉన్న అక్కడి మర్రిచెట్టును చూశారు. ఆనందభరితులయ్యారు. ఆ వృక్షానికి ప్రదక్షిణనమస్కారాలు ఆచరించారు. కూర్చున్న గోపాలురును చూశారు. అడిగారిలా.

నాయనలారా! ఈ యమునాతీరంలో ప్రమాదం లేని రేవు ఎక్కడ ఉన్నదో చెప్పగలరా?

సమాధానంగా గోపాలురు ఒకరిని ఒకరు చూసు కుని నవ్వుకున్నారు. మాకు తెలియదంటే మాకు తెలియదన్నారు. వచ్చింది మహర్షులు. ఆ సంగతి తెలియక ఆటపట్టిస్తున్నారు గోపాలురు. అది గమ నించాడు కృష్ణుడు. ఆగండాగండి అని హెచ్చరించాడు. మహర్షులకు నమస్కరించాడు. తెలియజేశాడిలా.

—అరణి




# అప్పు ఎప్పుడూ ముప్పే

"అప్పిచ్చువాడు, వైద్యుడు
ఎప్పుడు నెడతెగక బాఱు నేఱును, ద్విజుడున్
చొప్పడిన యూర నుండుము
చొప్పడకున్నట్టి యూర జొరకుము సుమతీ!

"అప్పిచ్చువాడు, వైద్యుడు, సమృద్ధిగా నీరు, బ్రాహ్మణుడు లభించే గ్రామంలో నివసించు, అవన్నీలేని గ్రామంలో నివసించవద్దు" అని తాత్పర్యం.

సుమతీ శతకంలో చెప్పిన ఈ పద్యం నేటి కాలానికి వర్తిస్తుందా?

అప్పు తీసుకునేవాడు, ఇచ్చేవాడు ఆదికాలం నుండీ ఉన్నారు. కలియుగదైవం వెంకటేశ్వరస్వామి కుబేరుని దగ్గర అప్పుచేసి నేటికీ వడ్డీ కడుతూ "వడ్డీకాసులవాడు"గా పేరొందాడు.

ఈ కాలంలో వడ్డీ వ్యాపారులు, తాకట్టుపెట్టుకుని డబ్బిచ్చే పాన్‌బ్రోకర్లు, బ్యాంకులు 24 గంటలూ సదా మీ సేవలో అంటూ మనకు అప్పులివ్వడానికి సిద్ధంగా ఉంటాయి.

బాధ్యత వహించే సమయంలో మనిషి ప్రవర్తన మారిపోతుంది. అంతా సక్రమంగా సాగినంత కాలం అందుకు 'నేనే' కారకుణ్ణని, అందరూ తన విజయాన్ని గుర్తించాలని కోరుకుంటారు.

పరిస్థితులు అనుకూలించనప్పుడు తప్పు ఎవరి మీద నెడదామా, తన పొరబాట్లకు ఎవరిని బాధ్యుల్ని చేద్దామా, నింద ఎవరిపై మోపుదామా? అని ఎదురు చూస్తుంటారు. ఇక ఆర్థికంగా కుదేలైనప్పుడు మనిషికి కనిపించే ఏకైకమార్గం 'అప్పు'. బాధ్యతల తీవ్రత అప్పు చెయ్యడానికి ప్రేరేపిస్తుంది.

## దుప్పటి ఉన్నంతవరకే

అప్పు చెయ్యడం, చెయ్యిచాపి డబ్బు అడగడం అవమానంగా భావించేవారు అప్పు చెయ్యరు.

ఇలాంటివారు "దుప్పటి ఉన్నంతవరకే కాళ్ళు ముడుచుకుంటారు". ఎంతో అత్యవసరమైతే తప్ప ఇలాంటివాళ్ళు అప్పు చెయ్యరు. చేసినా ధర్మబద్ధమైన కారణం ఉంటుంది. తల్లిదండ్రుల అనారోగ్యం, ప్రాణాపాయస్థితి, పిల్లల చదువులు, పెళ్ళిళ్ళ సమయాల్లో రెండో కంటికి తెలీకుండా సేవింగ్స్, ప్రావిడెంట్‌ఫండ్, ఎల్‌ఐసీ లాంటిచోట్ల అప్పు తీసుకుంటారు. ఖర్చులు తగ్గించుకునో, అదనంగా కష్టపడో అనుకున్న దానికంటే ముందుగానే అప్పు తీర్చేస్తారు.

మరికొంతమంది తీర్చగలమన్న భరోసా ఉన్నప్పుడే అప్పుచేస్తారు. ఉద్యోగులకి ఇంక్రిమెంటు, డి.ఎ రూపాల్లో ఏటా కొంత ఆదాయం పెరుగుతుంది. దాన్ని దృష్టిలో పెట్టుకుని గృహోపకరణాలకు ఇన్‌స్టాల్‌మెంట్‌లో ఇ.ఎమ్.ఐలు చెల్లిస్తారు. ఆ అప్పు తీరే వరకూ మరో అప్పు చెయ్యరు.

## అప్పులతో ఆర్భాటం

అప్పులతో ఆర్భాటం చేసేందుకు ధనిక, పేద తేడాలేదు. అప్పిచ్చేవాడు కన్పిస్తేచాలు. తమ దర్జా, దర్పం మొదలవుతాయి. ఇలాంటి అప్పుల అప్పారావులు కోకొల్లలు. 'ఇచ్చేవాడు ఉండబట్టే తీసుకుంటున్నాం' అనే ధోరణిలో ఉంటారీ విజయ్‌మాల్యాలు.

మా తాతలు నేతులు తాగారు కాబట్టి అప్పు చేసైనా మేమూ నేతులు తాగాలన్న ధోరణిలో ఉంటారు. కూర్చుని తిని ఆస్తులు కరగదీస్తారు. కానీ ఆ వాస్తవం వాళ్ళకి బోధపడదు.

అప్పిచ్చేవాడుంటే అవసరం లేకున్నా దర్పం, దర్జా చాటుకోవడానికి ఆదాయానికిమించి అప్పులు చేస్తుంటారు.

"నువ్వేంట్రా పరమ పిసినారిలా ఉన్నావు. పైసా బయటికి తియ్యవు, ఖర్చుపెట్టవు, సిగరెట్ అలవాటు లేదు" లాంటి సంభాషణలు ముఖ్యంగా పల్లెటూళ్ళలో నలుగురూజేరేచోట మొదలవుతాయి.

"నీలా అప్పులుచేసి సిగరెట్లుకాల్చి డబ్బు బూడిద చెయ్యటానికి, మా బాబు సంపాదించిన ఆస్తులు లేవురా బాబూ! నాది కష్టపడిన సొమ్ము! నువ్వు ఇలాగే ఉంటే నీ ఆస్తులు కర్పూరంలా కరిగిపోయి అప్పులే మిగుల్తాయి" అనేది రెండోవ్యక్తి సమాధానం.

మార్కెట్లోకి ఏది కొత్తగావస్తే దానిని సొంతం చేసుకోవాలనుకుంటారు కొందరు. లేటెస్ట్ టీవీ, ఖరీదైన సోఫాలు, ఎ.సి.లు, మ్యూజిక్ సిస్టం...ఒకటేమిటి? ఇలాంటివాటితో 'స్టేటస్' ప్రదర్శిస్తూ బిల్డప్ ఇస్తుంటారు. బ్యాంకులు, సంస్థలు, వ్యక్తులు, క్రెడిట్ కార్డులు... కాదేదీ అప్పుకి అనర్హమన్నట్టు అప్పుల మీద అప్పు చేస్తుంటారు. తాతలు కష్టపడి కూడబెట్టిన ఆస్తుల్ని, సోమరులై ఆడంబరాలకి కరగేసీ, చివరికి బికారులుగా మిగులుతారు. అప్పులబాధతో ఆత్మహత్యలకు పాల్పడుతుంటారు.



మనలో చాలామందికి ఆదాయ వ్యయాలకు తేడా తెలీదు. అది తెలిసినవాడు అప్పులబారిన పడకుండా జాగ్రత్తపడతాడు. అలాంటివాళ్ళే జీవితంలోనైనా, వ్యాపారంలోనైనా 'విజయం' సాధిస్తారు.

## అప్పుల కబుర్లు

"ఎంతండీ! నెల్రోజుల్లో తిరిగిచ్చేస్తా, రావాల్సిన డబ్బు సకాలంలో అందకపోబట్టి ఇలా అప్పుకోసం రావాల్సొచ్చింది అంటాడు దర్జాగా. తీరా చెల్లించే సమయానికి మనిషి కనిపించడు. అప్పు ఇచ్చినవాడే వెతుక్కుంటూ వెళ్తాడు. "రండి! రండి! నేనే ఫోన్ చేద్దామనుకున్నా. ఊరెళ్ళి ఇవ్వాళే వచ్చా. ఏం తీసుకుంటారు.. కూల్‌డ్రింక్, కాఫీ.."

"ఏం వద్దండీ! నా డబ్బు.." అంతలో కాఫీ వస్తుంది.

"పోయిన నెలే ఇచ్చేద్దామనుకున్నా, కానీ...." అంటూ ఓ అబద్ధం సృష్టిస్తాడు.

వచ్చినవాడు కాఫీతాగెళ్ళిపోతాడు. మళ్ళీ అడిగితే, "ఇస్తాం లేవయ్యా! పారిపోతామా! కావాలంటే నోటు రాసిస్తా! వడ్డీకేగా ఇచ్చావు. మాకూ ఆస్తులున్నాయి (అప్పులు), వచ్చేనెల ఇస్తా" అంటాడు ఘాటుగా. వీళ్ళ దృష్టిలో అప్పిచ్చినవాడు అమాయకుడు.

## అప్పు తీసుకోవడం ఇవ్వడమూ ప్రమాదమే

రాజారావు పైసా లంచం ఆశించని నిక్కాచ్చైన మనిషి. పిల్లలూ సెటిలయ్యారు. సొంత ఇల్లు. రిటైరయ్యాడు. ప్రశాంత జీవితం గడపాలనుకున్నాడు. లక్షల్లో వచ్చిన రిటైర్మెంట్ డబ్బు ఏం చేద్దామని ఆలోచించేలోపే ఇద్దరు బావమరుదులు వచ్చి వాలిపోయారు.

"బ్యాంకు వడ్డీ తక్కువ. బయట వడ్డీలకిస్తే మాలా సంపాదించుకోవచ్చు" అన్నారు.

రాజారావు తిరస్కరించాడు. కానీ వాళ్ళ ఒత్తిడికి, అధికవడ్డీ ప్రలోభానికి లొంగిపోయాడు. భార్య వద్దని మొత్తుకున్నా విన్లేదు.

కొత్తకొత్త వ్యక్తుల పరిచయాలు, పొగడ్తలు, విందులు, విలాసాలు...జీవితం అంటే ఇదేరా అన్పించేలా రాజారావుకి మూడుపువ్వులు ఆరుకాయలుగా గడిచింది ఓ ఆర్నెల్లు. మొదట బావమరుదులే వడ్డీ తెచ్చిచ్చేవారు. తర్వాత మొహం చాటేశారు. అప్పు తీసుకున్నవాళ్ళ జాడలేదు.

తప్పుచేశానని రాజారావుకి అర్థమైపోయింది. 'అసలుసొమ్ము' తిరిగొచ్చే ఆశ సన్నగిల్లింది. చెక్కులు బౌన్స్ అవుతున్నాయి. పోలీసు కేసులు, కోర్టులు మొదలయ్యాయి. పెన్షన్ కూడా చాలక అప్పుచేసి వకీళ్ళకిచ్చే పరిస్థితి వచ్చింది. కోలుకోలేని ఊబిలో దిగబడ్డాడు. భార్య మంచానపడింది. చివరికి రాజారావు గుండె పోటుతో కోర్టుముందే కన్నుమూశాడు.

ఇలాంటి రాజారావులకు గాలంవేసే బృందాల్లో ఆడా, మగా అనే తేడా ఉండదు.

## అప్పుల్లో రకాలు

చిన్నాచితకా వ్యాపారులకు అప్పులిచ్చి రోజువారి వసూళ్ళు చేస్తుంటారు. వందకి 10–15 రూపాయలు వంతున 'అసలు'లో ముందుగానే కత్తిరించుకుని ఇస్తారు. చెల్లింపులలో తేడా వస్తే యాగీచేసి పరువు తీస్తారు. రౌడీల్నీ వెంటబెట్టుకొస్తారు.

తాకట్టు వ్యాపారంలో పాన్‌బ్రోకర్లు 100 అడిగితే 50 చేతికి ఇస్తారు. గడువులోపు చెల్లించకపోతే తాకట్టు వస్తువును వదులుకోవాల్సిందే.

ఫైనాన్సు కంపెనీలు రోజుకో వింత ధోరణిలో వసూళ్ళు చేస్తారు.




చిన్నాచితకా ప్రభుత్వోద్యోగుల్లో కొందరు అప్పులిచ్చి కుబేరులవుతుంటే, తీసుకున్నవాళ్ళు కుచేలురవుతుంటారు. అప్పు తీసుకున్నవాళ్ళ బ్యాంక్ బుక్, చెక్‌బుక్, క్రెడిట్, డెబిట్ కార్డు తీసుకుని అప్పులిస్తారు. నెలనెలా వీళ్ళజీతం వాడే డ్రాచేసి తన అప్పు, వడ్డీ పోగా మిగిలిందేదో వాళ్ళచేతుల్లో పెడతారు. ఇలాంటి ఊబిలో కూరుకున్న ఉద్యోగులెందరో ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

## హేట్ విజయ్‌మాల్యా



లక్షకోట్లుపైగా ఆస్తులున్న విజయ్‌మాల్యా పతనమయ్యాడు. 'కింగ్‌ఫిషర్ సృష్టికర్త 'కింగ్ ఫిషర్' అయ్యాడు. కింగ్‌లా వెలిగిపోయి, బ్యాంకులను ముంచి అధఃపాతాళంలో పడిన ఈ విల్‌ఫుల్ డిఫాల్టర్ చివరకు దేశం వదిలి పారిపోయాడు.

కింగ్‌ఫిషర్ ఎయిర్‌లైన్స్, యునైటెడ్ బ్రేవరీస్, ఐ.పి.ఎల్. రాయల్ ఛాలెంజర్స్ ఆఫ్ బెంగళూరు, ఎఫ్–1 కేసులో వాటా ఇలా విజయ్ మాల్యా ఆస్తులగురించి వింటే 'వామ్మో' అని ఆశ్చర్యపోతాం. కానీ అంతకుమించిన క్రిమినల్ మైండ్‌తో ఎన్నో బ్యాంకుల్ని బురిడీ కొట్టించాడు. తన దగ్గర లక్షలకోట్లు ఆస్తులున్నా, కంపెనీ ప్రారంభానికి కోట్లలో బ్యాంకు అప్పులు చేశాడు.

6,900 కోట్లు బ్యాంకుసొమ్ముతో కింగ్‌ఫిషర్ ఎయిర్‌లైన్స్ స్థాపించి, కొంత ఐపీఎల్‌లో ఇన్వెస్ట్ చేశాడు. నాలుగేళ్ళలోపే కింగ్‌ఫిషర్ నష్టపోయిందంటూ చేతులెత్తేశాడు. బ్యాంకు అప్పులు తీర్చలేదు. ఉద్యోగస్థులకు జీతాలివ్వలేదు. ఐపీఎల్ రాయల్ ఛాలెంజర్స్‌లో చేతులు కాల్చుకున్నాడు.

బహిరంగంగా బ్యాంకుల్ని దోచుకున్న మాల్యా అమ్మాయిలతో ఎంజాయ్ చేస్తూ హాయిగా తిరుగుతున్నాడు. యునైటెడ్ బ్రెవరేజెస్ కంపెనీ లాభాల్లో ఉంది. దానికి కోట్ల ఆస్తులున్నాయి. కానీ బ్యాంకులు దాన్ని టచ్ చెయ్యలేవు. కార్పొరేట్ రూల్స్ ఒప్పుకోవు.

పార్టీలు, మోడల్స్‌తో జల్సాలు చేసే మాల్యాను మించిన విలాసపురుషుడు లేడనిపిస్తుంది. ఇదే విషయం ఓ జర్నలిస్టు అడిగితే "నాకు డబ్బు, వయసు ఉన్నాయి, ఎంజాయ్‌చేస్తున్నా, తప్పేంటి" అని నిస్సిగ్గుగా ప్రశ్నించాడీ బెంగళూరు బురిడీ బాబు.

ఇంతటి మోసగాడికి రాజ్యసభ సీటిచ్చి, విల్ ఫుల్ డిఫాల్టర్స్ లిస్టులో చోటిచ్చింది ప్రభుత్వం. బ్యాంకులు మాల్యాకు కాపుగాశాయి. ఇప్పుడు లండన్‌లో జల్సా చేస్తున్నాడు. అయినా మన (అ)ప్రజాస్వామ్యంలో అడిగే నాథుడులేడు. కాదేదీ అప్పుకీ, మోసానికీ అనర్హం. అందుకే కలికాలం, కలకాలం గుర్తుంచుకునే చరిత్ర సృష్టించాడు విజయమాల్యా.

## క్రెడిట్ కార్డు కుబేరులు

ఎన్ని క్రెడిట్ కార్డులుంటే అంత గొప్ప అని ఫీలవుతారు కొందరు. ఎవరిమెప్పో పొందటానికి, ఆర్భాటాలకు పోతుంటారు కొందరు క్రెడిట్‌కార్డురాయుళ్ళు. రేపటి సంపాదన ముందే ఖర్చుచేసేస్తారు. వీళ్ళకి క్రెడిట్‌కార్డు ఓ అక్షయపాత్ర. కానీ ఆ అప్పు ఊరికే జేబులోకొచ్చిపడిపోదు. హోటల్స్, మాల్స్‌లో క్రెడిట్ కార్డు వాడేవారు 30–40 శాతం ఎక్కువగా చెల్లిస్తున్నారని సర్వేలు చెబుతున్నాయి.

క్రెడిట్‌కార్డు వాయిదా సకాలంలో చెల్లించకపోతే వసూల్ గుండాలు పరువు బజారుకీడ్చి చుక్కలు చూపిస్తారు. అప్పు ఎలాంటిదైనా అదెంత ప్రమాదకరమో ధనికులకు బాగా తెలుసు. అందుకే వాళ్ళు స్థిరాస్తులు కూడబెడతారు. కోరికలు తీర్చుకోవడానికి అప్పులు చెయ్యరు.

ఆర్భాటపు అప్పు నైతిక పతనానికి ఆరంభం. విజయానికి అవరోధం. అప్పువల్ల కుంటిసాకులు, అబద్ధాలు, మాట తప్పడం, అసహనం అలవడతాయి. కష్టపడి నిర్మించుకున్న జీవితం అలా పతనంతో ముగుస్తుంది.

"అప్పు హానికరం" అని గుర్తించిన వాళ్ళే విజయానికి విలాసం అవుతారు.

నవ్య

# ఎందుకో...

-వేద మయూరం

**"ఎందుకో...? ఈ పరంధామయ్య పిల్లల జీవితాలతో ఆడు కుంటాడు. ఆ సాఫ్ట్‌వేర్ సంబంధం కాదని చిన్నపిల్లలకు తెలుగుపాఠాలు చెప్పుకునే మామూలు బడిపంతులుకు ఇచ్చి ఆ పిల్ల గొంతు కోస్తున్నాడు. అయినా అందరూ నాలాగ తెలివిగా ఆలోచించగలరా?" అని ప్రణవి పెళ్ళి పత్రిక చూసి మనసులోనే బాధపడుతున్నాడు పరంధామయ్య స్నేహితుడైన జానకిరామయ్య.**

"అబ్బబ్బ...ఎన్నిసార్లు పిలవాలి? కాఫీ తీసు కోండి. మళ్ళీ చల్లారిందని వంకలు పెడ తారు" భార్య వైదేహి పిలుపుతో ఆలోచన ల్లోంచి బయటకువచ్చాడు జానకిరామయ్య. పడకకుర్చీలో విరామంగా పడుకున్న జానకిరామయ్య లేచి కూర్చుంటూ "ప్రణవికి పెళ్ళి కుదిరిందే" అన్నాడు వైదే హికి పత్రిక అందిస్తూ. "అలాగా? ఆ మాట కాస్త సంతోషంగా చెప్పొచ్చుగా" అని కాఫీ పక్కనున్న టేబుల్‌మీద పెట్టి పత్రిక అందు కుంది.

"ఎలా సంతోషపడమంటావ్? వాడు నా మాట వినకుండా కూతుర్ని ఆ బడి పంతులుకు ఇచ్చి చేస్తు న్నాడు. ఆ పిల్ల గొంతు కోస్తున్నాడు" అన్నాడు కొంచెం ఆవేశంగా. "అవేం మాటలండీ? శుభమా అని పెళ్ళి చేస్తుంటే గొంతుకొయ్యటం అంటారు. అన్నయ్యగారు ఏంచేసినా ఆలోచించే చేస్తారు. అయినా మీరంటున్న సాఫ్ట్‌వేర్ సంబంధం ఆ పంకజం కొడుకేకదా?" అడిగింది వైదేహి పెళ్ళి పత్రి కలోంచి తల తిప్పకుండా. "ఆఁ అదే! ఎంత మంచి సంబంధం. నెలకు రెండులక్షలు జీతం, హైదరాబా ద్‌లో సొంత ఇల్లు. ఒక్కడే కొడుకు ఇంకేం కావాలి?" అన్నాడు. "ఆ... ఆ... కావలిసినన్ని చెడుతిరుగుళ్ళు కూడా ఉన్నాయి" దెప్పింది వైదేహి. "ఈ కాలంలో ఎవరికిలేవు? పెళ్ళి చేస్తే అన్నీ సరిపోతాయి" అన్నాడు తన మాటలు సమర్థించుకుంటూ. "మరి మన శ్రావ ణిని అడిగినప్పుడు ఎందుకు కాదన్నారు?".

'............'

"ఏం మాట్లాడరే? ప్రణవి మాత్రం శ్రావణిలాగా మన బిడ్డకాదా?" నిలదీసినట్టు అడిగింది వైదేహి.

ఇంతలో ఫోన్ మోగటంతో లోపలికి వెళ్ళింది వైదేహి. ఏం చెప్పాలో అర్థం కాలేదు జానకిరామ య్యకు. తన మాటకు ఎదురుచెప్పినందుకు వైదేహి మీద చాలా కోపంగా ఉంది. వైదేహి అడిగినదాంట్లో తప్పేముంది? 'శ్రావణిని ఇవ్వటానికి నువ్వు ఎందుకు ముందుకు రాలేదు?' అని మనస్సాక్షి నిలదీస్తోంది. అంటే తను తప్పు, పరంధామయ్య కరెక్టా? ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

"ఏమండీ...మన శేఖర్ కోడలిని మనవడిని తీసుకువస్తున్నాడట" ఫోనులో సంభాషణ క్లుప్తంగా భర్తకు చెప్పింది వైదేహి ఆనందంగా. మనవడు అమెరికా నుండి వస్తున్నాడన్నమాట వినగానే జానకిరామయ్య ఆలోచనలన్నీ చెదిరిపోయాయి. "ఎప్పుడు వస్తున్నారు?" అడిగాడు ఉత్సాహంగా పడక కుర్చీ లోంచి లేస్తూ.

"ఇంకా పదిరోజులు ఉంది. ప్రణవి పెళ్ళికి రెండురోజుల ముందు వస్తారు" అని చెప్పి "పప్పు బిళ్ళలు చెయ్యాలి. అత్తిరాసాలు చేస్తే బాగుంటుంది, బెల్లం ఉందో లేదో" అని గొణుక్కుంటూ హడావుడిగా లోపలికి వెళ్ళిపోయింది వైదేహి. మనవడు వస్తున్నాడని సంబరంగా ఉంది జానకిరామయ్యకు. కానీ ఇంకా పది రోజులు వేచి ఉండాల్సివచ్చినందుకు చిరాగ్గా కూడా ఉంది.

పదిరోజులు పదియుగాల్లా గడిచాయి ఆ దంపతులకు. చివరకు ఎదురు చూస్తున్న రోజు రానే వచ్చింది. శేఖర్ హైదరాబాద్‌లో మామగారింటికి చేరు కుని మరుసటిరోజు అందరూ కలిసి కారులో రాయలసీమలోని తమ గ్రామా నికి చేరుకున్నారు. అమెరికాలో పుట్టిన మనవడిని మొదటిసారి మూడేళ్ల వయ సులో చూశారు వైదేహి దంపతులు. ఇప్పుడు వాడికి ఆరేళ్ళు. వాడు ఇండియాకు రావటం ఇది రెండవ సారి. మనవడిని చూస్తూనే భావోద్వేగంతో కళ్ళలో నీళ్ళు పెట్టుకుంటూ ముద్దులతో ముంచేసింది వైదేహి. వాడిని కాలు కింద పెట్టనివ్వకుండా చూసుకుంటున్నారు ఇద్దరూ.

చూస్తుండగానే రోజులు గడిచిపోతు న్నాయి. ఒక రోజు "రామా! రామా..." అని పిలిచాడు శేఖర్ ఎక్కడికో బయలుదేరుతూ. "వాడు మీ అమ్మతో కలిసి కూరగాయలు కోస్తు న్నాడు పెరట్లో. అయినా 'రామా' అంటావేమిటిరా? అది మీ తాతయ్య పేరు, చాలా పాతది. మంచి మోడ్రన్ పేరు పెట్టొచ్చు కదా" అన్నాడు పేపర్ చదువుతున్న జానకిరామయ్య కొడుకుతో. "పాతదైనా మంచిపేరు కదా నాన్న! అంతకన్నా అందమైన పేరు ఇంకొకటి ఉందా? నేను సగం పేరు మాత్రమే పిలుస్తాను, మీ కోడలైతే 'సీతారాముడు' అని పూర్తిపేరు పెట్టి పిలుస్తుంది తెలుసా" అన్నాడు శేఖర్ చెప్పులు వేసుకుంటూ. "నాన్నా.." అని పరుగునవచ్చి శేఖర్‌కు తను కోసిన కూర గాయలు చూపించాడు సీతారాముడు. కోసినవి రెండు బెండ కాయలు, రెండు వంకాయలే అయినా అవి జారిపోకుండా టీ షర్టులో పెట్టుకుని జాగ్రత్తగా తీసుకొచ్చాడు. ఎప్పుడూ ప్లాస్టిక్ బ్యాగ్స్‌లో కనిపించే కూరగాయలు ఇప్పుడు మొక్కలకు అతు క్కుని ఉండటంచూసి చాలా ఆశ్చర్యంగా ఉత్సాహంగా ఉన్నాడు సీతారాముడు. వాటిని ఎంతో అపురూపంగా తాతయ్యకు చూపెడుతూ "తాతా తాతా! చూడు నేనేం తీసుకొచ్చానో" అన్నాడు. "తాతకాదు నాన్నా, గ్రాండ్పా అని పిలు... స్టైల్‌గా ఉంటుంది" అన్నాడు జానకిరామయ్య. గ్రాండ్పా కన్నా 'తాత' బాగుంది తాతయ్యా. అలాగే పిలవాలని అమ్మ చెప్పింది" అన్నాడు ముద్దుగా. ఆ మాటకు జానకిరామయ్య ఎంతో నిరాశ చెందాడు. "సరే.. రా, నిన్ను ఒక చోటుకు తీసుకెళ్తా" అని కొడుక్కి తన చూపుడువేలు అందించాడు శేఖర్. కూరగాయలు తాతయ్య చేతిలోపెట్టి తండ్రి వేలు పట్టుకుని నడిచాడు సీతారాముడు.

"ఎందుకో....? వీడు ఈ కాలం పిల్లాడులా లేదు. బెంగుళూ రులో ఉండే గోపాలరావు మనవడు ఇంగ్లీషులోనే మాట్లాడ

-బి.పి.యస్

**అమెరికా మనవడొస్తున్నాడని తెలిసి ఆ పది రోజులూ పది యుగాల్లా గడిపారు ఆ తాత, బామ్మ. మనవడి ప్రవర్తనచూసి బామ్మ మురిసి పోతుంటే, తాతగారు మాత్రం వీడేంటి ఇలా తయారయ్యాడని తెగ బాధపడి పోయాడు. తన స్నేహితుడి మనవడికీ వీడికీ ఎంత తేడా? స్నేహితుడిముందు తన పరువేంగాను? అనుకున్నాడు ఆ తాత. ఇంతకీ ఆ మనవడు అంత కాని పని ఏం చేశాడు?**

తాడు, వాడేకాదు వాళ్ళ అమ్మానాన్నా అందరూ ఇంగ్లీషులోనే మాట్లాడతారు. కానీ వీడు అమెరికాలో ఉన్నాగానీ తెలుగులోనే మాట్లాడుతున్నాడు. గోపాలరావు ముందు నా పరువు ఏం కావాలి?" మనవడి ప్రవర్తనకి మనసులోనే బాధపడ్డాడు జానకిరామయ్య.

ఉన్నది పల్లెటూరులో అయినా తల్లిదండ్రులు ఇబ్బంది పడకుండా అన్ని సౌకర్యాలతో ఇల్లు కట్టించాడు శేఖర్. అందరూ ఉండటానికి అనువుగా విశాలంగా ఉంది ఇల్లు. ఇంటిముందు కారు నిలుపుకోవటానికి కావలసినంత స్థలం, కూరగాయలు, పూలమొక్కలు పెంచుకోవటానికి పెరడు వీటి మధ్యలో అందమైన ఇల్లు. కొడుకు, కోడలు రావటంతో ఆ ఇంటికి కళ పెరిగింది. అందరూ సంతోషంగా ఉన్నా జానకిరామయ్య మాత్రం ఏదో తెలియని బాధ పడుతున్నాడు. కారణం మనవడు. గోపాలరావు మనవడికి తాతయ్య పేరు లక్ష్మీనారాయణ అని పెట్టు కున్నాడు. కానీ వాళ్ళు, వాడిని లక్కీ అని స్టైల్‌గా పిలుస్తారు. తన కొడుకు శేఖర్ 'రామా' అని పిలుస్తున్నాడు. లక్కీ టీవీ పెట్టకపోతే భోజనం చెయ్యడు. కానీ వీడు వాళ్ళ నానమ్మ ఒడిలో కూర్చుని ఏవో పనికిరాని పాత తెలుగు పాటలు, కథలు కావాలంటాడు. లక్కీ అంగడిలో దొరికే చాక్లెట్లు, చిప్స్ ఇంకా ఏవేవో తింటాడు. కానీ వీడు ఇంట్లో చేసే పాతకాలం వంటలు ఇష్టంగా తింటాడు.

'ఈతరం పిల్లలకు ఉండాల్సిన హుందాతనం అస్సలు లేదు వీడిలో' అని బాధపడుతున్నాడు జానకిరామయ్య. అతని ఆలోచనల్ని చెదరగొడుతూ "ఏం ఆలోచిస్తున్నావ్ జానకిరామయ్య? అమెరికా నుండి మనవడు వచ్చాడట కదా!" అంటూ పలకరించాడు గోపాలరావు. "రా గోపాల్, ఏమిటి ఇంత పొద్దున్నే? వైదేహీ, గోపాల్ వచ్చాడు కాఫీ తీసుకురా" అని గోపాలరావును పలకరించి వంటగదిలో ఉన్న వైదేహికి కాఫీ తెమ్మని ఆర్డర్ వేశాడు జానకిరామయ్య. "ఏడీ మనవడు కనపడ్డే? ఇంకా నిద్ర లేవలేదా?" అడిగాడు గోపాలరావు. "లేచి వాళ్ళ నాన్నతో బయటకు వెళ్ళాడు. ఉదయం ఏడుగంటలకే లేస్తాడు. స్నానంచేసి వాళ్ళ అమ్మతో పూజ చేస్తాడు. మొదట్లో కాస్త ఇబ్బంది పడినా ఇప్పుడు బాగా అలవాటుపడ్డాడు. అక్కడికి ఇక్కడికి కొన్ని గంటలు తేడా ఉంటుంది కదా!"

"కాఫీ తీసుకోండి మామయ్యా" అని కాఫీ అందించింది కోడలు విమల. "నువ్వు తెచ్చావేమ్మా? మీ అత్తయ్య ఏది?" అడిగాడు జానకిరామయ్య. "లక్ష్మీ ఆంటీ ఇంట్లో ఆవులు ఉన్నాయి కదా! ఆవు పాల కోసం వెళ్ళారు. నమస్కారం గోపాలరావు గారు, బాగున్నారా? ఆంటీ ఎలా ఉన్నారు?" గోపాలరావును పలకరిస్తూ నమస్కరించింది విమల. "బాగున్నామమ్మా, నువ్వు ఎలా ఉన్నావ్? ఈ పల్లెటూరు అనుకూలంగా ఉందా?" అడిగాడు గోపాలరావు ఆశీర్వదిస్తున్నట్లు చేయి ఊపుతూ. కాసేపు కబుర్లు చెప్పుకున్నారు. విమలను అడిగి అమెరికా విశేషాలు తెలుసుకున్నాడు గోపాలరావు.

అంతలో బయటకు వెళ్ళిన శేఖర్ కొడుకుతో సహా వచ్చాడు. "బాగున్నారా అంకుల్" అన్నాడు శేఖర్ గోపాలరావును ఉద్దేశించి. "హా ఇదిగో ఇలా ఉన్నా నాయనా. నువ్వెలా ఉన్నావ్? వీడేనా నీ కొడుకు అని శేఖర్‌ను పలకరించి, హలో! వాటీజ్ యువర్ నేమ్?" సీతారాముడిని అడిగాడు గోపాలరావు. "నాకు తెలుగు వచ్చు తాతయ్యగారు. నా పేరు సీతారాముడు" చెప్పాడు. అమెరికాలో పుట్టిపెరిగిన పిల్లవాడు ఇంత అందంగా తెలుగు మాట్లాడుతోంటే ముచ్చటగా ఉంది గోపాలరావుకి. "ఆరి పిడుగా! ఎంత ముద్దుగా మాట్లాడుతున్నావురా, ఈ తాతయ్యకు ఒక ముద్దు పెట్టు" అని చేతులు చాచాడు గోపాలరావు. విమల కళ్ళతోనే ఏదో సైగ చేసింది సీతారాముడికి. వాడు వెంటనే ఏదో మరచిపోయింది గుర్తుకొచ్చినట్టు వచ్చి గోపాలరావు కాళ్లకు నమస్కారం చేశాడు. తన మనవడు పుట్టినరోజునాడు కూడా అలా తనకు నమస్కారం చెయ్యలేదు. ఇప్పుడు సీతారాముడు చేస్తుంటే కళ్ళలో నీళ్ళు తిరిగాయి గోపాలరావుకు. వాడిని ఎత్తుకుని, బుగ్గలమీద ముద్దుపెట్టుకుని "నా



## త్వరలో అంజలి పెళ్ళి

ఈ మాట చాలాకాలం నుంచి వినిపిస్తున్నా, ఇప్పుడు దాదాపు పెళ్ళి డేట్ తెలిసిపోయింది అంటున్నాయి కోలీవుడ్ వర్గాలు. వచ్చే డిసెంబర్‌లో జై, అంజలిలు పెళ్ళి చేసుకోబోతున్నారట! వీరిద్దరి ప్రేమ వ్యవహారం బయటపడినా ఇద్దరూ ఆ విషయాన్ని దాచాలని అనుకోలేదు. చాలా సందర్భాలలో ఇద్దరం ప్రేమలో ఉన్నామన్న విషయాన్ని చెప్పకుండానే చెప్పారు. దాంతో వీరిద్దరూ ప్రేమలో ఉన్నారనీ, త్వరలోనే పెళ్ళి చేసుకోబోతున్నారనీ చాలా మంది ఊహించారు. ఇప్పుడు ఆ ఊహలు నిజం చేస్తూ డిసెంబర్‌లో పెళ్ళి జరుగుతుందన్న వార్త బయటకు వచ్చింది.

ఆయుష్షు కూడా పోసుకుని చల్లగా వుండు నాయనా" అని మనసారా దీవించాడు. "మా ఇంటికి ఒకరోజు భోజనానికి రండి శేఖర్. సీతారాముడిని కూడా తీసుకురా. ఇక నేను వస్తాను, వస్తానమ్మా" అని చెప్పి వెళ్ళిపోయాడు గోపాలరావు.

"ఎక్కడికి వెళ్ళారురా ఇంత పొద్దున్నే" కొడుకును అడిగాడు జానకిరామయ్య. "భాస్కర్‌ను కలవటానికి వెళ్ళా నాన్నా. వాడు పొలానికి వెళ్ళాడు, అందుకే అక్కడికే వెళ్లాను. అలాగే మా స్కూల్, చెరువు అన్నీ చూపెట్టా వీడికి" చెప్పాడు శేఖర్. "అవును తాతయ్యా. చెరువు ఎంత పెద్దగా ఉందో! నాన్నా, నాన్నా మనం ఇక్కడే ఉండిపోదాం నాన్నా. ప్లీజ్, రోజూ నేను అంకుల్ లాగా చెట్లు పెంచుకుంటాను" అన్నాడు రాముడు. "హహహ... చెట్లు కాదురా భాస్కర్ అంకుల్ పంట పండిస్తున్నాడు. 'నేను కూడా పంట పండించుకుంటా' అనాలి. ముందు బాగా చదువుకో, తరువాత ఏం చెయ్యాలో నిర్ణయించుకో. సరేనా" అని లోపలికి తీసుకెళ్ళాడు శేఖర్.

ఆ మాటతో జానకిరామయ్య గుండెలో రాయిపడ్డట్టయింది. "అందరూ అమెరికాకు పరుగులు తీస్తుంటే వీడు ఇక్కడ మట్టి పిసుక్కుంటానంటున్నాడు. అయినా ఈ పనికిరాని నేలలో ఏం పండుతుంది? శేఖర్ కూడా సమర్థిస్తాడేమిటి? పైగా అమెరికాలో చదువుకుని మళ్ళీ ఇక్కడకు రావటం ఏమిటి? వీడికి తగ్గట్టుగానే ఉంది కోడలు కూడా. హైదరాబాద్‌లో పుట్టి పెరిగిన పిల్ల, ఎలా వుండాలి? సంస్కృతీ సంప్రదాయం, తొక్క తోటకూర అని పెంచారు వాళ్ళ అమ్మానాన్న. వైదేహి కూడా వాళ్ళవైపే! అందరూ నాలాగ తెలివిగా ఎందుకు ఆలోచించరు?" అయోమయంగా ఉంది జానకిరామయ్యకు.

మరుసటిరోజు మనవడి పుట్టినరోజు. వైదేహి మనవడి పుట్టినరోజుకని పిండి వంటలు చేస్తోంది. విమల అత్తగారికి సాయం చేస్తోంది. శేఖర్ మాత్రం కొడుకు పుట్టినరోజున బ్లైండ్ స్కూల్ పిల్లలకు స్వీట్స్ పంచాలి అనుకున్నాడు. ఆ విషయం అమ్మకు చెప్పాడు. "మంచి ఆలోచన. కానీ స్వీట్స్‌వద్దు, భోజనం పెడదాం బాగుంటుంది" అని సలహా ఇచ్చింది వైదేహి. "అవునండి. అత్తయ్య చెప్పినట్టు చేద్దాం, బాగుంటుంది" సమర్థించింది విమల. "ఓకే, నేను వెళ్లి ఆ ఏర్పాట్లు చేస్తా" అని సీతారాముణ్ణి తీసుకుని వెళ్ళాడు శేఖర్.

పుట్టినరోజునాడు ఉదయాన్నే మనవడిని నిద్రలేపి, తలంటుపోసింది వైదేహి. తలస్నానం చేసి కొత్త బట్టలు వేసుకున్నాడు సీతారాముడు. తాతయ్య నాయనమ్మలకు నమస్కారం చేశాడు. తాతయ్య ఇచ్చిన బంగారు గొలుసు వేసుకున్నాడు. అందరితో కలిసి గుడికి వెళ్ళాడు. అటునుంచి బ్లైండ్ స్కూల్‌కి వెళ్ళి అక్కడ పిల్లలకు భోజనం వడ్డించాడు.

అప్పుడప్పుడూ నడవనని కాస్త ఇబ్బందిపెట్టినా విమల బుజ్జగించడంతో ఊరుకున్నాడు సీతారాముడు. ఇంత చిన్నవయసులోనే తన మనవడు ఇన్ని మంచి అలవాట్లు నేర్చుకున్నందుకు వైదేహి చాలా సంతోషించింది. విమలను మెచ్చుకుంది. కానీ జానకిరామయ్య మాత్రం 'ఎందుకో...? వీడు ఇలా ఉన్నాడు. ఆ కోటయ్య మనవడు అయిదేళ్ళకే మొబైల్‌లో గేమ్స్ ఆడుకుంటాడు. కానీ వీడు వీధిలో పిల్లలతో ఆడుకోవాలంటాడు. ఎప్పుడో ఒక్కసారి వీడియోగేమ్స్ ఆడుకుంటాడు. వాళ్ళఅమ్మ ఇక చాలు అంటే మానేస్తాడు. వాడు ఇంగ్లీష్ రైమ్స్ నేర్చుకోవటానికి తంటాలు పడుతుంటే వీడు పెద్దబాలశిక్ష నేర్చుకోవాలంటాడు. అందుకే పరంధామయ్య ఇచ్చిన పెద్ద బాలశిక్షను జాగ్రత్తగా దాచుకున్నాడు. అందరూ అమెరికా నుండి బొమ్మలు తెప్పించుకుంటే వీడుమాత్రం ఎప్పుడో గోదావరిపుష్కరాల్లో తీసుకున్న కొండపల్లి బొమ్మలను అపురూపంగా చూస్తున్నాడు. నిన్నటికి నిన్న లక్ష్మి గారింట్లో ఆవు దూడలను చూడటానికి వెళ్ళాడు. ఆవు దూడలను చూడటంలో ఏం ఆనందం ఉందో? నేను తప్ప ఇంట్లో అందరూ ఇలా బుద్ధిహీనంగా ఉన్నారు. వాళ్ళను ఆ భగవంతుడు కూడా మార్చలేడు. వీళ్ళు నాలాగ తెలివిగా ఎందుకు ఆలోచించలేకపోతున్నారు? ఎందుకో..?' అని మనవడి భవిష్యత్తు గురించి బాధపడుతున్నాడు.

*సెల్: 099808 29275*



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'గౌట్' వ్యాధి నివారణ సులభం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

మానవ శరీరంలోని ఏ కదలికలోనైనా కీళ్ళు అత్యంత ప్రధానమైన పాత్ర పోషిస్తుంటాయి. ఇంతటి ప్రాధాన్యం సంతరించుకున్న కీళ్ళలో ఎటువంటి చిన్న సమస్య ఏర్పడినా అది ఆయా కదలికలను కష్టతరంగా మార్చడమే కాకుండా రోజువారీ దినచర్యల నిర్వహణలో సైతం తీవ్ర ఇబ్బందులను కలుగజేస్తుంది. అలాంటి వాటిలో గౌట్ వ్యాధి కూడా ఒకటి. ఇది ముఖ్యంగా కాలి బొటనవ్రేలు ప్రాంతంలో ఎక్కువగా ఏర్పడుతుంది. దీని వలన ఏర్పడే తీవ్రమైన నొప్పి, సలపరం, మంటతో పాటుగా వాపు తలెత్తటం వలన ఆ కీళ్ళకు సంబంధించిన ఏ కదలికకైనా భరించలేనంత నొప్పితో కూడుకుని ఉంటుంది. ఈ వ్యాధి తరచూ ఏర్పడేదిగా ఉండటమే కాకుండా, దీనికి సరైన చికిత్సను అందించకుండా నిర్లక్ష్యం వహించినట్లయితే ఇది కీళ్ళను పూర్తిగా దెబ్బ తీసే ప్రమాదం ఉంటుంది.




**'గౌట్' లేదా 'గౌటీ ఆర్థరైటిస్' అనగా:-** సాధారణంగా మన రక్తంలో 'యూరిక్ ఆమ్లం' అనే రసాయనం ఉంటుంది. ఇది ఉండవలసిన మోతాదు కంటే ఎక్కువగా ఉన్నప్పుడు, స్ఫటికాల రూపంలో కీళ్ళలోకి వచ్చి చేరుతుంది. ఈ విధంగా యూరిక్ ఆమ్లపు స్ఫటికాలు కీళ్ళలో ఎక్కువగా పేరుకుపోయినప్పుడు కీళ్ళ సంబంధిత కదలికలన్నీ కష్టతరంగా మారుతాయి. దీనినే మనం 'గౌట్' లేదా 'గౌటీ ఆర్థరైటిస్' అని అంటాము.

**కారణాలు:** ఈ వ్యాధి ముఖ్యంగా ప్యూరిన్స్ ఎక్కువగా ఉండే ఆహారం – లివర్, మాంసము, పుట్టగొడుగులు, స్వీట్ బ్రెడ్ మరియు మద్యం వంటివి అధికంగా తీసుకున్నప్పుడు యూరిక్ ఆమ్లం స్థాయిలు పెరగటంతో, అలాంటి పరిస్థితి గౌట్ వ్యాధికి దారితీస్తుంది. • అధిక బరువు, మధుమేహం, అధిక రక్తపోటు మరియు కొలెస్ట్రాల్ అధికంగా ఉండటం వంటివి ఈ వ్యాధి రావడానికి కారణాలు కావచ్చు.

**లక్షణాలు:** తీవ్రతను బట్టి గౌట్ లక్షణాలు చాలా ప్రస్ఫుటంగానే కనిపిస్తాయి. ఈ సమస్య ఎక్కువగా కాలి బొటన వ్రేలులో కనిపిస్తుంది. ఉదయాన్నే నిద్ర లేచినప్పుడు గానీ లేదా అర్ధరాత్రి సమయంలో గానీ బొటన వ్రేలులో విపరీతమైన నొప్పి, సలపరం, మంటగా ఉండటంతో పాటు వాపు కనిపిస్తుంది, మరియు ఆ ప్రాంతమంతా ఎర్రగా కందిపోయి ఉంటుంది. ఇలాంటివన్నీ గౌట్ వ్యాధిలో కనిపించే ప్రధాన లక్షణాలు. • మొదట్లో ఈ వ్యాధి ఒకటి లేదా రెండు కీళ్ళకు మాత్రమే పరిమితమైనప్పటికీ – దీన్ని నిర్లక్ష్యం చేస్తే ఇది దీర్ఘకాలికంగా మారి ఇతర కీళ్ళకు కూడా వ్యాపించి, వాటిని కూడా తీవ్రంగా దెబ్బ తీసేందుకు అవకాశముంటుంది. కాబట్టి తగిన జాగ్రత్తలతో పాటు సరైన చికిత్స తీసుకోవడం ద్వారా ఈ సమస్య నుండి కీళ్ళను కాపాడుకోవచ్చు.

**రోగ నిర్ధారణ పరీక్షలు:** రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉన్నంత మాత్రాన గౌట్ ఉన్నట్లుగా నిర్ధారించరాదు. యూరిక్ ఆమ్లం రక్తంలో అధికంగా ఉండటంతో పాటు, కీళ్ళలో ఆర్థరైటిస్ లక్షణాలు కూడా ఉన్నట్లయితే దానిని తప్పనిసరిగా 'గౌట్'గా నిర్ధారించుకోవాలి. అలాగే మరికొన్ని ఇతరత్రా సందర్భాలలో కూడా రక్తంలో యూరిక్ ఆమ్లపు శాతం ఎక్కువగా ఉండవచ్చు. ఉదాహరణకు సోరియాటిక్ ఆర్థరైటిస్, కిడ్నీ ఫెయిల్యూర్, లుకేమియా వంటి సమస్యలు తలెత్తినప్పుడు కూడా రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉంటుంది. • **రక్తపరీక్ష** (రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉండటం, ఈయస్ఆర్ స్థాయిలు పెరగడం), ఎక్సరే (మృదు కణజాలంలో వాపు కనిపిస్తుంది) • కీళ్ళలోని ద్రవం తీసి పరీక్షించడం మొదలైన పరీక్షల ద్వారా వ్యాధి నిర్ధారణ చేయబడుతుంది. **ఆహార నియమాలు:** గౌట్ వ్యాధి బాధితులు మాంసకృత్తులు తినటం బాగా తగ్గించాలి. ముఖ్యంగా హైప్యూరిన్ డైట్ తీసుకోకూడదు. **మాంసకృత్తులు (ప్రోటీన్లు) 2 రకాలు. అవి (1) ప్యూరిన్స్, (2) పిరమిడైన్స్.** గౌట్ బాధితులు ప్యూరిన్స్ రకం ప్రోటీన్లు ఎక్కువగా తీసుకోరాదు. **మాంసాహారాలు:** మేక, గొర్రె, బీఫ్ వంటివి తినరాదు. **జంతు అవయవాలు:** లివర్, కిడ్నీ, ఎముకల మూలుగు, పేగులు మొ॥వి తినరాదు. **శాకాహారాలు:** పాలకూర, క్యాబేజీ, క్యాలీఫ్లవర్, చిక్కుళ్ళు, వివిధ రకాల బీన్స్, పుట్టగొడుగులు మొ॥వి తగ్గించాలి. ఆల్కహాల్ తదితరాలకు దూరంగా ఉండాలి.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్య విధానంలో గౌట్ వ్యాధి నివారణ నిమిత్తం ఉత్తమ చికిత్స అందుబాటులో ఉంది. ఈ చికిత్సా ప్రక్రియ ద్వారా రోగి యొక్క శారీరక మరియు మానసిక స్థితిగతులను క్షుణ్ణంగా విచారించి, వాటికి అనువైన చికిత్స ఇవ్వడం జరుగుతుంది. అంతేకాకుండా, కీళ్ళలో యూరిక్ ఆమ్లపు స్ఫటికాలు ఏర్పడకుండా చూసి, రక్తప్రసరణలోని వివిధ రసాయనాల సమతుల్యతను కాపాడటం ద్వారా గౌట్ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు.

## పుస్తక సమీక్ష

**స్వర్ణకుటీరం (నవల)**
**పోలంరాజు శారద**
**ధర:** 120 రూపాయలు
**పేజీలు:** 152
**ప్రతులకు :** జ్యోతి వలబోజు
ఫోన్: 80963 10140
మరియు అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు

తరాల అంతరాలు, జీవన పరిస్థితులు, మారుతున్న కాలం...ఇవన్నీ పెద్దలను పిల్లలనుంచి దూరంచేస్తున్నాయి. జీవనయానంలో ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొని బాధ్యతలన్నీ తీరాక తమకంటూ కాస్తంత సమయం కేటాయించుకోవాలనిపిస్తుంది పెద్దలకు. తమదైన జీవితం గడపాలనిపిస్తుంది. అలాంటి పెద్దలనే కథావస్తువుగా మలచి, వారి సమస్యలతోపాటు, వారి మనోభావాలను కళ్ళకు కట్టినట్టు ఆవిష్కరించారు రచయిత్రి పోలంరాజు శారద. చక్కని భాషతో, నవల ఆద్యంతం ఆసక్తికరంగా మలచారు.

**అనుబంధాల టెక్నాలజీ**
**(కథాసంపుటి)**
**డా. లక్ష్మీరాఘవ**
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 200
**ప్రతులకు :** జ్యోతి వలబోజు
ఫోన్: 80963 10140
మరియు అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు

బంధాలు, అనుబంధాలు, ఆత్మీయతలు, మానవత్వం వంటి పదాలు మాటల్లోనే కాని చేతల్లో కానరావటం లేదు. నేటి ఆధునిక సమాజపు పోకడలకు, మారుతున్న మనుషుల మనస్తత్వాలకు దగ్గరగా సామాజిక, కుటుంబ సమస్యలను తనదైన కోణంలో తర్కించి, తనదైన శైలిలో 32 కథలను కూర్చి, కథాసంపుటిగా పాఠకులకు అందించారు రచయిత డా.లక్ష్మీరాఘవ.

**సౌందర్యసంగమం (నవల)**
**సి.యస్.రావు**
**ధర:** 40 రూపాయలు,
**పేజీలు:** 48
**ప్రతులకు :** నవచేతన పబ్లిషింగ్ హౌస్, నవచేతన బుక్‌హౌస్, విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవ తెలంగాణ బుక్‌హౌస్‌లు అన్ని బ్రాంచిలలో.

రాజ్యాలు పోయినా, రాజులు పోయినా వారి ఆనవాళ్ళు కోటల రూపంలో చరిత్రకు సాక్ష్యాలుగా మిగిలిపోయాయి. అలాంటి కోట నేపథ్యంలో సాగే నవల సౌందర్యసంగమం. స్వేచ్ఛకి, బంధానికి మధ్య జరిగే సంఘర్షణే సౌందర్యసంగమం. నవల ఆద్యంతం ఉత్కంఠ కలిగిస్తూ సాగుతుంది. భావుకత, కళాత్మకత మేళవించి రచయిత నవలను తీర్చిదిద్దిన తీరు పాఠకుల్ని కట్టిపడేస్తుంది.

**–లక్ష్మీనర్మద**

## స్వీకారాలు

**ధ్యానం**
**జె.కృష్ణమూర్తి**
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 144
**ప్రతులకు:** తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లోని అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు.

**శ్రీరమణ మహర్షి ప్రవచనములు**
**సంకలనం, సంపాదకుడు: పి. రాజేశ్వరరావు**
**ధర:** 30 రూపాయలు,
**పేజీలు:** 94
**ప్రతులకు:** నవచేతన, నవతెలంగాణ, ప్రజాశక్తి బుక్‌హౌస్‌లు మరియు ప్రముఖ పుస్తక విక్రేతలు

**అంతశ్చేతన** (కవితా సంపుటి)
**ఎస్.కాశింబి**
**ధర:** 100 రూపాయలు,
**పేజీలు:** 88
**ప్రతులకు:** స్ఫూర్తి పబ్లికేషన్స్, 2/1, బ్రాడీపేట, గుంటూరు–02
సెల్: 9246830320.,
శ్రీమతి ఎస్.కాశింబి, 4–20–41/ఎ/1, రోజ్‌విల్లా,–1, ఆరవలైను, సిద్దార్థ్ నగర్, గుంటూరు–06
సెల్: 9052216044

**సంధ్యారాగం** (మినీ నవల)
**పోలంరాజు శారద**
**ధర:** 80 రూపాయలు,
**పేజీలు:** 104
**ప్రతులకు:** జ్యోతివలబోజు,
ఫోన్: 8096310140., మరియు అన్ని ప్రధాన పుస్తక దుకాణాలు

## పిల్లుల జన్మస్థానం పురాతన ఈజిప్టు

పిల్లుల జన్మస్థానం పురాతన ఈజిప్టుదేశంగా శాస్త్రవేత్తలు తెలుసుకున్నారు. డి.ఎన్.ఎ అధ్యయనం ద్వారా ఈ నిర్ధారణకు వచ్చారు. క్రీస్తుపూర్వమే పురాతన ఈజిప్టులో పిల్లులు పెంపుడు జంతువులుగా మానవజాతిని అనుసరించాయి. నాటి సమాధులలో పిల్లుల అవశేషాలు చాలా లభించాయి. ఆనాడు వీటితో వ్యాపారం కూడా జరిగేదట. ఈ పెంపుడు పిల్లులు సముద్రమార్గం ద్వారా ప్రపంచ వ్యాప్తంగా విస్తరించినట్టు మానవశాస్త్రవేత్త Dr EvaMaria Geigl చెప్పారు. పారిస్‌లోని జాక్వెస్ మొనోడ్ ఇనిస్టిట్యూట్‌లో మాలిక్యులర్ ఆంత్రోపాలజిస్టుగా, ఫ్రెంచ్ నేషనల్ సైన్స్ రీసెర్చ్ సెంటర్ (సి.ఎన్.ఆర్.ఎస్)లో రీసెర్చ్ డైరెక్టర్‌గా ఆమె పనిచేస్తున్నారు. మానవజాతి 14,600 సంవత్సరాల క్రితమే కుక్కల్ని మాలిమి చేసుకుంది. కానీ పిల్లుల్ని కొంచెం ఆలస్యంగా చేరదీసింది. క్రీస్తుపూర్వం 7,500 కాలంలో సైప్రస్‌లో మానవ సమాధుల చెంతనే పిల్లుల అవశేషాలు లభించినట్టు పరిశోధకులు చెప్పారు. కొత్తరాతి యుగం రైతులకాలంలో ఆహార అవసరాలకోసం వైల్డ్ క్యాట్స్ మనిషికి మాలిమయ్యాయి.

9000 సంవత్సరాల కాలంనాటి 352 పిల్లుల జన్యు అవశేషాలను Dr EvaMaria Geigl, ఆమె సహచరబృందం అధ్యయనం చేసింది. నాటి ఈజిప్టులోని విభిన్న సామాజిక, సంప్రదాయ సంస్కృతి నేపథ్యమే పిల్లులతో అంతటి స్నేహభావానికి కారణం అంటున్నారు. నౌకల్లో ప్రవేశించే కొన్ని జీవుల నియంత్రణకారిగా, చీడపీడల నియంత్రణకారిగా పిల్లుల్ని తీసుకెళ్ళేవారు. ఆ విధంగా నౌకా రవాణామార్గ దేశాలకు విస్తరించింది. ఈజిప్టులో ఆరువేలఏళ్ళనాటి పిల్లి అవశేషాలు సమాధుల్లో లభించాయి. ఈ పిల్లులు వివిధ దేశాల్లో స్థానిక జంతువులతో మమేకమై భిన్నమైన డి.ఎన్.ఎను సంతరించుకున్నాయి. క్రీస్తుపూర్వం 8000 సంవత్సరాలలోనే అనటోలియా (ఆసియా మైనర్ లేదా టర్కీలోని ఆసియాప్రాంతం)లో విస్తారంగా ఉన్న వైల్డ్ క్యాట్స్ జాతిని పరిశోధకులు కనుగొన్నారు. క్రీస్తుపూర్వం 4,400 నాటికి బల్గేరియా, 3,200 నాటికి రొమేనియా, 1,200 నాటికి గ్రీస్ దేశాలకు, ఐదు, పదమూడు శతాబ్దాల్లో ఈ వైల్డ్‌క్యాట్ వంశం యూరప్‌లోనూ విస్తరించింది. ఇప్పటికీ ఈ వంశానికి చెందిన 78 శాతం జీన్స్ నైరుతి ఆసియా దేశాల్లోని 46 శాతం పిల్లుల్లో ఉన్నట్టు పరిశోధకులు గుర్తించారు. తొమ్మిదివేల ఏళ్ళనాటి ఈజిప్టు cat mummies ను కూడా ఈ బృందం అధ్యయించింది. Nature Ecology and Evolution జర్నల్‌లో ఈ పరిశోధనా ఫలితాలు ప్రచురించారు.

# సోరియాసిస్‌కు శాశ్వత పరిష్కారం

దీర్ఘకాలంగా బాధించే మొండి చర్మవ్యాధుల్లో సోరియాసిస్ ముఖ్యమైనది. ప్రపంచవ్యాప్తంగా 125 మిలియన్ల మంది సోరియాసిస్‌తో బాధపడుతున్నా రని అంచనా. అంటే ప్రపంచ జనాభాలో 3% స్త్రీ పురుషుల్లో తేడాలేకుండా అందరినీబాధించే సోరియా సిస్ వ్యక్తి గతంగా, సామాజికంగా ఇబ్బందులు సృష్టిస్తోంది. సోరియాసిస్ వ్యాధికి హోమియోపతి వైద్యంతో శాశ్వతంగా నయం చేయువచ్చంటున్నారు. ప్రముఖ హోమియో వైద్య నిపుణులు డా॥మురళీ అంకిరెడ్డి.

సోరియాసిస్ బాధితులు శారీరకంగా, మానసికంగా నలిగి పోతున్నారు. ఇది ధీర్ఘకాల చర్మవ్యాధి. చర్మంపైన దురదతో కూడిన వెండిరంగు పొలుసులు కూడా కని పిస్తాయి. ఎరుపుదనాన్ని, వాపు కలిగి ఉండవచ్చు, గోళ్ళు ఎర్రగా కమిలిపోయినట్లు కనిపించినా, సమయం గడిచే కొద్ది ఈ మచ్చలపైన తెల్లని పొలుసులు మందంగా పేరుకుపోతాయి. పొలుసులను తొలగిస్తే అడుగున రక్తపు చారికలు కనిపిస్తాయి. అయితే వాతావరణం చల్లగా ఉండి తేమ తగ్గిపోయినపుడు కాని, ఇన్ఫెక్షన్‌లు తోడైన పుడు గాని తీరుబడిగా ఉన్నపుడు గాని దురద ఎక్కువ వుతుంది. బాధితుల్లో 10-20 % మందికి అనుబంధ లక్షణంగా తీవ్రమైన కీళ్ళనొప్పులు కూడా వస్తాయి.

**ఈ వ్యాధి ఎలావస్తుంది:** మామూలుగా ఆరోగ్యవంతుల్లో చర్మం ఉపరితలంకంది కొత్తకణాలు నిరంతరంతయార వు తుంటాయి. సుమారు నెలరోజులకు ఇవి వెలుపలకు చేరుకుంటాయి. ఇలా పైపొరగా ఏర్పడినవిక్రమంగా నిర్జీవమైఊడిపోయి కిందికణాలనుబహిర్గతపరుస్తాయి. సోరియాసిస్ వ్యాధిలో ఈ ప్రక్రియ అదుపు తప్పుతుంది. చర్మపుకణాలు వేగంగా తయారై 3-4రోజులకే వెలుపల కు చేరుకుంటాయి. అదనపుకణసముదాయానికి పోషక తత్వాలనుఅందించే నిమిత్తంరక్తసరఫరా పెరుగుతుంది. దీంతో చర్మంపైన ఎర్రనిపొర తయారవటమూ, పొలుసులు ఏర్పడటం జరుగుతాయి.

**ఎందుకు వస్తుంది:** వ్యాధినిరోధకశక్తి వికటించి స్వయం ప్రేరితంగా మారటంవల్ల సోరియాసిస్ వస్తుందని ఇటీవలకాలంలో జరుగుతున్న పరిశోధనలు చెబుతు న్నాయి. వైరస్,బ్యాక్టీరియావంటివి దాడిచేసినపుడు వాటి నుంచి రక్షణ పొందటానికి అవి ఏర్పరచిన అపశ్రుతుల ను సరి చేయడానికి మన శరీరంలో తెల్ల రక్తకణాలనే ప్రత్యేకమైన కణాలు పనిచేస్తుంటాయి. ఇవి అవసర మైన ప్రాంతాలకు వెళ్ళి ఇన్ఫెక్షన్‌లను తగ్గించడమే కాకుండా గాయాలను మానేలా చేస్తాయి. దీనినే వ్యాధి నిరోధకశక్తి అంటున్నాం. ఈ నేపథ్యంలో అనుబంధ అంశంగా ఇన్‌ఫ్లమేషన్ (ఎరుపుదనం,వాపు) తయారవు తుంది. సోరియాసిస్‌లో వ్యాధి నిరోధకశక్తి తగ్గుతుంది. ఇది శరీర కణజాలాన్ని అన్యపదార్ధంగా అన్వయించు కొని, దాడిచేసి ఇన్ ఫ్లమేషన్ కలిగిస్తుంది. ఫలితంగా చర్మకణాలు పెరిగి పొలుసులుగా తయారవుతాయి.

**సోరియాసిస్ రకాలు:** సోరియాసిస్ వ్యక్తమయ్యే విధానాన్ని బట్టి వివిధ రకాలుగా వర్గీకరించారు. స్థూలంగా అవి..

1. సోరియాసిస్ వల్గారిస్ 2. గట్టేట్ సోరియాసిస్ (గట్టా అంటే బిందువు) 3. పుస్చులార్ (పస్ అంటే చీము) 4. ఎరిత్రో డెర్మల్ సోరియాసిస్ (ఎర్రిత్రో అంటే ఎరుపు).

**చికిత్స విధానం- హోమియో దృక్పధం:** ఏదైతే వ్యాధికి కారణమవుతుందో అదే చికిత్సకు ఉపయోగపడు తుందనే ప్రకృతి సహజ సిద్ధాంతంపై హోమియోపతి ఆధారపడి ఉంది. దీనినే లాటిన్‌లో సిమిలియా సిమిలిబస్ క్యూరెన్‌టర్ అంటారు. ఇంచు మించు మన 'ఉష్ణం ఉష్ణేన శీతలం' లాంటిదని చెప్ప వచ్చు. ఒకే రకమైన ప్రేరణ లేదా ప్రేరకానికి భిన్నవ్యక్తులు భిన్నరకాలుగా స్పందిస్తారనే అస్మివాదంపైన హోమియోపతి ఆధారపడి ఉంది. దీన్నే మూర్తిత్వవక్తత్వం అంటారు. హోమియోపతికి మాత్రమే సంబందించిన విలక్షణ అంశమిది. సోరియాసిస్ విషయంలో వెంటనే వ్యాధిని గుర్తించి చికిత్స తీసుకోవటం ఉత్తమం.

హోమియోవైద్యవిధానంలో ప్రతిఔషదం మానసిక లక్షణాలతో ముడిపడి ఉంటుంది.మందుల ఎంపిక లో కూడా మానసిక, శారీరకతత్వాన్ని ఆధారంగా చేసుకొని మందులనుసూచిస్తారు. అయితే చికిత్సా ఫలితాల ఉద్ధృతిని బట్టి ఉంటాయి. సోరియాసిస్‌కు సాధారణంగా ఆర్సెనికం ఆల్బం ( శీతకాలం ఎక్కువగును ), సల్ఫర్, కాలి ఆర్స్, సోరినమ్,మెజీరియం, పిట్రోలియం వంటి మందులు వాటి వాటి లక్షణాలకనుగుణంగా వైద్యులు సూచిస్తుం టారు. అయితే ఈ మందులు అనుభవజ్ఞులైన హోమియో వైద్యుల పర్యవేక్షణలో మాత్రమే వాడాలి.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



# సంతానలేమికి ఆధునిక పరిష్కారాలు

**మన దేశంలో ఎంతోమంది దంపతులు సంతానలేమితో బాధపడుతున్నారు. అందుకు పాశ్చాత్య సంస్కృతిలాగా రాత్రి పగలూ తేడా లేకుండా వృత్తిపనుల్లో బిజీగాఉండటం, సరైన వయసులో పెళ్లిళ్లు కాకపోవడం, మానసిక ఒత్తిడికి లోను కావడం వంటివి హార్మోన్ సంబంధమైన సమస్యల్ని సృష్టిస్తున్నాయి. అయితే ఇవిపరిష్కారం లేని సమస్యలేమి కాదని, సరైన చికిత్స తీసుకుంటే లైంగిక సమస్యలు పరిష్కారం కావడమే కాక, సంతానం కలగడానికి కూడా అవకాశం ఉంటుందనిప్రముఖ వైద్యు రాలు డా॥జ్యోతి. ఫర్టీ 9 హాస్పిటల్‌లోని నిపుణులు దీన్నితేలికగాపరిష్కరిస్తున్నారని కూడా ఆమె చెబుతున్నారు.**

చాలామంది స్త్రీలలో నెలసరి సమస్యలున్నా, భర్తకన్నా భార్య వయసు ఎక్కువగాఉన్నా, భార్యాభర్తలిద్దరూ సంతాన నిరోధక పద్ధతులేవీ పాటించకుండా సంవత్సరంకాలం పాటు ప్రయత్నించినాగర్భధారణకాకపోవచ్చు.మరికొంత మందిలోసంవత్సర కాలందాటినా అంటే, ఏళ్ళు గడుస్తున్నా గర్భధారణ కాకపోవచ్చు. **స్త్రీలు మాత్రమే బాధ్యులా?:** సంతానలేమితో బాధపడుతు న్నారంటే స్త్రీలలోనేలోపం ఉండవచ్చనే అపోహ చాలా మందిలో ఉంటుంది. కానీ సంతానలేమికి అసలుకారణం స్త్రీపురుషులిద్దరూ కావచ్చు. దంపతుల్లో ఒకరికి లేదా ఇద్దరికీ లోపం ఉన్నా గర్భధారణ కలుగకపోవచ్చు. పురుషులలో వీర్యకణాల ఉత్పత్తిలో లోపం ఉన్నా సంతానలేమికి దారి తీయవచ్చు. అదే స్త్రీలలో అయితే హార్మోను లోపం, థైరాయిడ్, పి.సి.ఒ.డి... ఇలా కొన్నిరకాల కారణాలుండవచ్చు. సాధారణంగా దంపతు లిద్దరూ ఏ విధమైన గర్భనిరోధక విధానాలూ పాటించ కుండా దాంపత్య జీవితం గడిపితే 5నెలల లోపే 50% మందికి గర్భం వస్తుంది. ఏడాది లోపు 75% మందికి గర్భం వస్తుంది. 2 సంవత్సరాల లోపు 90% మందికి గర్భం వస్తుంది. ఎవరికైనా ఇంతకాలం గడిచినా గర్భం రాలేదంటే ఏదో సమస్య ఉందనే భావించాలి. సమస్యను తెలుసుకోవాలని స్త్రీలుముందుకొచ్చి వైద్యపరీక్షలు చేయిం చుకుంటున్నా, పురుషులు మాత్రం అందుకు సిద్ధంగా ఉండటం చాలాతక్కువ. **ఆకృతి కోల్పోయినా...** మన జీవన శైలితో పాటు కాలుష్యం, వాతావరణం, పొగతాగటం, మద్యం సేవించటం, బిగుతు దుస్తులు ధరించటం, అధిక బరువులు మోయుటం, మానసిక ఒత్తిడి, కొన్ని రకాల మందులు ఆరోగ్యకరమైన వీర్యం ఉత్పత్తిపై ప్రభావం చూపడం వల్ల పురుషులలో శుక్రకణాల సంఖ్య తగినంత లేకపోవడం, ఒకవేళ ఉన్నా వాటిలో చురుకుదనం లేక పోవటం జరుగుతోంది. వాటి ఆకృతి బాగా లేకపోయినా కష్టమే. కొందరిలో శుక్రకణాలు అసలు ఉండవు. స్త్రీలలో నెలసరి సమస్యలు, అండం విడుదల సరిగా లేకపోవటం లేదా విడుదలైన అండాలు నాణ్యంగా లేకపోవటం ప్రధాన కారణాలు. వయసు పెరిగే కొద్దీ గర్భస్రావాలయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. 30 సంవత్సరాలు దాటిన స్త్రీలలో సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. **సరైన పద్ధతులు:** 1. ఐ.యు.ఐ, 2.ఇక్సీ 3.ఐ.వి.ఎఫ్. **ఐ.యు.ఐ:** భర్త నుంచి సేకరించిన వీర్యాన్ని ల్యాబ్‌లో పరీక్షించి దానిలోంచి ఆరోగ్యంగా, చురుగ్గా ఉన్న కణాలను మాత్రం వేరుచేసి సిద్ధం చేస్తారు. వాటిని ఒక సన్నని గొట్టంద్వారా స్త్రీగర్భాశయంలోకి ప్రవేశపెడ తారు. ఇలా ఒక నెలలో చేస్తే 15 % వరకు సంతానం కలిగే అవకాశం ఉంటుంది. ఇలా ఆరు రుతుచక్రాల పాటు ఈ చికిత్సా చేసినా ఫలితం లేకపోతే అప్పుడు ఐ.వి.ఎఫ్ ద్వారా ప్రయత్నించవచ్చు. **ఇక్సీ:** స్త్రీ నుంచి సేకరించిన అండంలోకి పురుషుని శుక్రకణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మాన్యులేటర్ సహాయంతో ప్రవేశపెట్టి ఫలదీకరణం చెందిస్తారు. వాటిని తిరిగి గర్భాశయం లోకి ప్రవేశ పెడతారు. ఈ పద్ధతి ద్వారా 40% వరకు విజయం సాధించవచ్చు. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్నవారిలో ఇదిమరింత ఉపయోగకరం. **ఐ.వి.ఎఫ్:** దీన్నే టెస్ట్‌ట్యూబ్ బేబి విధానం అంటారు. ముందు స్త్రీ నుంచి పక్వమైన అండాలను బ య ట కు తీ సి వా ర్ ని ష ం డ శుక్రకణాలతోబయటేఫలదీకరణంచెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలిదశ పిండాల్లో రెండులేదా మూడింటి ని తిరిగి స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెడతారు. దీని ద్వారా 30-35 శాతం ఫలితం పొందవచ్చు. ఇటీవల కాలంలో సంతాన సాఫల్యత చికిత్సలో మరెన్నో కొత్త విధానాలు అందుబాటులోకి వచ్చాయి. ఫలదీకరించిన పిండాలలో గర్భాశయంలోకి ప్రవేశపెట్టగా మిగిలిన పిండాలను అతిశీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత వాటినే వాడటం జరుగుతుంది. అవసరాన్ని బట్టి అండాలను గానీ, శుక్ర కణాలను గానీ దాతల నుంచి స్వీకరించి వాడటం జరుగుతుంది. వీటితోపాటు పిండాన్ని మరో స్త్రీగర్భాశయం లో పెంచే ఒక వినూత్నమైన 'సరోగసి' విధానం కూడా అందుబాటులోకి వచ్చింది. అందుకే సంతానం కలగటం లేదని ఏళ్ళ తరబడి బాధపడే కన్నా ఎన్నో ఆధునిక పద్ధతులున్న '**ఫర్టీ 9 హాస్పిటల్**' ని ఆశ్రయించటం ఎంతో శ్రేయస్కరం.

**- డా॥ సి. జ్యోతి ఫెర్టిలిటీ స్పెషలిస్ట్**
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**




**"నిధి.... వీరదశమి నాడు గెలిచి, ఓడిన యోధాగ్రేసరుడు!"**

**మహారాజూ, మహామంత్రీ, రాజగురువూ, సర్వసైన్యాధ్యక్షుడూ మందిరం మధ్యలో పిడుగు పడ్డట్టు అదిరిపడి నిర్ఘాంతపోతూ చూశారు. అందరినోళ్ళూ తెరుచుకున్నాయి. అందరి కళ్ళూ గిన్నెల్లా విచ్చుకున్నాయి. రాజగురువు మేధావి ముందుగా నివ్వెరపాటు నుండి తేరుకున్నాడు. అతని తల నెమ్మదిగా మహారాజు వైపు తిరిగింది.**

"మహారాజా..."

మహారాజు నందికేశ్వరుడు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఈ సమావేశానికి మన రాజవైద్యుడిని పిలిచి ఉంటే బాగుండేది!"

"రాజవైద్యుడా గురుదేవా? దేనికి?"

"ఆ! మన ఆస్థాన జ్యోతిష్కుడి మానసిక స్థితి పరీక్షించి ఔషధ ప్రయోగం చేసి ఉండేవాడు!"

నందికేశ్వరుడు కళ్ళు చిట్లించాడు. సత్యసంధుడూ, వీరకేసరీ ఫక్కున నవ్వారు.

"జాతకరీత్యా నిధి సంగ్రహయోగమూ, గ్రహాల వీక్షణల రీత్యా ధైర్యసాహసాలూ, బుద్ధి కుశలతా, సమయస్ఫూర్తీ కలిగినవాడైన యోధుడిగా నా జ్యోతిష జ్ఞాననేత్రంతో దర్శించి, ఆ యువకుడిని ఎంపిక చేశాను. ముఖ్యంగా సర్పభయం అనేది అంటని జాతకం అతనిది".

"జ్యోతిష జ్ఞానంతో బాటు కొంచెం లౌక్యం కూడా ఉండాలి ముక్కంటీ!" మేధావి ఆక్షేపణగా అన్నాడు.

"నా పితృపితామహులు నేర్పించిన విద్యకూ, ప్రభువులు నాకు ప్రసాదించిన ఉద్యోగానికీ లౌక్యం అవసరం లేదు, ఆర్యా!" ముక్కంటి గంభీరంగా అన్నాడు "ప్రభువులు అనుమతిస్తే ఒక విషయం మనవి చేస్తాను..."

"చెప్పండి"

"వీరదశమినాడు పెద్దలు అతని గెలుపును గేలి చేశారు. పరాజయాన్ని పల్లకిలో మోశారు. ఇది నింద కాదు; నిజం. మన యువకుడు కేసరికి ఏం జరుగుతుందో ప్రత్యక్షంగానూ, నిధికి ఏం జరుగుతుందో పరోక్షంగానూ వెల్లడించాను. నిర్ణయించే అధికారం, విమర్శించే అవకాశం నాకు లేవు; అవసరం లేదు కూడా! కేసరి విషయంలో రాజకీయమైన స్వార్థం ఉంది, కొందరు పెద్దలలో. నిధి సంపాదనకు నిధి అనే యువకుడిని ఎన్నిక చేయడంలో నా స్వార్థం లేదు!"

"అంగీకరిస్తున్నాం..." నందికేశ్వరుడు తల పంకిస్తూ అన్నాడు.

"ప్రభువులకు ఒక మనవి: పర్వతగర్భంలో నవ నిధులు ఉన్నాయని నిధిసన్నిధి గ్రంథం వెల్లడిస్తోంది. నవనిధులు ఉన్నాయని నా గణన వెల్లడిస్తోంది. విషసర్పాల విశిష్ట సంరక్షణలో మూలుగుతున్న నవ నిధుల్ని కోశాగారానికి చేర్చే శక్తియుక్తులు నిధి అనే యోధుడికి ఉన్నాయని కూడా నా గణన చెప్తోంది. కర్తవ్యం గురించి ఆలోచించడం, ఆచరణ గురించి నిర్ణయం తీసుకోవడం ప్రభువుల ధర్మం!" ముక్కంటి, ముగించి తన ఆసనం వైపు నడిచాడు.

మందిరంలో నిశ్శబ్దం అలుముకుంది. నందికేశ్వరుడు 'ఏం చేద్దాం?' అన్నట్టు రాజగురువు వైపు చూశాడు. నవనిధుల ప్రస్తావన ఆయనలో ఏవో ఆశలను రేకెత్తిస్తోంది. సుభిక్షరాజ్యం 'ఏ పూటకు ఆ పూట' అన్న రీతిలో సాగుతోంది. జ్యోతిషం నిజమై, నిధి కోశాగారానికి తరలివస్తే తరతరాలూ పరిపాలన ఘనంగా ప్రజారంజకంగా సాగుతుంది.

"గురుదేవా, ఇది మీరు మార్గదర్శనం చేయాల్సిన సమయం!" నందికేశ్వరుడు అన్నాడు.

"ముక్కంటి ముమ్మాటికీ అక్కడ నవనిధులు ఉన్నాయంటున్నాడు. ఇంతవరకూ, ఆస్థానానికి సంబంధించినంత వరకూ అతని జ్యోతిషం తప్పుకాలేదు.." మేధావి లౌక్యంగా అన్నాడు.

"ఔను. అన్నీ ఆయన సూచించినట్టే అక్షరాలా జరిగాయి. మన 'ముక్కంటిగారికి మూడవ కన్నుంది' అని కూడా మనం అప్పుడప్పుడూ అనుకున్నాం!" మహామంత్రి అన్నాడు.

"మేం మరొక అంశం కూడా పరిగణనలోకి తీసుకున్నాం. భూమిలో మట్టిపాత్రలలో పూడ్చి పెట్టిన నాణేలు దొరకడం లోకంలో ఉంది. అలాగే పాతరలలో నిక్షేపించిన సంపద దొరికిన సందర్భాలూ ఉన్నాయి. పౌండ్రక పర్వతగర్భంలో నవనిధులున్నాయన్న ముక్కంటి గారి అభిప్రాయాన్నీ, నమ్మకాన్నీ కాదనలేం. ఆయన నమ్మకానికి ఆధారం ఆ ప్రాచీన గ్రంథం" నందికేశ్వరుడు అన్నాడు.

"తోసి పుచ్చాల్సిన అంశం కాదు మహారాజా" రాజగురువు మేధావి అన్నాడు. "నా సూచన అడిగారు. మన రాజ్యంలో మారుమూల ప్రాంతాలలోని శిథిలాలయాలలో విగ్రహాలున్న



చోట భూగర్భంలో నిధులున్నాయని తవ్విన సందర్భాలూ, నిధులు దొరికిన సందర్భాలూ ఉన్నాయి. పర్వతగర్భంలో నవనిధులు ఉన్నాయని మన దృష్టికి వచ్చింది. ఉన్నాయో, లేవో తేల్చుకోవడం తప్పుకాదు. ఆ నిధుల మీద మనకు అధికారమూ ఉంది. అవసరమూ ఉంది. ప్రయత్నించడం మంచిది! 'నిధి' అనే యువకుడి ప్రస్తావనతో మాత్రమే నేను మన ముక్కంటిని విమర్శించాను..."

"ఔను! ఎవరు ప్రయత్నించాలో మన ఆస్థాన కార్తాంతికులు చెబుతున్నారు. అది ఇబ్బందికరమైన అంశం" సత్యసంధుడు అన్నాడు.

"నాకొక ఆలోచన కలుగుతోంది..." వీరకేసరి అన్నాడు.

"ఆలోచనల కలబోతకే ఈ సమావేశం. చెప్పు వీరకేసరీ" నందికేశ్వరుడు అన్నాడు.

"మనవాడు కేసరి తృటిలో మహావీరహారం చేజార్చుకున్నాడు గానీ, మహాయోధుడే. ఇది అందరికీ తెలిసిన సత్యమే! కేసరిని నవనిధుల పనిమీద పంపితే? మహారాజుకు కాబోయే అల్లుడు, కాబోయే మహారాజు సుభిక్షరాజ్య ప్రజలకోసం అద్భుత సాహసం చేసి, ప్రాణాలకు తెగించి, నవనిధులను సాధించుకు వస్తే అది తనకొక కీర్తికిరీటం అవుతుంది. నవనిధులతో బాటు ప్రజల అభిమాన నిధి కూడా ఇబ్బడి ముబ్బడిగా లభిస్తుంది!" వీరకేసరి అన్నాడు.

"వ్యవసాయం ఎవరుచేసినా మాకు అభ్యంతరం లేదు. మాకు కావాల్సింది ఫలసాయం!" నందికేశ్వరుడు చిరునవ్వుతో అన్నాడు. "మహారాణి గారి మేనల్లుడు నవనిధుల్ని మూటకట్టి తెస్తే అది మాకూ గర్వకారణమే!"

"ఆ అంశం గురించి మరొక్కసారి పరిశీలించమని మన ముక్కంటి గారిని అడుగుదాం... ప్రభువులు అనుమతిస్తే..." మహామంత్రి అన్నాడు. "ఎందుకంటే ఆ యువకుడు నిధి గాయపడిన మనసు.."

"అందుకు అభ్యంతరమేముందీ?" నందికేశ్వరుడు అన్నాడు.

"ఆర్యా, ముక్కంటీ..." మహామంత్రి సాభిప్రాయంగా అన్నాడు.

"కేసరి... కేసరి..." జ్యోతిష్కుడు ముక్కంటి అరచేత్తో నుదురు రుద్దుకుంటూ ఆలోచిస్తున్నాడు.

"కేసరి ధైర్యసాహసాలున్నవాడు. ప్రాణాలకు తెగించి ప్రయత్నించే తత్వం ఉన్నవాడు. పట్టుదల, పరాక్రమం – యోధాగ్రేసరుడికి ఉండాల్సిన లక్షణాలన్నీ ఉన్నవాడు. అవసరమైతే పూజలూ, హోమాలూ, శాంతులూ చేద్దాం.." వీరకేసరి అన్నాడు.

"సరే...పెద్దల తృప్తికోసం ఇప్పుడే, ఇక్కడే పునః పరిశీలన చేస్తాను" ముక్కంటి ఒక తాళపత్రాన్ని 'కవిలె' లోంచి తీస్తూ అన్నాడు.

తాళపత్రాన్ని పరిశీలిస్తూ వేళ్ళతో లెక్కించుకు పోతున్న ముక్కంటిని అందరూ ఉత్కంఠతో చూస్తున్నారు. గణన ముగించి ముక్కంటి అందర్నీ కలయజూశాడు.

"నవనిధుల సంపాదనకు ధైర్యసాహసాలూ, తెగింపూ, పట్టుదలా ఇవన్నీ అవసరమే. ఈ లక్షణాలన్నీ మన వీరకేసరి పుత్రుడిలో అపారంగా ఉన్నాయి. అన్నీ ఉన్న వ్యక్తికి మొన్న అపజయం ఎదురైంది. ఎందుకు? – అందుకు కారణం గ్రహస్థితి! అలా ఉంచితే, మన కేసరి గ్రహస్థితి సానుకూలంగా లేదు. ముఖ్యంగా ఐశ్వర్య కారకుడైన గ్రహదేవత వీక్షణ వక్రంగా ఉంది. మానవ ప్రయత్నానికి గ్రహవీక్షణ 'శుభంగా' తోడు కావాలి. మనం చర్చిస్తున్న అంశం అద్భుతమైంది. అంతేకాకుండా అపాయకరమైంది. బుద్ధిబలం, భుజబలం చాలవు. దైవబలం తోడు కావాలి. గ్రహబలం తోడు కావాలి. నా గణనను అనుసరించి, యువకుడు కేసరిని నవనిధుల కార్యం మీద పంపకపోవడం మంచిది. ఎందుకంటే... ఎందుకంటే.."

"సందేహించకండి ఆచార్యా, చెప్పండి!" నందికేశ్వరుడు ఆజ్ఞాపించాడు.

"గ్రహస్థితినీ, లక్ష్యాన్నీ, కాలాన్నీ, స్థలాన్నీ ఆధారంగా చేసుకుని చెప్తున్నాను. కేసరి నవనిధుల సంపాదనకు వెళ్తాడు. కానీ... తిరిగిరాడు!"

అందరూ ముఖాలు చూసుకున్నారు. నందికేశ్వరుడు ఆసనంమీద వెనక్కివాలి, గొంతు సవరించుకున్నాడు. "కేసరి తల్లిదండ్రులకు ఏకైక పుత్రుడు. మాకు ఏకైక వారసుడు. మా పుత్రికను చేపట్టడానికి పుట్టినవాడు. ఆచార్య ముక్కంటి భవిష్యవాణిని గౌరవించాల్సిందే! కేసరి వెళ్ళడు. ఆ యువకుడు నిధే వెళ్ళాలి.."

"సమయోచితమైన నిర్ణయం ప్రభూ!" ముక్కంటి అన్నాడు.

"ఆచార్యా... మా తృప్తికోసం అడుగుతున్నాం. మరో ప్రత్యామ్నాయం లేదా? అంటే మరొక వీరుడు..."

"ప్రభువులు మన్నించాలి.." ముక్కంటి అన్నాడు. "ఐశ్వర్యం ఎప్పుడు ఎవర్ని వరిస్తుందో అంటారు. అది అందరికీ అందదు. జాతకరీత్యా, గ్రహవీక్షణ

### జరిగిన కథ

సుభిక్ష రాజ్యంలో వీరదశమి సందర్భంగా జరిగిన తుది స్పర్థలో నిధిని విజయం వరిస్తుంది. కానీ స్పర్థ విజేతను ప్రకటించకుండా, నిధి క్షత్రియుడు కాకపోవడం వల్ల పోటీని విరమిస్తున్నట్టు ప్రకటిస్తారు. చక్రవర్తి విజయానందులు బాకీపడ్డ కప్పం వడ్డీతో సహా చెల్లించాలంటూ, లేనిపక్షంలో వియ్యమందాలని రహస్యలేఖ పంపిస్తాడు. ఆ ఆపద నుంచి తప్పించుకునేందుకు జ్యోతిష్కుడు ముక్కంటి నవనిధుల గురించి చెప్పి అందుకు సమర్థుడు నిధి అని చెబుతాడు. **ఆ తర్వాత...**

ఆధారంగా నేను, అంటే, నా గణన ఎన్నికచేసిన యువకుడిలో రెండు లక్షణాలు కళ్ళను పొడుస్తున్నట్టు కనిపిస్తున్నాయి. ఒకటి: నవనిధులను సంపాదించడం. సంపాదించిన ఆ నిధులను స్వార్థానికి ఉపయోగించుకోకపోవడం! అతని జాతకంలో ఆ నిస్వార్థ గుణం ఉంది..”

“ఓహో....” నందికేశ్వరుడు అన్నాడు. “అది అత్యవసరమైన సద్గుణం!”

“ఔను ప్రభూ! నిధి వ్యవసాయం చేస్తాడు; ఫలసాయం అనుభవించడు. వండుతాడు, వడ్డిస్తాడు; తను తినడు! నొక్కి వక్కాణిస్తున్నాను. నిధి వల్ల నవనిధులు సుభిక్షరాజ్య ప్రభువు శ్రీశ్రీ నందికేశ్వరుల వారికి అందుతాయి!”

“మంచిది. ఆ యువకుడిని అవమానించాం, నొప్పించాం... తప్పు ఒప్పుకుని, అతన్ని మహా సాహస కార్యానికి ఒప్పించుదాం” నందికేశ్వరుడు అన్నాడు. “వసుదేవుడంతటి వాడు గాడిద కాళ్ళు పట్టుకున్నాడంటారు! మీ అభిప్రాయం ఏమిటి గురుదేవా?”

“వసుదేవుడు... గాడిద...” సందర్భోచితమైన ఐతిహ్యం! ప్రస్తుతం మన కర్తవ్యం అదే మహారాజా. అవమానానికి విరుగుడు మందు ఆదరణే!” మేధావి అన్నాడు.

“మహామంత్రీ, ఆ యువకుడు నిధీ, అతని తండ్రీ మా సముఖానికి రావాలి!” నందికేశ్వరుడు పైకి లేస్తూ అన్నాడు. అందరూ లేచారు.

“చిత్తం! అతని తండ్రి కర్దముడు నాకు తెలిసిన వాడే!” వీరకేసరి అన్నాడు.

“ఇప్పుడు జరిగిందీ, రేపు జరగబోయేదీ అతి రహస్యం! ధర్మపత్నులకు కూడా చెప్పకూడదు! ఈ మాట రాజశాసనంగా భావించండి” నందికేశ్వరుడు గంభీరంగా అన్నాడు.

***

నిధి చిన్న కొండమీద ఉన్న వాలీశ్వరస్వామి ఆలయం ముందు నిలబడ్డాడు. ఆలయం తలుపులు తెరచి ఉన్నాయి. అర్చకుడు అభిషేకమూ, అర్చనా ముగించినట్టున్నాడు. ఉదయమూ, సాయంత్రమూ వాలీశ్వరుడికి పూజలు జరుగుతాయి. రామాయణ కాలంలో వాలి అక్కడ శివలింగాన్ని ప్రతిష్ఠించాడని చెప్పుకుంటారు. వాలి ప్రతిష్ఠించిన శివలింగ రక్షణ కోసం, సుభిక్ష రాజ్య రాజులు ఆలయాన్ని నిర్మించారని ప్రతీతి.

నిధి ధ్వజస్తంభం ముందు నిలుచుని వెనుదిరిగి చూశాడు. పర్వతం క్రింద కోటీరనగరం కళ్ళకు కట్టినట్టు కనిపిస్తోంది. మేడలూ, మిద్దెలూ, పూరిపాకలూ, గృహాల మధ్య తిన్నగా గీసిన గీతల్లా వీధులు. ప్రతీ వీధిలో ఒక ఆలయ గోపురం. అన్ని వీధులకు మధ్య, అన్ని వీధుల కన్నా వెడల్పుగా రాజవీధి. వీధి ప్రారంభంలో ఎత్తుగా, ఆకాశాన్ని అందుకోబోతున్నట్టు రాజభవనం, చుట్టూ కోట.

**వాలీశ్వరుడి ఆలయ సమీపంలో ఉన్న బిల్వవృక్షం దగ్గరకు వచ్చాడు నిధి. ఏదో వాసన లీలగా అతని నాసికా పుటాలకు సోకింది. అది సువాసన కాదు. ఏదో దుర్గంధం లీలగా అక్కడ వ్యాపిస్తోంది. అంతలో ‘నిధీ’ అని పిలుస్తూ పురుషకంఠం వినిపించింది. చుట్టూ చూశాడు. ఎవరూ కనిపించలేదు. అతణ్ణి పిలిచిందెవరు? ఏదైనా అదృశ్యశక్తా?**

కోటలో రాజభవనం. రాజభవనంలో మహారాజు. జీవితంలో మొదటిసారి తను రాజభవనంలోకి వెళ్ళాడు. మహారాజు, మహామంత్రి, రాజగురువు, సైన్యాధ్యక్షుడు ఉన్నారు ఒక కక్ష్యలో. మహారాజు రమ్మన్నారనగానే తనూ, నాన్న ఆశ్చర్యపోయారు. నాన్నకు ఆశ్చర్యంతో పాటు ఆందోళన. రాజాజ్ఞను ధిక్కరించాలనీ, వెళ్ళకూడదనీ అనిపించింది తనకు. కానీ, తమలాంటి సామాన్య పౌరులు ఆ సాహసం చేయలేరన్నారు నాన్న. వీరదశమినాడు ముత్యాలను విసరికొట్టినందుకు రాజుగారు ఆగ్రహించారేమో అన్న అనుమానం కలిగింది నాన్నకు. మహారాజుగారి సమ్ముఖానికి వెళ్ళాక ఆ అనుమానం నిజం కాదని తేలిపోయింది.

రాజమందిరంలో జరిగిన సంఘటనకు సంబంధించిన జ్ఞాపకాలు నిధిని చుట్టుముట్టుతున్నాయి. ధ్వజస్తంభం వద్ద నిలువనీయకుండా చేస్తున్నాయి. నిధి తలవిదిలిస్తూ అక్కణ్ణుంచి కదిలాడు. అతని ప్రయత్నం లేకుండానే కాళ్ళు అతన్ని ఆలయం చుట్టూ ప్రదక్షిణంగా తీసుకెళ్తున్నాయి.

పౌండ్రక పర్వతగర్భంలో నిధి... ఒకటి కాదు తొమ్మిది... అవి నవనిధులు.

రాజ్యం ఋణగ్రస్థమై పోయింది.

చక్రవర్తి హెచ్చరించిన యుద్ధాన్నీ, మారణహోమాన్నీ, ఓటమినీ, ఇతర అవాంతరాలనూ నివారించాలంటే ధనం కావాలి, అత్యవసరంగా!

నవనిధుల్ని సాధించి తేగలిగిన శక్తిసామర్థ్యాలు ఉన్న వీరుడు మన రాజ్యంలో నువ్వొక్కడివే. వీరదశమి స్పర్థలో నీకు అన్యాయం జరిగింది. నవనిధుల సంపాదనకు ఏకైక వీరాగ్రేసరుడిగా నిన్ను ఎన్నిక చేయడంతో – ఆ అన్యాయం, అన్యాయం మూలంగా వాటిల్లిన అవమానం చెరిగిపోయాయి. నందీశ్వర మహారాజు మాటలు!

రాజగురువు మేధావిగారి ప్రశంసలు. నేరం మనిషిది కాదు; మనిషి పుట్టిన కులానిది. వీరదశమి నాటి నీ విజయాన్ని ఎవ్వరూ కాదనలేరు నాయనా. నువ్వు కత్తి పట్టుకున్నప్పుడే నీ శక్తిని మేం తూకం




ఆమె
ఆఫీసు నుండి తిరిగొస్తుంటే
అవనతం చేసిన జెండాలా....!

## అవును.... మా ఆమెనే!

ఆమె
గడపలో అడుగేస్తుంటే
దిగులు మబ్బులు పులుముకున్న ఆకాశంలా.....!

ఆమె నోట్లో ముద్ద దిగకముందే
నిద్రావహిస్తుంటే డ్యూటీ దిగిన సెంట్రీలా...!

ఆమె
నిద్రపోతుంటే కదిలిస్తావా?
మా ఇంట్లో మర్నాడు సూర్యుడు లేటుగా నిద్రలేస్తాడు!

ఆమె
యుద్ధం ఒకనాటితో ముగిసేదా?
వింజామరంపట్టి సేద తీర్చాల్సిందే!

ఆమె
చేసే సేవలకు విలువకడతానా?
నా జీవితమే అప్పుపడతది!



ఆమె
ఏక కాలంలో నెత్తిన వేలాడే నీలితెర
నా సమస్త భారాన్ని మోసే ధూళిపొర!!

–కోట్ల వెంకటేశ్వరరెడ్డి
సెల్: 94402 33621

వేశాం! ఇలాంటి స్థితి మహావీరుడైన ఆ కర్ణుడికే తప్పలేదు. మనమెంత...? రాజగురువు అతిశయోక్తులు!

నవనిధుల సంపాదన అనే కర్తవ్యం మహారాజుగారు నీకు ప్రసాదిస్తున్న మహదవకాశం నాయనా! అవకాశాన్ని సద్వినియోగం చేసుకో. మహామంత్రిగారి సూచనలో దాగిన హెచ్చరిక.

నవనిధుల కార్యక్రమానికి ధైర్యసాహసాలు కలిగిన వీరుడు అవసరం. మన రాజ్యంలోని వీరులలో అందుకు తగినవాడివి నువ్వే అని నేను ప్రభువులకు మనవి చేశాను. నీ జాతక బలం అందుకు అనుకూలంగా ఉంది. నీ పేరు కూడా! అందులో నిధి ఉంది! ఆస్థాన జ్యోతిష్కుడి ధైర్యవచనం.

అన్నీకూడా ఏదో ప్రమాదకరమైన సాహస కార్యంలోకి తనను దించడానికి చేసిన ప్రయత్నాలే అనిపించాయి. తన తండ్రి మహారాజుగారిని అడిగిన ప్రశ్న ఒక్కటే తనకు అర్థవంతమైన అంశంగా అనిపించింది. ప్రభువులకు ఒక విషయం మనవి చేసుకోవచ్చునా అన్నాడు తన తండ్రి. మహారాజు అనుమతించారు. నవనిధులను అన్వేషించి, తీసుకు రమ్మంటున్నారు. ఇది రాజశాసనమా? అన్నాడు తండ్రి.

అందరూ ముఖాలు చూసుకుని, మహారాజు వైపు ప్రశ్నార్థకంగా, ఇబ్బందిగా చూశారు. నందికేశ్వర మహారాజు వేళ్ళతో తన గుబురు కనుబొమల్ని క్షణంపాటు రుద్దుకుంటూ ఉండి పోయాడు. రెప్పలెత్తి, తన తండ్రి ముఖంలోకి తదేకంగా చూశాడు.

కర్దమా, నువ్వు వయసులో మా కన్నా పెద్దవాడివి. వీరకుమారుడిని కన్నవాడివి. నీ ముందు రాజసం ప్రదర్శించటం మాకు ఇష్టంలేదు. ఇది రాజశాసనం కాదు, రాజాజ్ఞ కాదు. మా కోరిక. నీ కుమారుడికి శ్రమకు మించిన, అద్భుతమైన పారితోషికం ఇవ్వబడుతుంది! మహారాజు వాగ్దానం.

ఇది నీ కుమారుడికి మా అందరి అభ్యర్థన అనుకో కర్దమా! అన్నాడు, మహారాజు మాటతో ధైర్యం తెచ్చుకున్న రాజగురువు...

నిధి ఆలయ ప్రదక్షిణపథంలో అసంకల్పితంగా తిరుగుతూనే ఉన్నాడు. అతని మనోఫలకం మీద నుండి రాజమందిర దృశ్యం మాయమైపోయింది. తన ఇంట్లో జరిగిన సంభాషణ అతని చెవుల్లో ప్రతిధ్వనించసాగింది.

నువ్వు ఆ దుస్సాహసం చేయడం నాకు ఇష్టం లేదు నిధీ! అన్నాడు నాన్న. మాకు పారితోషికం ముఖ్యం కాదు; నీ ప్రాణం, నీ క్షేమం ముఖ్యం! అన్నాడు.

అవును నాయనా, అది ఆజ్ఞ కాదనీ, అభ్యర్థన అనీ అన్నారుగా రాజుగారు. నిధులూ ఉండవు, నిక్షేపాలూ ఉండవు. ఉంటే సైన్యంతో వెళ్ళి కొండను పిండిచేసి తెచ్చుకోవచ్చుగా! నేను నిన్ను వెళ్ళనివ్వను. ఒక్కగానొక్క కొడుకును ఏ నిధికోసమో నరబలి ఇవ్వను! అంది తల్లి.

ఓడిపోయి కూడా చేతిమీద వాత పెట్టించుకోకుండా, గర్వంగా ఎగతాళిగా నవ్వుతూ వెళ్ళాడుగా, సిగ్గులేని మొనగాడు కేసరి! మేనల్లుడూ, కాబోయే మహారాజూ తనేగా! వెళ్ళి తెచ్చుకొమ్మనరా అన్నాయ్! అంది చెల్లెలు నవనీత.

నిధి అరచేత్తో నుదురు రుద్దుకున్నాడు. తల్లిదండ్రులూ, చెల్లీ చెప్పింది నిజమే! మహారాజుగారి స్వార్థం రాజోద్యోగుల మాటలలో ప్రతిధ్వనించింది. ఆజ్ఞ కాదన్నా, అభ్యర్థన అన్నా... తాను నిధుల వేటకు వెళ్ళనంటే మహారాజుగారి అహం దెబ్బతింటుంది. అభ్యర్థన ఆగ్రహంగా మారుతుంది. పగ పడగ విప్పుతుంది! సందేహం లేదు.

ఎప్పుడో చదివిన వాల్మీకి రామాయణంలోని సూక్తి ఒకటి గుర్తొస్తోంది నిధికి. 'రాజ్ఞో విప్రతికూలస్థోన జాతు సుఖమేధతే' – రాజుకు ప్రతికూలంగా ఉండే వ్యక్తి సుఖంగా ఉండలేడు. అయినా సరే... మహారాజు మాటలకన్నా ఆయనకు వంత పాడిన రాజోద్యోగుల మాటలు కన్నా, కన్నవారి మాటలు తనకు విలువైనవి. మాతృవాక్య పరిపాలన, పితృవాక్య పరిపాలన తన కర్తవ్యం. మహారాజు అభ్యర్థన ఆగ్రహంగా మారినప్పుడు ప్రతిచర్య ఆలోచించవచ్చు. యుద్ధ స్పర్థలో పనికిరాని తన కులం నిధి సాధనకు చక్కగా పనికొస్తోంది!

నిధి తేలికగా నిట్టూర్చి, నడకలో వేగం పెంచాడు. నిర్ణయం అతనిలో అంతసేపూ సాగిన సంకుల సమరాన్ని అంతం చేసింది. నిధి ధ్వజస్తంభం వైపు వెళ్ళబోతూ ఆగి, ప్రాకారం దగ్గరగా ఉన్న బిల్వ వృక్షం వైపు నడిచాడు. శివలింగాన్ని ప్రతిష్ఠించిన సుగ్రీవ సహోదరుడు వాలి, ఆలయ సమీపంలో నాటినదిగా ప్రసిద్ధికెక్కిన బిల్వవృక్షమది. వాలీశ్వరుడి ఆలయ ప్రాంగణంలో తన సమస్యకు పరిష్కారం లభించింది. ఒక బిల్వదళాన్ని అర్పించి, శివుడికి ధన్యవాదాలు చెప్పుకోవాలి!

బిల్వవృక్షాన్ని సమీపించిన నిధి తటాలున ఆగాడు. ఏదో వాసన లీలగా అతని నాసికా పుటాలకు సోకింది. అది సువాసన కాదు. నిధి అప్రయత్నంగా అరచేతి వెనక భాగంతో ముక్కును కప్పుకున్నాడు. ఏదో దుర్గంధం లీలగా అక్కడ వ్యాపిస్తోంది. నిధి బిల్వవృక్షం చుట్టూ పరిశీలనగా చూశాడు. దుర్వాసనను వెదజల్లేది ఏదీ కనిపించడం లేదు.

"నిధీ..."

తగ్గుస్వరంలో ఎవరో తనను పిలిచారు. ఎవరు? బిల్వవృక్షం బోదె వద్దనుండీ వినవచ్చింది ఆ పిలుపు. అయితే అక్కడ ఎవరూ లేరు. నిధి తనను పిలిచిన వ్యక్తికోసం తన చుట్టూ చూశాడు. ఎవ్వరూ లేరు! ఎవరో పిలిచినట్టు తను భ్రమపడ్డాడు. నిధి బిల్వవృక్షం కొమ్మను అందుకోడానికి చేతిని పైకెత్తాడు. ఆ కొమ్మకి ఉన్న రెమ్మలు అందకుండా దూరంగా జరిగినట్టు అనిపించింది. ఏదో దుర్గంధాన్ని మోసుకొస్తున్న గాలి కొమ్మల్నీ, రెమ్మల్నీ కదిలించినట్టుంది. నిధి అందుబాటులో ఉన్న మరో కొమ్మ వైపు జరిగాడు.

"నిధీ... నిన్నే" పురుషకంఠం. రెమ్మ పైకి జరిగింది!

నిధి తటాలున ఆగి, మళ్ళీ అటూఇటూ చూశాడు. ఎవ్వరూ లేరు. ప్రాకారం అవతలి వైపు నుండి ఎవరో పిలుస్తున్నట్టున్నారు. ప్రాకారం చాలా ఎత్తుగా ఉంది.

"ఎవరు?" అంటూ నిధి ప్రాకారం దగ్గరగా

# మంచి పత్ని అవుతుందట!



ఈ మాట మరో హీరోయిన్ నోటి వెంట వచ్చి ఉంటే నమ్మేచ్చేమో కానీ అమలాపాల్ మాట్లాడుతుంటే మాత్రం తెగ నవ్వు వస్తుంది. కాకపోతే ఈవిడగారు మంచి భార్యగా ఉండేది తెరమీద మాత్రమేనట! ఇంతకీ అసలు సంగతేమిటంటే... కోలీవుడ్ హీరో ధనుష్‌తో 'విఐపి2'లో నటిస్తోంది. ఈ సినిమా మొదటి భాగంలో అమల ధనుష్ ప్రియురాలిగా కనిపించింది. రెండోపార్టులో అతగాడిని అనుమానించే భార్య అయింది. రాబోయే మూడవ భాగంలో మాత్రం ధనుష్‌కి మంచి భార్యగా అవతారం ఎత్తుతుందట! అసలే వీరిద్దరి మధ్యా ఏదో నడుస్తోందనేది కోలీవుడ్ వర్గాల అనుమానం. ఇప్పుడు అమల నోటి నుంచి వచ్చిన ఈ మాటలు విని అదే ఖాయమంటున్నారు కొందరు.

రెండడుగులు వేశాడు.

"నిధీ...ఆగు! నేను ఇక్కడే... నీ ఎదురుగా.. బిల్వ వృక్షం వద్దే ఉన్నాను.."

అదృశ్య పురుషకంఠం స్పష్టంగా పలికింది. నిధి శరీరం ఒక్కసారిగా జలదరించింది. చర్మంలోంచి స్వేదబిందువులు ఒక్కసారిగా పొంగాయి. చెట్టు బోదెవైపు కళ్ళు చించుకుంటూ చూశాడతను. ఎవ్వరూ లేరు!

"ఎ... ఎవరు?" నిధి కంఠం జీరగా ధ్వనించింది.

"భయపడకు... నేను భూతాన్ని కాను, ప్రేతాన్ని కాను. ఆత్మను కాను, అసురశక్తినీ కాను.."

"ఎవరు?" నిధి ధైర్యం కూడదీసుకుంటూ అన్నాడు.

"నేను ఒక తేజో రూపాన్ని. నా ఉనికిని నువ్వు నీ కళ్ళతో – అంటే – నేత్రేంద్రియంతో గుర్తించ లేవు. ముక్కుతో – అంటే ఘ్రాణేంద్రియంతో, చెవులతో– అంటే శ్రవణేంద్రియంతో మాత్రమే గుర్తించగలవు."

"నువ్వెవరివి?" నిధి ధైర్యంగా గద్దించాడు. అతని పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి.

"ఆవేశపడకు. అన్నీ చెబుతాను" అశరీర పురుషుడు అన్నాడు. "నువ్వు నీ ఘ్రాణేంద్రియంతో ఒక రకమైన దుర్గంధాన్నీ, దాని ద్వారా నా ఉనికినీ అనుభవిస్తున్నావు కదా! ఆ దుర్గంధం నా శరీరం నుండి వస్తోంది.

రెండవ అంశం: నువ్వు శ్రవణేంద్రియంతో నా మాటలు ఆలకిస్తూ, నా ఉనికిని అనుభవిస్తున్నావు. నేను...

"నాతో నీకేం పని?" నిధి అడ్డొస్తూ అడిగాడు.

"నేను చెప్పబోయేది పూర్తిగా వింటే నీతో నాకు పనో, నాతో నీకు పనో అర్థమవుతుంది. ముందుగా నీకు నా పరిచయం అవసరం. నీ పరిచయం నాకు అవసరం లేదు. నీ గురించి నాకు అంతా తెలుసు. నీ తల్లి అరుంధతి. తండ్రి కర్దముడు. నీ తోబుట్టువు నవనీత. వీరదశమి స్పర్ధలో గెలిచి ఓడిపోయావు. పౌండ్రక పర్వతగర్భంలో నిక్షిప్తమై ఉన్న నవ నిధుల్ని సంపాదించుకురమ్మని మీ రాజు నందికేశ్వరుడు నిన్ను అర్థించాడు. అందుకు కారణాలు నీ పరాక్రమం, నీ జాతకబలం అన్నారు. నీ తల్లి దండ్రులూ, నీ చెల్లెలూ ఆ దుస్సాహసం చేయ వద్దన్నారు. మహారాజు ప్రతిపాదనను తిరస్కరించాలని ప్రదక్షిణపథంలో నడుస్తూ, కొన్ని నిమిషాల క్రితం నువ్వు నిర్ణయించుకున్నావు.."

ఆశ్చర్యంతో వింటూ చెట్టు దగ్గర మరొకచెట్టులా ఉండిపోయిన నిధి నెమ్మదిగా తేరుకున్నాడు. "ఇదంతా.. ఇదంతా".

"నాకు అంతా తెలుసు. అన్నీ తెలుసు! అదృశ్య పురుషుడు చిన్నగా నవ్వాడు. నీ గురించి చెప్పాను. ఇప్పుడు నా గురించి చెప్తాను. నువ్వు మహాభారతం చదివావా?"

"విన్నాను. కథలుగా..." నిధి అన్నాడు.

"ద్రోణాచార్యులు ఎవరో తెలుసా?"

"కౌరవులకూ, పాండవులకూ విలువిద్య నేర్పిన గురువు.."

"ద్రోణాచార్యుల ధర్మపత్ని సాధ్వి కృపి. ఆ దంపతుల పుత్రుడి పేరు అశ్వత్థామ".

"తెలుసు"

"ఆ అశ్వత్థామ నేనే!"

నిధి అప్రయత్నంగా రెండడుగులు వెనక్కివేశాడు. శరీరం మీద రోమాలు నిక్కబొడుచుకున్నాయి. "నువ్వు... మీరు... మీరు నిజంగా అశ్వత్థామేనా?"

"సందేహమెందుకు?"

"మీరు.. మీరు... ఇంకా... ఈనాటికీ..."

"అర్థమైంది నాయనా! జీవించే ఉన్నాను. కలియుగాంతం వరకూ జీవించే ఉంటాను..."

"ఓహ్...అప్పటివరకు జీవించటం మీరు పొందిన వరమా ఆర్యా!"

"కాదు... శాపం!"

"శాపమా?" నిధి కంఠంలో ఆశ్చర్యం ధ్వనించింది.

"ఔను... శ్రీకృష్ణుడి శాపం! భారతం విన్నాను అన్నావు. మరచిపోయినట్టున్నావు విను: నేను చీకటి రాత్రిలో, గాఢ నిద్రలో ఉన్న ఉప పాండవులను ద్రౌపదీదేవి సంతానాన్ని నరికి చంపి వేశాను. శ్రీకృష్ణ పరమాత్మా, వేదవ్యాసమహర్షీ నన్ను మందలించి, నా శిరోరత్నాన్ని ధర్మరాజుకు ఇప్పించివేశారు. పాండవ వంశం అనేది లేకుండా చేసే ప్రయత్నం చేశాను. అప్పుడు శ్రీకృష్ణుడు నన్ను శపించాడు. ఆహారం లేకుండా, ఆకలితో అలమటిస్తూ జీవించేలా శపించాడు. శరీరం అధికమైన వేడిమితో కాలిపోతూ, నెత్తురు దుర్గంధాన్ని వెదజల్లుతూ ఉంటే దుర్భరమైన, హీనాతిహీనమైన బ్రతుకు బ్రతికేలా శపించాడు. నా శరీరం నుండి పరిసరాలలో వ్యాపిస్తూ, నీ ఘ్రాణేంద్రియానికి అనుభవానికి వస్తున్న దుర్వాసన ఆ శాపఫలితమే. నికృష్టమైన, నీచమైన ఈ జీవితం ఎప్పుడు అంతమవుతుందా అన్న ఆత్రుతతో కాలం వెళ్ళదీస్తూ 'సంచార జీవితం' గడుపుతున్నాను. మనశ్శాంతికోసం మహాభారత ప్రవచనం ఎక్కడ జరిగితే అక్కడ ఈ అదృశ్యరూపంతో శ్రవణం చేస్తూ ఉంటాను. మహాభారత ప్రవచనం జరిగే ప్రదేశంలో వ్యాపించే దుర్గంధం ఈ అశ్వత్థామ శరీరం వెదజల్లేదే అని అనుభవజ్ఞులకు తెలుసు..."

అంతసేపూ తనలో వ్యాపించిన ఆశ్చర్యమూ, ఆందోళనా, ఒక విధమైన భయమూ మెల్లగా అంతరించిపోతున్నట్టు గ్రహించాడు నిధి.

"ఆర్యా... మిమ్మల్ని ఏకవచనంతో సంబోధించాను."

"నాకు ఆ పట్టింపులు లేవులే నాయనా?"

"నన్ను... నన్ను పలకరించారు. దేనికి ఆర్యా?"

"గాఢనిద్రలో నిరాయుధులుగా ఉన్న పిల్లల్ని నిర్దయగా, ఘోరంగా హత్యచేశాను. భయంకరమైన పాపాన్ని మూట కట్టుకున్నాను. ఆ పాపప్రక్షాళన కోసం, ప్రక్షాళన అవుతుందన్న ఆశతో, అర్హులైన మానవులకు సహాయం చేయాలనుకున్నాను. అనుకున్న అనంతరం నాకు తారసిల్లిన అర్హుడివి నువ్వే! నీకు ఏ సహాయం చేస్తానో, ఎప్పుడు చేస్తానో చెప్పలేను, చెప్పను. ప్రస్తుతస్థితిలో నీకు ఒక సూచన చేయాలనుకున్నాను. అందుకే పలకరించాను. నా సూచనను నువ్వు పాటించాలి.."

"మీ సూచన ఏమిటో చెప్పండి ఆర్యా.."

"మీ రాజు కోరికను మన్నించు. నవనిధుల అన్వేషణను చేపట్టు!" అశ్వత్థామ కంఠం గంభీరంగా అంది.

***(ఇంకా వుంది)***

## రకూల్‌కు గట్టిపోటీ



కుర్ర హీరోయిన్లు ఎంత మందొచ్చినా ఎవ్వరూ రకూల్‌కు గట్టిపోటీ ఇవ్వలేదు. ఓ విధంగా చెప్పాలంటే డి.జె. సినిమా విడుదలయ్యేంత వరకూ రకూల్‌కి ఎదురు లేదనే చెప్పాలి. డి.జె. తరువాత ఒక్కసారిగా పూజా హెగ్డె డిమాండ్ పెరిగిపోయింది. ఇప్పటి వరకూ ఎక్స్‌పోజింగ్‌లో రకూల్‌కి సాటి లేరన్నవారే ఇప్పుడు పూజా పేరు జపిస్తున్నారట! దీంతో రకూల్‌కి పూజా రూపంలో గట్టి పోటీ ఎదురైంది. మొన్నటి వరకూ రకూల్ డేట్ల కోసం ఆమె ఇంటి ముందు క్యూ కట్టిన వారు ఇప్పుడు పూజా ఇంటికి క్యూ కడుతున్నారట! రకూల్‌కి ప్రత్యామ్నాయంగా పూజా మంచి ఆప్షన్‌గా మారిందన్నది టాలీవుడ్ జనాల మాట! రకూల్ అందాలు చూసి చూసి బోర్ కొట్టినవారికి పూజా సరికొత్తగా కనిపిస్తోందట! సో....టాలీవుడ్‌లో రకూల్ హవా తగ్గడం మొదలైంది అంటున్నారు.






## స్కై గార్డెన్

ఇంట్లో పాతబడిన సామాన్లు, ఇతర వస్తువులు తీసేస్తుంటారు. మరి పాతబడిన ఫ్లైవోవర్లను ఏంచేస్తారు? అంటే దక్షిణ కొరియా అధికారులు వాటిని వనాలుగా మార్చేస్తాం అంటున్నారు! దక్షిణకొరియా రాజధాని నగరం సియోల్ నడిబొడ్డున ఉన్న ఫ్లైవోవర్‌ను 1970లో నిర్మించారు. అయితే ఆ ఫ్లైవోవర్ నాణ్యతపై అనుమానాలు రావడంతో కాస్తంత కొత్తగా ఆలోచించి దానిపై మొక్కలు పెంచి పార్కుగా మార్చాలని నిర్ణయించి, అలాగే చేశారు కూడా! కొరియా వృక్ష సంపదను ప్రతిబింబించేలా మొత్తం 24వేల మొక్కలను నాటించారు. సియోల్‌లోని ముఖ్యమైన ప్రాంతాల్ని కలిపేలా ఇక్కడి నుంచి మెట్లదారులు ఏర్పాటు చేశారు. దారిలో అక్కడక్కడా కాఫీషాపులూ, ప్రదర్శన శాలలూ, దుకాణాలూ, రెస్టారెంట్లూ ఏర్పాటు చేసేందుకు పెద్ద కుండీల ఆకృతిలో చిన్న గదులు నిర్మించారు. ఇప్పుడా ఫ్లైవోవర్ ఆకాశవనంగా మారి చూపరులకు ఆహ్లాదాన్ని పంచుతోంది.

## ప్రొఫెషనల్ ఆడియెన్స్



బుల్లితెర రియాల్టీషోలకు, ప్రత్యేక కార్యక్రమాలకు ప్రేక్షకులు ఎంత ఎక్కువమంది హాజరైతే, ఆ కార్యక్రమం అంత ఎక్కువగా విజయవంతమైనట్టు. సరిగ్గా ఇదే అంశం ఇప్పుడు చైనాలో ఉద్యోగ ప్రదాయనిగా మారింది. ఇప్పుడు చైనాలో సరికొత్తగా మార్కెటింగ్ ఎగ్జిక్యూటివ్స్‌లాగా ప్రొఫెషనల్ ఆడియెన్స్ పుట్టుకొచ్చారు. వీరు చేసేదల్లా కార్యక్రమానికి హాజరై తమ హావభావాలతో, నవ్వుతూ, నవ్విస్తూ ఉండడమే! అంతేకాదు జీతంతో పాటు, ఎవరినైనా ఈ ఉద్యోగంలో చేర్పిస్తే 30శాతం బోనస్ కూడా వస్తుంది. అలాగే 'బావ్‌లింగ్ బాయ్స్', 'గ్రీవింగ్ గర్ల్స్', 'ఎమోషనల్ ఎంపరర్స్'లాంటి బిరుదులు కూడా ఇస్తారు. అయితే, వీరికీ రూల్స్ అండ్ రెగ్యులేషన్స్ ఉన్నాయండీ. వీరు ఒక్కసారి షోలో కూర్చున్న తర్వాత ఎంత బోర్ కొట్టినా, విసుగొచ్చినా కార్యక్రమం పూర్తయ్యే వరకూ బయటకు వెళ్లకూడదు. మొబైల్స్ వాడకూడదు. కార్యక్రమం చూస్తూ నిద్రలోకి జారకూడదు. షో చూస్తూ ఎంజాయ్ చేస్తున్నట్లు నటించాల్సిందే..

## యోగా గర్ల్



యోగా... మానసిక ప్రశాంతతకు, ఆరోగ్యానికి చక్కటి మార్గం. అలాంటి యోగాతోనే సోషల్‌మీడియాలో స్టార్ అయింది రేచల్ బ్రేటన్. యోగాసనాలతో సెలబ్రిటీగా మారిపోయింది. స్వీడన్‌కి చెందిన రేచల్ బ్రేటన్ ఓ ప్రమాదంలో తీవ్రమైన గాయాలతో ఇంటికే పరిమితమైంది. ఆ సమయంలో మానసిక ఒత్తిడితో బాధపడుతూ స్నేహితుల సలహాతో యోగావైపు దృష్టి సారించింది.

అదే ఆమె జీవితాన్ని మలుపు తిప్పింది. మెళకువలన్నీ నేర్చుకుని, విభిన్న రీతుల్లో యోగా సాధన చేస్తోంది. అందరూ నేలపై యోగా చేస్తే, రేచల్ నీటిలో, ప్యాడల్ బోర్డుపై యోగా చేస్తూ అందరినీ ఆకర్షిస్తోంది. అంతేకాదు ఆ ఫొటోలు సోషల్‌మీడియాలో పోస్ట్ చేస్తూ యోగా గర్ల్‌గా మారిపోయింది. ప్రపంచంలో అతిపెద్ద యోగా ఇన్‌స్టాగ్రామ్ ఖాతా రేచల్‌దే!

ఫేస్‌బుక్, ట్విట్టర్, యూట్యూబ్‌లో కూడా ఆమెకు బోలెడంత మంది ఫాలోవర్స్. అంతేకాకుండా 'యోగా గర్ల్' అనే పుస్తకం కూడా రాసింది రేచల్. ప్రేమించిన వ్యక్తిని పెళ్ళాడి, పండంటి అమ్మాయికి జన్మనిచ్చినప్పటికీ... రేచల్ యోగా గర్ల్‌గా సోషల్ మీడియాలో హల్‌చల్ చేస్తూనే ఉంది.

## పదాలను రుచి చూస్తోంది



రోరీ అని తన స్నేహితుడిని తలచుకోగానే క్యారట్ తినాలనిపిస్తుంది ఆమెకు. అలాగే లోలా అనే పదం వింటే వెంటనే లాలీపాప్స్ లాగించేస్తుంది. ఎల్లా పదం వింటే జెల్లీబీన్స్ కోసం పరిగెట్టాల్సిందే! ఎందుకలా? అంటే లెక్సికల్ గస్టేటరీ సినెస్థీషియా వల్ల ఆమె అలా ప్రవర్తిస్తోందని డాక్టర్లు తేల్చేశారు. అసలు అదేంటో తెలియాలంటే కాథరిన్ జాక్సన్ గురించి తెలుసుకోవాల్సిందే!

ఇంగ్లండ్, నాటింగ్‌హామ్‌కి చెందిన 22యేళ్ళ కాథరిన్ జాక్సన్‌కు కొన్ని పదాలు వింటే చాలు... ఆ పద ఉచ్చారణకు దగ్గరగా ఉన్న ఆహారం తీసుకోవాలనిపిస్తుందట. మాట్లాడేటప్పుడు, రాసేటప్పుడు ఆ పదానికి సంబంధించిన పదార్థాన్ని తినేస్తుంటుంది. అయితే కాథరిన్ కేవలం వాటిని రుచి చూడటంతోనే సరిపెట్టదు... దాని ఆకృతిని, సువాసనను కూడా ఆస్వాదిస్తుందీ అమ్మడు. మొత్తానికి భలే వింత అలవాటు కదా!

## అదోరకం పిచ్చి



చిల్లీసాస్‌లో స్నానమాడేస్తారు... సడన్‌గా రోడ్డుమీద వెళుతున్న వాహనాలను ఆపి, వాటిల్లోకి ఎక్కేస్తారు...వాటిని వీడియోలు తీసి సోషల్‌మీడియాలో అప్‌లోడ్ చేస్తారు. అలాంటిదే ఇప్పుడు మరో సాహసం చేశారు. ఇంతకీ ఎవరు చేశారు? ఇంగ్లండ్, వెస్ట్‌మిడ్‌ల్యాండ్, డడ్లీకి చెందిన జే స్వింగ్లర్, రోమెల్ హెన్రీ! వీరిద్దరూ 'TGFbro'గా సోషల్‌మీడియాలో సుపరిచితులే! తాజాగా ఇద్దరూ తమ గోతులు తామే తవ్వుకుని, శవపేటికల్లో 24 గంటలు ఉంటామంటూ యూట్యూబ్‌లో లైవ్‌షో ఇచ్చారు. గోతిలో పడుకున్నా ఎప్పటికప్పుడు ట్విట్టర్‌లో ట్వీట్లు పంచుతూ, యూట్యూబ్‌లో లైవ్ చాట్ చేస్తూ ఒక రోజంతా అంటే 24 గంటలు గడిపారు. ఈ లైవ్‌షోని దాదాపు 8,000 మంది దాకా చూశారు. లక్షలమంది లైకులు, షేర్లు, రీట్వీట్లతో వారిద్దరినీ ఎంకరేజ్ చేశారు. ఒక్కొక్కరికి ఒక్కో పిచ్చి అంటే ఇదేనేమో!

—నర్మద వాసిరెడ్డి

## సం గతులూ! దర్భాలూ!

-ఇంద్రగంటి శ్రీకాంతశర్మ సెల్:98480 78079

**సింహాచలం–**

**కొండపైని స్వామివారి దర్శనం చేసుకుని క్రింద విడిదికి రాగానే నందితిమ్మన్నగారిని ఆకర్షించిన మొదటివిషయం: పరిచారిక వత్సల చేతిలో ఉన్న అరటిదొప్పపొట్లం.**

**వత్సల ఎంతో గౌరవంగా ఆ పొట్లం కవిగారికి చేతికందించింది.**

**విప్పిచూస్తే ఘుమఘుమలాడే బంగారువన్నెచెట్టు సంపెంగపూలు. తిమ్మన్న గారు పరవశించి పోయారు.**

**అయితే – అరటిదొప్పలో ఎందుకు కట్టడం? ఆ చల్లదనానికి సున్నితమైన ఆ పువ్వులు వాడిపోకుండా ఉంటాయి.**

# సంపెంగపువ్వు



మెరిసిపోయే ఒక పువ్వుని చేతిలోకి తీసుకుని తదేకంగా చూశాడు.

ఎంత అందం! – అచ్చం అందమైన వయసులో ఆడపిల్ల ముక్కులాగా లేదూ?

ఆపళంగా ఆ కవికి తను వ్రాయసంకల్పించిన పారిజాతాపహరణ కావ్యం మనస్సులో మెదిలింది. కావ్యనాయిక సత్యభామ విసురుగా విసిరే జడ కూడా గుర్తుకువచ్చింది. ఆహా! ఈ సంపెంగల్ని దండకట్టి ఆ జడలో తురిమిస్తే! – చీకటి కొసవేళ ఉషస్సులాగ ఉండదూ?– కోపధారిణి ముఖం ఎరుపెక్కి, కాస్త ఆ కోపవు వెలుతురు ముఖం వెనక్కి కూడా ప్రసరించి నట్టుంటుందేమో!

తన ప్రభువుండే ఉత్కళదేశం నుంచి, కృష్ణదేవమహారాయలవారికి భార్య అన్నపూర్ణాదేవి వెంట అరణంగా విద్యానగరంచేరిన కవి నందితిమ్మన. ప్రతాపరుద్రగణపతి తన కన్యతోపాటు, అల్లుడి అభిరుచికి తగిన కవినికూడా అరణమిచ్చాడు కదా!

మరి ఆ అన్నపూర్ణాదేవికీ, ఆ మహారాయలకీ పడకటింట జరిగిన పొరపాటు కారణంగా పొరపొచ్చాలొచ్చాయి కదా!

అరణపుకవి ఆడకూతురిపక్షాన కలగజేసుకుని రాజు అలక తీర్చవలసి వచ్చింది.

అందుకే పారిజాతాపహరణ కావ్య రచనకు సంకల్పం.

సింహాచలం గిరిసానువుల్లోపుట్టి, తన పరిమళంతో ఉగ్రనరసింహస్వామినే చల్లబరచిన సంపెంగపువ్వు, రసిక రాయలను మాత్రం చల్లబరచదా? అనే ఆలోచన, నందితిమ్మనగారిని సంపెంగపరిమళం లాగే వదలలేదు.

యాత్ర ముగించుకుని కవిగారు విద్యానగరం చేరుకున్నారు. నిత్యకృత్యాలు గడుస్తున్నాయి. కోటలోకి వెడుతున్నారు. వస్తున్నారు. భువనవిజయంలో సాటికవులు కలుస్తున్నారు. పలకరిస్తున్నారు. అందరికీ తెలుసు. ఆయన కావ్యరచనా ధ్యాసలో ఉన్నాడని.

ఇలా గడుస్తుండగా–

ఒక సూర్యాస్తమయవేళ తిమ్మన్నగారు తన ఇంటి వీధివాకిట్లో మామిడిచెట్టుకొమ్మకి కట్టివున్న ఉయ్యాలలో మెల్లగా ఊగుతూ– కూనిరాగాలు తీస్తున్నాడు. అదేదో బహుశా ఒక పద్య ప్రసవ సమయం.

ఒక్కసారి మనస్సుమీద మెరుపుదెబ్బ కొట్టినట్టై – అలనాటి సంపెంగపువ్వు, చూడచక్కని ప్రౌఢ యువతి కోపదారి ముక్కులాగ తోచింది. వారెవా!! – ఈ ముక్కును సత్యభామకు అమరిస్తే ప్రశస్తంగా–కథ రక్తికడుతుందని తోచింది. తోచడమేమిటి? మొగలిజడమాదిరి పద్యపాదాలు తమంతట తాము అల్లుకుంటూ వచ్చాయి.

ఒట్టినే "సత్యభామ ముక్కు సంపెంగపువ్వులాగ ఉన్నది" – అంటూ తలుపుచెక్కలాగ వాక్యం వ్రాస్తే ఎలాగ? సొగసైన కల్పన కావాలి.

తిమ్మనగారు క్షణంసేపు ఆలోచించారు. ఒక కథే తట్టింది. ఏమిటా కథ?

### (కొత్త శీర్షిక ప్రారంభం)

అనగనగా ఒక సంపెంగపువ్వు. దానికి హఠాత్తుగా కష్టంతోచి – కోపం వచ్చింది. ఎందుకు?– "తుమ్మెదలు అన్నిరకాలపూలను ప్రేమిస్తాయి. పరిమళాన్ని ఆస్వాదిస్తాయి. వాటిలో తేనెను విందారగిస్తాయి. నావైపు చూడనైనాచూడవు. ఈ తుమ్మెదల చేత నేను సేవ చేయించుకోక పోతే ఒట్టు!!" అని గట్టిగా అనుకుని ఉగ్రంగా తపస్సు చేసి– కావలసిన వరం పొందింది.

ఆ పళంగా అందమైన ఒక ప్రౌఢకే ముక్కుగా పునర్జన్మించింది. మరి – ఆ ప్రౌఢ రకరకాల పూలను వాసన చూస్తోంది. ఆమె కడగంటిచూపులు నల్లని తుమ్మెదలైపోయి, ఈ సంపెంగ ముక్కుగారిని ఎడాపెడా మసలుతూ సేవించుకుంటు న్నాయి.

ఇలాగ సంపెంగకి కోపం తీరింది–

పద్యం పూర్తయింది. ఆ పద్యం ఇది:

**"నానా సూనవితాన వాసనల నానందించు సారంగ మే**
**లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకన్ తపంబంది యో**
**షా నా సాకృతి పూనె సర్వసుమనస్సౌరభ్య సంవాసియై**
**పూనెన్ ప్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్**

బలే! సత్యభామ ఎరుపెక్కినముక్కుకి తగినవర్ణన కుదిరిం దని, తిమ్మనగారు ముచ్చట పడ్డారు. ఆ ఆనందంలో ఊయలమీ దనుంచి లేవబోతూంటే– దారినపోయే భట్టుమూర్తి, తిమ్మనగారి వాకిట్లోకి తొంగిచూసి– లోపలికి చక్కావచ్చాడు. వస్తూనే ఉయ్యా లకు పక్కగావున్న బండరాయిమీద చతికిలబడ్డాడు. ఇంకేం, తిమ్మ నగారు ఉయ్యాలలోనే ఉండిపోయారు.

"తలచిన వెంటనే గుర్తొచ్చే పద్యంలాగ వచ్చేవయ్యా మిత్రమా – ఏమిటి విశేషాలు?" అంటూ భట్టుని కుశలమడిగారు.

భట్టు మొలకనవ్వునవ్వి– "మామా! తమరు లౌక్యులు. రాయ లవారి అంతఃపురానికి ఆంతరంగికులు. విశేషాలు తమకే తెలి యాలి. మాదేముంది? రాయలవారి అల్లుడు రామరాయల వారి పంచన బతికేవాళ్లం..."

"అంత వినయం వద్దులే నాయనా! – అల్లసాని పెద్దన్నగారి మాడు పగలకొట్టే పాండిత్యం, సంగీత వైభవం, కలబోసి కావ్యర చన చేస్తున్నావటగా!"

"మామా! ఎంతమాట! పెద్దన్నగారితో పోటీనా? అంతమాట అని నా కొంపతీస్తావా యేమిటి? – కావ్య సంకల్పం నిజమే. రామ రాయల వారు ఏదో అంటారు. ఆయన తమ్ముడు తిరుమల రాయ లవారు ఇంకొకటంటారు. ఇప్పటిమాటా? ఎప్పటికి తేలేనో!"

"భట్టూ, లౌక్యాలకేమిగాని, నీ చాటువులూ, స్తోత్రాలూ విన్నా నుకదు! గొప్ప పద్యధారయ్యా నీది! శబ్దం నీ చేతిలో వెన్నలాగ కరి గిపోతుందికదయ్యా! పద్యానికి పాటదనం తేగల సత్తానీది.."

"అదంతా గురుకృప. ఉన్నది కాదనం. లేనిది ఉన్నదనం.– అదంతా ఎందుకుగాని– మీ ముఖం చూస్తే ఇప్పుడే యేదో పద్యం పలికినవైనం కనిపిస్తోంది" అని భట్టుమూర్తి దానికోసం ఎదురు చూస్తున్నట్టు కళ్లు చికిలించాడు.

తిమ్మన్నగారు కరిగిపోయి– సందర్భం వివరించి మెల్లగా పద్యం వినిపించారు.

భట్టుమూర్తి కళ్లు పరవశంగా మెరిశాయి. చేతులు జోడించి – నమస్కరించాడు.

"భలేకల్పన అందమైన ముక్కుకి ఎంతకథ కట్టారు!! అయితే ఈ కల్పన ప్రౌఢ ముక్కుకి నప్పదు. ముగ్ధకే నప్పుతుంది. మీరు అనుగ్రహిస్తే ఈ పద్యాన్ని నా కావ్యనాయిక గిరికకు అమర్చుకుం టాను. మామ అనుగ్రహం తప్పరు గాక తప్పరు"

"అంతేనంటావా?"

"తమరనుగ్రహిస్తే.."

తిమ్మన్నగారు క్షణంసేపు ఆలోచించారు.

"సరే – నువ్వే తీసుకో" అనేశారు. ఇంతలో – రామకృష్ణకవి తోకచుక్కలాగ ఊడిపడ్డాడు.

కథ ఏమిటన్నాడు. కూపీ లాగాడు.

భట్టుమూర్తి బతిమాలుతున్నట్టు కోరిక కోరాడు.

"మహానుభావా! తమ నోటబడిన వార్త ఆకాశవాణి లాగ మారుమ్రోగుతుంది. – ఈ ఘట్టం మన ముగ్గురి మధ్యనే మిగి లిపోవాలి"–

"అలాగే – అయితే, ముక్కుని తిమ్మన్నగారికి మిగుల్చు, పద్యం నువ్వుంచుకో – ఈ ఏర్పాటు వల్ల ఉభయతారకం... కవు లంకదయ్యా! ఏదోవిధంగా పేరుమిగలాలి" అంటూ తీర్పు చెప్పాడు రామకృష్ణయ్య.

ఆ కారణంగా – నంది తిమ్మన్నగారు ముక్కుతిమ్మన్న కాగా–

సంపెంగముక్కు పద్యం భట్టుమూర్తి 'వసుచరిత్ర' కావ్యాని కెక్కింది.

## 200 ఏళ్లుగా యోగముద్రలోనే...!



ఇప్పటికీ ఎంతో చలాకీగా తమ పనులు తాము చేసుకుంటూ శతాధిక సంవత్సరాలు పూర్తి చేసుకున్న వృద్ధులు ఎందరో మన చుట్టూ ఉన్నారు. కానీ ఇప్పుడు చెప్పబోయే వృద్ధుడు మాత్రం ప్రత్యేకమైన వ్యక్తే! అతనొక బౌద్ధ సన్యాసి. అతన్ని ఒక మమ్మీ అనుకోవచ్చు. ఒకవేళ అతను చనిపోయాడేమో... అందుకే మమ్మీ అంటున్నారు అనుకుంటున్నారా? కానే కాదు అతను బతికి ఉన్నా చనిపోయిన శవం అన్నమాట. అదేంటి అలా ఎలా? అసలు బతికున్న వ్యక్తిని మమ్మీ అని ఎలా అంటారు? అని కన్ఫ్యూజన్‌లో పడ్డారా...అయితే ఆ గందరగోళం తీరాలంటే ఇది చదవాల్సిందే!!

మనల్ని ఎవరైనా కదలకుండా కూర్చోండి అంటే మహా అయితే ఒక రెండు గంటలు కూర్చుంటాం లేదా మూడుగంటలు కూర్చుంటాం. మరీ అనుకుంటే ఒక నాలుగుగంటలు కూర్చుంటాం. అయితే ఇప్పుడు చెప్పుకో బోయే వృద్ధుడు మాత్రం కొన్ని సంవత్సరాలుగా పద్మాసనంలో కూర్చునే ఉన్నాడు. అతని వయసెంతో ఎవరికీ తెలియదు కానీ అతను పద్మాసనంలో కూర్చుని ఇప్పటికి రెండువందల సంవత్సరాలు అయ్యాయి. మంగోలియా దేశంలో ఆ వృద్ధుడిని కనుగొన్నారు. రెండు వందల సంవత్సరాల నుంచి వృద్ధుడు అదే స్థితిలో కదలకుండా కూర్చుని ఉన్నాడు.

మంగోలియా దేశ రాజధాని అయిన ఉలాన్‌బటార్‌లో ఒక గుహలో ధ్యానముద్రలో ఉన్న వృద్ధుణ్ణి చూసి కొందరు దుండగులు చనిపోయాడని భావించి, బ్లాక్‌మార్కెట్‌లో మృతదేహాన్ని అమ్ముకుందామని బయటకి తీసు కొచ్చారు. దుండగులు పోలీసుల దృష్టిలో పడటంతో ఈ వృద్ధుడు వెలుగులో కొచ్చాడు. అలా కదలకుండా కూర్చుని ఉండడం చూసి అక్కడి వారు అతను చనిపోయాడు అనుకున్నారు కానీ అతనింకా బతికే ఉన్నాడట. ఆ యోగి శరీ రాన్ని డాక్టర్లు పరిశీలించగా అతను బతికే ఉన్నాడని తేలింది.

ఇది ధ్యానంలో అత్యుత్తమమైన దశ అని, ఎంతో సాధన చేస్తే కానీ అలాంటి దశకు చేరుకోలేమని అక్కడి బౌద్ధ సన్యాసులు చెబుతున్నారు. ఈవిధంగా ఉన్నత స్థితిలో ఉన్న ధ్యానస్థితిని వారి భాషలో 'తుక్డం' అని పిలు స్తారు. అలాంటి స్థితికి చేరుకున్నవారికి ఆకలి దప్పులు, నిద్ర ఏదీ ఉండదు. కదలక మెదలక దేనికీ చలించక ధ్యానంలో మునిగిపోయి ఉంటారు. ఇలా ఈస్థితికి చేరుకునే వారు బౌద్ధ సన్యాసులలో చాలా అరుదు. అందుకే ఇతన్ని అందరూ బుద్ధునిగా భావిస్తారు. ఇలా ఈ స్థితిలోకి చేరుకున్న వ్యక్తులు ఏదో ఒకరోజు అద్భుతాన్ని సృష్టిస్తూ తమ చుట్టూ మంచి చేసి పోతారని అక్కడి వారి నమ్మకం. అయితే అతన్ని పరిశీలించిన మరికొందరు డాక్టర్లు మాత్రం అతను చనిపోయాడని, గుహలోని వాతావరణం చల్లగా ఉండడం కార ణంగా అలా బిగుసుకుపోయి ఉండవచ్చనే అభిప్రాయం వ్యక్తం చేశారు. మరి కొందరు నిపుణులేమో అతను బతికే ఉన్నాడన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తు న్నారు. ఇలా చనిపోయాడో, బతికి ఉన్నాడో తెలియక అతన్ని మంగోలియా లోని నేషనల్ సెంటర్ ఫర్ ఫోరెన్సిక్‌లో పరిశీలనార్థం ఉంచారు.



# శారీమ్యాన్ ఆఫ్ ఇండియా

**భారతీయ చీరకట్టుకు ప్రపంచం నలుమూలలా ప్రాధాన్యం ఉంది. విదేశాల్లో చీర కట్టును ఎంతో ఆదరంగా, అబ్బురంగా చూస్తారు! మగువకు చీర కట్టు, మగాడికి పంచకట్టు అన్నారు పెద్దలు. కానీ చీరకట్టు ఇప్పుడు కేవలం మగువలకే సొంతమనుకుంటే పొరబడినట్టే!**

**అదేంటీ! మగాళ్ళు కూడా చీర కడుతున్నారా? అని సందేహించకండి.**

**మగవారు ఎందుకు చీర కట్టుకోకూడదని ప్రశ్నిస్తున్నాడో వ్యక్తి. ఇంతకీ ఎవరా వ్యక్తి? ఏమిటా కథ? అని తెలుసుకోవాలంటే ఈ స్టోరీ చదివే సేయండి మరి!**

ఆడవారు చీరలు కట్టాలి, మగవారు పంచెలు కట్టాలి అనే సంప్రదాయాన్ని, ఆ రెంటి సరిహద్దుల్నీ చెరిపేశాడీ మగాడు. అతని పేరు హిమాన్షువర్మ. అంతేకాదు, శారీమ్యాన్ ఆఫ్ ఇండియాగా పేరు పొందాడు.

అవునండీ! చీరకట్టుకోవడంలో మగువను మించి పోయాడితగాడు. అందుకే అందరూ అతన్ని ముద్దుగా శారీమ్యాన్ ఆఫ్ ఇండియాగా పిలుచుకుంటున్నారు. మగవారు కూడా చీరకట్టుకోవచ్చని, అది ఎవరికైనా సొంతమేనంటున్న హిమాన్షువర్మ ఇంకా ఏమంటున్నాడంటే......

## పన్నెండేళ్ళుగా చీరకట్టే!

"పిల్లలందరూ బాల్యంలో అమ్మ కుచ్చెళ్ళు పట్టుకుని ఆడుకున్నవాళ్ళే. నేను కూడా అంతే. అమ్మ కుచ్చెళ్ళు పట్టుకుని అమ్మ వెంటే ఉండేవాణ్ణి. అమ్మనే చూస్తూ ఉండేవాణ్ణి. అప్పటి నుంచే నాకు చీరపై మమకారం ఏర్పడింది. దానికి తోడు నా చదువు, చేస్తున్న పని కూడా చీరకట్టు తీరుపై మరింత మమకారం పెంచేట్టు చేశాయి. ఒక చీరల దుకాణానికి సంరక్షకుడిగా ఉండేవాడిని. నా పనిని మరింత అందంగా తీర్చిదిద్దాలని, అందరికన్నా ప్రత్యేకంగా ఉండాలని ఎప్పుడూ భావించేవాణ్ణి. ఆ ఆసక్తే నన్ను చీర కట్టేందుకు పురిగొల్పింది. నేను చీరలు కట్టడం ప్రారంభించి ఇప్పటికి పన్నెండు సంవత్సరాలు అయింది. చీరలు కట్టుకుంటున్నందుకు నేను ఎప్పుడూ సిగ్గుపడలేదు. పైగా ఇలా కట్టుకుంటున్నానని తెలిశాక కుటుంబసభ్యులు, సన్నిహితులు కూడా నన్ను ఎంతగానో ఎంకరేజ్ చేశారు.

ఎన్నో ఫ్యాషన్ దుస్తులుండగా చీరనే ఎందుకు ఎంచుకున్నానంటే, ఇటీవలకాలంలో చీరకట్టు మరుగున పడింది. చీర కట్టేవారి సంఖ్య తగ్గిపోయింది. భారతీయ సంస్కృతిని కాపాడటంతోపాటు, చీర మగువకు మాత్రమే సొంతంకాదని నిరూపించడానికే నేను చీరలు కట్టుకోవడం ప్రారంభించాను".

చీర అనగానే వర్మ ఒకేరకంగా కట్టుకుంటాడనుకుంటే పొరపాటు పడినట్లే. అనేక రకాల చీరకట్టుతో అద్భుతాలు సృష్టిస్తున్నాడు. 'అన్నిరకాల పద్ధతుల్లో మనం కూడా చీర అలా కట్టలేమేమో' అని మగువలు కూడా అనుకోకుండా ఉండలేరు. అంతలా చీర కట్టుతో అందరినీ ఆకర్షించిన వర్మ ఇప్పుడు 'శారీ మ్యాన్ ఆఫ్ ఇండియా'. అయితే ఈ క్రెడిట్ అంతా ఒక్కరోజులో వచ్చిందేమీ కాదంటాడతను.

"2006 నుంచి నేను చీరలు కట్టుకుంటున్నా. అప్పుడు నేను ఈవెంట్స్, ఆర్ట్ షోలు నిర్వహిస్తున్నప్పుడు వచ్చిన వారిని ఆకట్టుకోవడానికి చీరకట్టుకునేవాణ్ణి. అలా అప్పుడప్పుడు చీరకడుతూ క్రమంగా చీరకట్టుకే అలవాటు పడిపోయా. అలా శారీమ్యాన్‌గా నాకు పేరు వచ్చేసింది.

## వ్యత్యాసం తొలగించేందుకే

ఒక మగువ ధోతి కట్టుకుంటే ఎవరూ ఏమీ మాట్లాడరుగానీ, ఒక మగవాడు చీరకడితే మాత్రం ఏదో అయిపోయిందన్నట్లు చూస్తుంటారు. ఈ వ్యత్యాసం తొలగించేందుకే నేను చీరలు కట్టుకుంటున్నాను. ప్రస్తుతం ఢిల్లీ మొత్తంమీద చీరలు కట్టే ఏకైకవ్యక్తిని నేనే! చీర మన భారతీయ సంస్కృతిలో ఒక భాగం. సమకాలీన వాఙ్మయంలో చీరల పేర్లు పరిశీలిస్తే ఆనాటి హస్తకళా నైపుణ్యం తెలుస్తుంది. ఆకాశంలో దట్టమైన మేఘాల్లాగా ఉండే చీరను మేఘాంబర్ అని, హంసపాదాల వంటి చీరను హంసపాదుక అని పిలిచేవారు. మధ్యయుగంలో చీరలు ప్రసిద్ధి పొందాయి. ఆనాడు ఆస్మాన్‌తారా (ఆకాశాన నక్షత్రాలు) నీలాంబరి (నీలాకాశం), దూప్‌చాన్ (సూర్యకాంతి నీడ) చీరలు వ్యాప్తిలో ఉండేవి. ఆ కాలంలోనే ఠాకూర్ మహిళలు ఒకరకమైన చీరకట్టు కట్టేవారు. దాన్ని ఠాకూర్‌బారి డ్రాప్ అంటారు. ఆ చీరకట్టు

విధానం పార్శీ బాంబే మహిళల చీరకట్టును పోలి ఉంటుంది. అయితే 150 సంవత్సరాల క్రితం వరకు కూడా మగవారు ధోతి, చీర రెంటినీ ధరించేవారు. కాలక్రమేణా మార్పులవల్ల చీర కేవలం మగువలకు, ధోతి కేవలం పురుషులకు మాత్రమే అనే భావన స్థిరపడిపోయింది.

### దేశమంతటా శారీ ఫెస్టివల్స్

70 నుంచి 80 చీరల వరకు నాదగ్గర ఉన్నాయి. ఈవెంట్స్ చేస్తున్నప్పుడల్లా ఒక్కో చీర కొంటుంటాను. అలా నా చీరలసంఖ్య నా ఈవెంట్స్‌తో పాటే పెరుగుతూ ఉంటుంది. ఇప్పటివరకు దేశంలో చాలా చోట్ల శారీ ఫెస్టివల్స్ నిర్వహించాను. మొదటిసారి కొత్తలో నేను చీరలు కట్టుకున్నప్పుడు చామియా చీరలు, బ్లింగీ టైపు చీరలు, సిల్క్ చీరలు కట్టుకునేవాణ్ణి. కానీ ఇప్పుడు నా వయసు పెరుగుతూ ఉండడంతో నా వయసుకు తగినట్లు, నాకు నప్పే రంగుల చీరలు ఎంచుకుంటున్నాను. ప్రస్తుతం మెత్తటి చీరలు, హ్యాండ్‌లూమ్ చీరలు ఎక్కువగా కడుతున్నాను. నేను చీరలు ఎక్కువ కడుతూ ఉండడం వల్ల కొందరు నన్ను గౌరవంగా శారీమ్యాన్ అని పిలిస్తే, మరికొందరు ఎగతాళిగా పిలుస్తుంటారు. నేను పట్టించుకోను. చీర గొప్పతనం ప్రపంచానికి చాటిచెప్పడమే నా లక్ష్యం. నేను కేవలం చీరలు మాత్రమే కట్టుకుంటాననుకుంటే పొరపాటు. ధోతి కట్టుకుంటాను, కుర్తాపైజామా వేసుకుంటాను, వెస్ట్రన్ వేర్ ధరిస్తాను. కానీ అన్నింటికన్నా నాకు చీరలంటే ఎక్కువ ఇష్టం. డిఫరెంట్ స్టైల్ చీర కట్టుకుంటున్నప్పుడల్లా, నాకు నేనే ఒక కొత్త మనిషిలా కనిపిస్తాను.

ప్రస్తుతం నేను 'రెడ్ ఎర్త్' సంస్థ వ్యవస్థాపక మేనేజింగ్ డైరెక్టర్‌గా పనిచేస్తున్నాను. మరుగున పడుతున్న మన సంప్రదాయ విలువలు కాపాడుకోవాలన్న ధ్యేయంతో పనిచేస్తున్నదే మా రెడ్ ఎర్త్ సంస్థ. అదేవిధంగా, 'చీరలు ఎవ్వరైనా కట్టుకోవచ్చు' అనే ఉద్దేశం ప్రచారం చేయడానికి ప్రస్తుతం నా టీమ్‌తో కలిసి దేశమంతటా పలుచోట్ల శారీ ఫెస్టివల్స్ నిర్వహిస్తున్నాను. ఇప్పటివరకు 1100 శారీవాక్‌లు నిర్వహించాను. ప్రతి పనినీ బేరీజు వేసుకుంటే ఏ పనికి ముందుగా ప్రాధాన్యమివ్వాలి అనే అంశంపై నిరంతరం పోరాటం చేస్తూనే ఉంటాను.

### చీరలో రిచ్‌నెస్

ప్రతి రోజు నిద్ర లేవగానే ఈ పని నేను చేయగలనా లేదా అని ప్రశ్నించుకుంటాను. కానీ మరుక్షణమే నేను చేయగలను అనే ధీమా కలుగుతుంది. పైగా చీర కట్టుకోవాలి... భారతీయ సంప్రదాయం కాపాడాలి అని నేను నా వంతు ప్రయత్నంగా డిఫరెంట్‌గా ప్రమోట్ చేస్తున్నానని అనుకుంటాను. అలాగే ముందుకు సాగిపోతుంటాను కూడా. నా ఈ ప్రయత్నం నాతోనే ముగిసిపోకూడదని నా కోరిక. ఇకపోతే చీరనే ఎందుకు ధోతీని ప్రమోట్ చేయవచ్చు కదా అని కొందరు నన్ను అడుగుతుంటారు. కానీ ధోతీతో పోలిస్తే చీరలో రిచ్‌నెస్ కనిపిస్తుంది. దాన్ని రకరకాల పద్ధతుల్లో కట్టుకోవచ్చు. ధోతి విషయంలో అలా కట్టుకోలేం కాబట్టి నా ప్రమోషన్లో కేవలం చీరలకే స్థానం ఉంది. అయితే కేవలం చీరల ప్రమోషన్ మాత్రమేకాదు కొన్ని కొన్ని ట్రెడిషనల్ ఈవెంట్స్ కూడా మా సంస్థ చేపడుతోంది.

### చీరకట్టులో ఎన్నో రకాలు

చీర ఎటువంటి వాతావరణానికైనా అనువుగా ఉంటుంది. కులం, ప్రాంతాలవారీగా చీరకట్టుకు ఒక ప్రత్యేకశైలి ఉంది. ఉత్తరభారత స్త్రీలు పైటకొంగు ముందుకు వేసుకున్నా, దక్షిణభారత స్త్రీ వెనకకు వేసుకున్నా, గోచీలాకట్టినా ఆ చీరకట్టు ఆయాప్రాంతాలకు ప్రత్యేకం. చీరకట్టులో మొత్తం 80 వైవిధ్యాలు ఉన్నాయి. దాదాపు 109 రకాలుగా చీరను వైవిధ్యంగా ఎలా కట్టుకోవచ్చో అంతర్జాల (ఇంటర్నెట్) మాధ్యమంలో నిపుణులు నిక్షిప్తం చేశారు. ఇప్పటికీ ఇంకా చీరలు ఎలా కట్టుకోవచ్చనే విషయంపై పరిశోధనలు జరుగుతూ ఉన్నాయి. నార చీర మొదలు పట్టుచీర వరకూ దేని అందం దానిదే. దేని సోయగం దానిదే. అందుకే కొంతకాలంగా పాశ్చాత్య మోజులోపడి చీరకట్టు చేతకాదని చెప్పిన యువతులు చీరలే ఆధారంగా చేసుకుని ఫ్యాషన్ పెరేడ్‌లు నిర్వహిస్తున్నారు. ఇది శుభపరిణామమే అని చెప్పవచ్చు" అంటూ తన మనోభావాలు ఆవిష్కరించాడు హిమాన్షువర్మ.

—పుష్పలత



## జంబలకిడిపంబ

*ఆడవాళ్ల చీరలు, ఆభరణాలు ధరించి మగవారు చేసుకునే పండుగ గురించి మీరెప్పుడైనా విన్నారా? 'అదేం వింత పండుగ? జంబలకిడిపంబ సినిమాలో చూపించినట్లుగా ఉందే అనుకుంటున్నారా?' అవును, అక్కడికెళితే మీరు ఆశ్చర్యపోక తప్పదు. వేలాదిమంది మగవారు మగువల కాస్ట్యూమ్స్ ధరించి అమ్మవారికి పూజలు నిర్వహిస్తూ కనిపిస్తారు. ఆ పండుగ పేరు కొట్టాన్కులంగరా ఫెస్టివల్. వారు పూజించే అమ్మవారి పేరు కొట్టాన్కులంగరా దేవి. ఆమెనే భగవతి అమ్మవారు అని కూడా అంటారు. అమ్మవారు స్వయంభూ. విచిత్రమేమిటంటే ఈ అమ్మవారి గర్భగుడికి మాత్రం పైకప్పు ఉండదు. అలా పైకప్పు లేని గర్భగుడి కేరళ రాష్ట్రంలో ఇదొక్కటే. ఈగుడిలో స్త్రీపురుష సమానత్వం కనిపిస్తుంది. అమ్మవారు స్త్రీమూర్తి కాబట్టి ఇక్కడికి వచ్చే భక్తులు అమ్మవారి వేషధారణలోనే రావాలనేది నియమం. ఈ గుడి కేరళలోని కొల్లామ్‌లో ఉంది. ప్రతి సంవత్సరం మలయాళం మీనం మాసంలోని 11, 12 రోజుల్లో ఈ పండుగ జరుపుకుంటారు. ఈరోజున ఆ రాష్ట్రంలో నలుమూలల నుంచి భక్తులు వచ్చి భగవతి అమ్మవారిని దర్శించుకుంటారు. ఆడవారి వేషధారణ చేసుకుని మంగళహారతులు పట్టుకుని పూజిస్తారు. ఈ పండుగనే చామాయవిలక్కు అని పిలుస్తారు. ఈ గుడిలోకి కేవలం ఉత్సవాల సమయంలోనే కాక మామూలుగా వెళ్లినప్పుడు కూడా అమ్మవారి జ్యోతిని పట్టుకోవాలంటే మగవారు మహిళల వేషధారణ చేసుకోవడం తప్పనిసరి.*

## ఆ'కట్టు'కోండి!

*చీరలో ఎంతో నిండుదనం ఉంది. చీరకున్న అందం, శృంగారభావన మరే దుస్తుల్లోనూ ఉండదు. చీర అంటే ఒక హుందాతనం. ఒక ఆకర్షణ. అంతేకాదండోయ్ మగమహారాజులను ఆకట్టుకోవాలంటే చీరకట్టాల్సిందే. రకరకాల దుస్తులకన్నా చీరలే శృంగార భావాలను రేకెత్తిస్తాయట. పైగా ట్రెడిషనల్‌గానూ, సందర్భానికి అనుగుణంగా ఉంటాయి.*



# వరాలు

-మల్యాల రత్నమాల

**వీరినాయుడు బోనులో నిలబడి ఉన్నాడు. యాభైకి పైబడిన వయసు. తెల్లచొక్కా, తెల్లపంచె, ముఖంలో మూర్తీభవించిన మంచితనం. నుదుటిమీద పెట్టిన నిలువు బొట్టు అతని ఆధ్యాత్మికతకు ప్రతీకలా నిలిచింది. అతని కళ్ళు నిశ్చలంగా ఉన్నాయి. ఆ కళ్ళలో ఏ భావమూ ద్యోతకం కావడం లేదు. నిలబడి తపస్సు చేస్తున్న మహర్షిలా ఉన్నాడతను. కోర్టు నిశ్శబ్దంగా ఉంది.**

"ఒక వ్యక్తిని నువ్వు దారుణంగా నరికి చంపావు. అందుకు నీకు కఠినశిక్ష విధించాల్సి ఉంటుంది. నీ తరపున వాదించేవాళ్ళు ఎవరైనా ఉన్నారా?" జడ్జి గంభీరమైన గొంతు కోర్టులో ప్రతిధ్వనించింది.

తల అడ్డంగా ఊపాడు వీరినాయుడు.

జడ్జి ఒక నిముషం మౌనంగా ఉండిపోయాడు.

"పోనీ నువ్వు చెప్పాల్సింది ఏదైనా ఉందా?"

"ఉంది" దృఢంగా అన్నాడు వీరినాయుడు.

***

సాయంత్రం ఆరవుతోంది.

నిశ్శబ్దమైన ప్రకృతిలో నిమ్మకునీరెత్తినట్టు తాపీగా నడుస్తున్న బళ్ళ ఎద్దులమెళ్ళో గంటలగణగణలు శ్రావ్యంగా వినిపిస్తున్నాయి. ఏతాముల కిర్రుధ్వని మాధుర్యం గాలితో లయబద్ధంగా శృతికలిపి చెవులకి ఇంపుగా సోకుతోంది. స్పృశించిపోయిన చిరుగాలి స్పర్శకి పరవశించి తన్మయత్వంతో ఊగిసలాడుతున్న పచ్చటిపైర్లు సోయగాల్ని వెదజల్లుతున్నాయి. గాలికి అలవోకగా ఎగిరే పైటలని ఎడంచేత్తో ఒంటికి అదుముకుంటూ కుడిచేత్తో నెత్తిమీద కుండ అంచు పట్టుకుని శృంగారం ఒలకబోస్తూ లయబద్ధంగా పాడుతున్న పల్లెపడుచులు ఏటిగట్లమీద వరుసలుతీరి నడుస్తూ ఇంటికిచేరే ఆత్రంలో ఉన్నారు. చెరువునీళ్ళలో ఈతలుకొడుతూ అల్లరిచేస్తూ ఆనందించే కుర్రాళ్ళ కేకలు దూరాన ఉన్న సముద్రఘోషలా లీలగా వినబడుతున్నాయి.

శ్రీరంగనాథుని కోవెలలో గంటలశబ్దం గాలిలో మంద్రంగా కలిసిపోయి భగవంతుని దగ్గరనుండి వస్తున్న పాటలా వినబడుతోంది.

'ఎంత అందంగా ఉంది ఊరు!' అనుకున్నాడు వీరినాయుడు. అతని జీవితంలో అదృష్టాలు రెండే రెండు. ఒకటి ఊరు, రెండోది వరాలు.

"ఏడకి పోయిందబ్బా ఇది?" అనుకున్నాడు వీరినాయుడు. అలా అనుకోవడం గడచినగంటలో ఏ వందోసారో. వీరినాయుడికి మనసు మనసులో లేదు.





ఆరేళ్ళ పసిది ఈ సమయంలో ఎక్కడికి పోయుంటుంది? ఎదురుగా కుంటిఎర్రన్న కనిపించాడు.

"ఒరే ఎర్రన్నా" పిలిచాడు వీరినాయుడు.

"ఏటి బాబూ" చేతులు కట్టుకుని దగ్గరకు వచ్చాడు ఎర్రన్న.

"మా చంటిదేడైనా కనిపించిందిరా".

"నేదుబాబూ" వాడు వినయంగా వీరినాయుడి అనుమతి కోసం నిలుచున్నాడు.

"సరే నువ్వు పోరా" 'ఏడకి పోయుంటుందో ఇది' మరోసారి అనుకున్నాడు వీరినాయుడు.

అలా ఒక అర్ధగంట అక్కడే నిలుచున్నాడు వీరినాయుడు. అతని మనసు చాలా ఆందోళనగా ఉంది.

"భగవంతుడా, నా పాపకేం కాకూడదు".

ఇంతలో దూరంగా చాకలి రాములమ్మ పాప నెత్తుకుని రావడం కనిపించింది వీరినాయుడికి. రాములమ్మ కొంచెం దగ్గరకు వచ్చి పాపని కిందకు దింపింది. గులాబీరంగు పట్టుపావడ తన రెండు చేతుల్తో ఎత్తి పట్టుకుని, రెండు పిలకజడలతో, ముఖంనిండా వెన్నెల లాంటి ఆనందం పులుముకుని, వరలక్ష్మి వీరినాయుడు దగ్గరకి పరుగెత్తుకొచ్చింది.

వీరినాయుడికి ఒక్కక్షణం కోపం వచ్చింది. కాని సంబాళించుకున్నాడు. రాములమ్మ దగ్గరకి వచ్చింది. "అయ్యా బాగున్నారా బాబూ, పాప పొలం గట్టమ్మట వెళుతుంటే ఆపాను బాబూ. ఇంటికి రానంటుందే, చివరికి ఎలుగుబంటిని చూపించే దాకా రాందే. దాన్ని చూపించి నాతో బాటే తీసుకొత్తన్నానయ్యా".

"ఎలుగుబంటేమిటి" అసహనంగా కూతుర్ని అడిగాడు వీరినాయుడు.

"మరేనాన్నా ఓబులేసు, కనకం ఈరోజు చెప్పారు నాన్నా, పట్నంనించి ఎవరో ఎలుగుబంటిని తీసుకొచ్చారని. దాన్ని చూడ్డానికి వెళ్ళాను నాన్నా. నాన్నా ఎలుగుబంటి ఎంత బాగుందనుకున్నావ్, చాలాపెద్దది నాన్నా. దాని కళ్ళు చూస్తే భయం వేసింది నాన్నా" ముద్దుముద్దు మాటలతో ఎలుగుబంటిని వర్ణిస్తున్న వరలక్ష్మిని ఎత్తుకుని గుండెలకు హత్తుకున్నాడు వీరినాయుడు. అతని మనసు దూదిపింజలా అయిపోయింది.

"సరే రాములమ్మా, పిల్లలకేమైనా కొనుక్కో" అని ఓ పదిరూపాయలు ఇచ్చి, వరలక్ష్మిని ఎత్తుకుని ఇంటివైపు నడిచాడు వీరినాయుడు.

వరలక్ష్మిని వీరినాయుడు ఎప్పుడూ ఒక్కక్షణం విడిచి ఉండేవాడు కాదు. వరాలూ అని పిలిచేవాడు. కూతురు తనకి దేముడిచ్చిన వరం. ఆ నమ్మకం వీరినాయుడు మనసులో బలంగా నాటుకుపోయింది.

పదేళ్ళొచ్చేవరకూ వరలక్ష్మి వీరినాయుడి గుండెల మీదే నిద్రపోయేది. ఆమె నిద్రపోయేవరకూ కూతురు పాదాలు మెల్లిగా ఒత్తుతుండేవాడు వీరినాయుడు.

"ఏటి దాన్నలా నెత్తినెక్కించుకుంటన్నావ్? రేపు పెళ్ళయ్యాక అది కాపరం చెయ్యాలా వద్దా" భార్య మందలించేది వీరినాయుడిని.

"సర్లేవే, ఇది మాలచ్చిమి, దీనికెవడైనా కష్టాలు కలిగించగలడా, అయినా నా కూతుర్ని నేను ముద్దుసేస్తే నీకేటంట?" వీరినాయుడు ఎదురుతిరిగేవాడు. భార్య చేసేదేంలేక ఊరుకునేది.

వరలక్ష్మి స్కూల్లో చేసే అల్లరి అంతాఇంతా కాదు. అందర్నీ కొట్టడం, స్నేహితులతో కలిసి తోటల్లోకి జొరబడడం, చెట్లెక్కి కాయలు కోసెయ్యడం. బొద్దుగా ముద్దుగా ఉన్న వరలక్ష్మిని ఎవ్వరూ ఏమనేవారు కాదు. ఎవరైనా "అయ్యా మా కాయలు కోసేస్తోందయ్యా గుంపుతో వచ్చి" అని ఫిర్యాదుచేస్తే, వీరినాయుడు వాళ్ళచేతుల్లో ఓ రెండు వంద రూపాయల నోట్లు పెట్టి పంపేసేవాడు. ఆ తర్వాత 'వరాలూ' అని గావుకేక పెట్టడం, వరలక్ష్మి భయం భయంగా వీరినాయుడి దగ్గరికి చప్పుడు చెయ్యకుండా రావడం, కోపంగా వీరినాయుడు చెయ్యెత్తడం, మరుక్షణం నవ్వేసి వరాల్ని ఎత్తుకుని బుగ్గమీద ముద్దుపెట్టి దింపెయ్యడం అన్నీ షరా మామూలే.

"ఇట్లా అయితే అది బాగుపడదయ్యా, ఆడపిల్లకి ఓ ఒద్దికా పొందికా నేర్పాలిగాని ఇదేటయ్యా నీ పద్ధతి నాకేం నచ్చలేదు" అని భార్య సతాయిస్తే "పోన్లేవే రేపొద్దున్న అత్తారింటికెళ్ళాక ఒద్దికగా ఉంటాది లేయే" అని పెళ్ళాం మాటని తీసి పారేసేవాడు. వీరినాయుడు ఆరోప్రాణం వరాలు. ఆశ్చర్యమేమిటంటే అంత అల్లరిచేసే వరలక్ష్మి టెన్త్‌క్లాస్ ఫస్టులో పాసవ్వడం. అయితే వరలక్ష్మి అలా పాసవడం వీరినాయుడికి కష్టాలు తెచ్చి పెట్టింది. కాలేజీలో చేరతానని వరలక్ష్మి మంకుపట్టు పట్టింది. కూతుర్ని పట్నంలో దూరంగా చదివించడం వీరినాయుడికి ఇష్టంలేదు. అంతకన్నాముందు వరాల్ని వదిలి ఉండడం అసలు ఇష్టం లేదు.

"అయితే దాన్ని ఇంక సదువుకోనివ్వవా? పెళ్ళిసేసేదాక ఇంట్లోనే కూకోబెడతావా" భార్యప్రశ్నకి వీరినాయుడు దగ్గర జవాబులేదు. వరాలుని దూరంగా పంపించెయ్యాలన్న ఊహ మనసులో మెదిలితే చాలు, అతని మనసంతా పాడైపోయేది. అన్నం సరిగ్గా సహించేది కాదు. ఇరవై రోజులు గడిచేసరికి మనిషి బక్కచిక్కిపోయాడు.

ఓ రోజు వీరినాయుడికి అన్నంపెట్టి పక్కన కూర్చుంది భార్య సత్యవతి, వరలక్ష్మి ఇంట్లో లేనప్పుడు.

"సూడు, నువ్వొక్కడివే పిల్లదాన్ని కన్నట్టు అట్లా

అయిపోతే ఎట్టా? మునసబు కూతురూ, కరణం కూతురూ, పట్నంవెళ్ళి సదువుకోలే? పెళ్ళిళ్ళు సేసుకుని అత్తారింటికి వెళ్ళిపోలే? ఇదీ అట్టాగే. ఆడపిల్లన్నాక చదువూ తప్పదు, పెళ్ళీ తప్పదు, పెళ్ళయ్యాక మనల్ని వదిలి పోకా తప్పదు. నువ్వు దిగులుపడమాక, దాన్ని పట్నంవెళ్ళి సదవనీ".

కాలేజీలో చేరే ముందరే వరలక్ష్మి పెద్దమనిషైంది. వీరినాయుడు చాలామందిని పిలిచి పండగ ఘనంగా జరిపించాడు. అందరికీ భోజనాలుపెట్టి బట్టలు చదివించాడు. అంతా వెళ్ళిపోయింతర్వాత రాత్రి పదిగంటలకి గదిలో ఒక్కడే కూర్చున్న వీరినాయుడి దగ్గరికి సత్యవతి వచ్చింది.

"ఏటయ్యా, మల్లా అదెల్లిపోతుందని గుబులు పడతావుండవా? నువ్వు ఈరోజైనా సానా సంతోసంగా ఉన్నావనుకున్నాను. కళ్ళల్లో ఆ కన్నీళ్లేంటి" సత్యవతి గదమాయించి అడిగింది.

వీరినాయుడు ఒక్కనిమిషం భార్య ముఖంలోకి తదేకంగా చూసి అన్నాడు, "ఎంతందంగా ఉందే ఈ రోజు వరాలు... ఆ పట్టు పరికిణీ, ఆ ఓణీలో అది అచ్చం దేవతలా ఉంది కదే. అది పట్నం వెళ్ళిపోతే మనం ఈడ ఉండగలమంటావా?"

***

ఎలా అయితేనేం వీరినాయుడు వరలక్ష్మిని పట్నం కాలేజీలో చేర్పించాడు. అక్కడ తెలిసినవాళ్ళు ఎవరూ లేకపోవడంతో హాస్టల్లోనే ఉంచాల్సి వచ్చింది వరలక్ష్మిని. పట్నంనించి వచ్చిన వీరినాయుడిని చూసి సత్యవతి గాభరా పడింది. లోతుకిపోయిన కళ్ళు, చెరిగిపోయిన జుత్తు, దుమ్ముకొట్టుకుపోయిన గుడ్డలూ. అందరినీ ఎప్పుడూ నవ్వుతూ పలకరించే వీరినాయుడు ఆ తర్వాత మౌనంగా ఉండసాగాడు. ఎక్కువగా బయటకు వెళ్ళడం మానేశాడు.

ఇరవైరోజులు గడిచాయి. ఒకరోజు వరలక్ష్మి దగ్గర నించి వీరినాయుడికి ఫోను వచ్చింది.

"అయ్యా నేను ఈ కాలేజీలో ఇంక చదవనయ్యా. నాకు చదువొద్దయ్యా, నన్నొచ్చి తీసుకెళ్ళిపో" ఫోనులో వరాలు గొంతుక వణుకుతున్నట్టు గ్రహించాడు వీరినాయుడు.

## కనకాభిషేకం

"విశాఖపట్నంలో పురిపండా అప్పలస్వామి గారి పూనికతో, 1956 ఏప్రిల్ 25న శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి 'కనకాభిషేకం' జరిగింది. తెన్నేటి విశ్వనాథంగారు ఆనాటి సభకు అధ్యక్షులు. తెలుగు సాహిత్య రంగంలో కథా రచయితగా కనకాభిషేక గౌరవం పొందినవారు శ్రీపాద ఒక్కరే.



1961 ఫిబ్రవరి 25న కన్నుమూశారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు.

సేకరణ: ఎన్.తారకరామారావు

"ఇదేమిటి, పట్నం చదువుకోసం అంత యాగీ చేసి మొన్న వెళ్ళినపిల్ల, ఈయాళ వచ్చేస్తానంటది, దీనికేమైనా పిచ్చిపట్టిందా? 'అయితే వరాలు మళ్ళీ వచ్చేస్తున్నందుకు అతని మనసులో సంతోషం కూడా లేకపోలేదు. వెంటనే పట్నం బయలుదేరాడు వీరినాయుడు.

సుమారు పదిగంటలకి కాలేజీదగ్గరకి చేరుకున్న వీరినాయుడికి కనిపించిన దృశ్యం ఏమిటి?

'తన చేతుల్లో పెరిగిన వరాలు, తన గుండెల మీద పదేళ్ళవరకూ నిద్దరోయిన వరాలు, ఎవరింటిలోనో దీపం వెలిగిస్తుందనుకున్న వరాలు, కీచకుల్లా ప్రవర్తిస్తున్న ఆరుగురు పందికొక్కుల్లాంటి కుర్రాళ్ళ చేతుల్లో గింజుకుంటూ, తననతాను కాపాడుకోవడానికి అటూఇటూ పరుగెడుతూ, వాళ్ళచేతులకు అందకుండా తప్పించుకుంటూ... ఏమిటిది?'

బితుకు బితుకుమంటూ చూస్తూ చుట్టూరా దూరంగా నిలబడ్డ కాలేజీ స్టూడెంట్లు.

"ఒరే, ఈరోజు ఇది మనకు ముద్దులిస్తుందిరా" ఆ ఆరుగురిలో ఒకడన్నాడు వరలక్ష్మి నడుంచుట్టూ చెయ్యివేస్తూ. "అరే మొదటి ముద్దు నాదిరా" బలంగా దున్నపోతులా ఉన్న ఇంకొకడన్నాడు.

వీరినాయుడి రక్తం కుతకుత ఉడికిపోయింది. కళ్ళు చింతనిప్పులయ్యాయి. చుట్టూచూశాడు, కొంత దూరంలో తుప్పుపట్టిన నాలుగడుగుల ఇనపపైపు కనిపించింది. దాన్ని చేతులోకి తీసుకుని వరలక్ష్మి నడుంచుట్టూ చెయ్యివేసి దగ్గరకు లాక్కుందామని ప్రయత్నిస్తున్న వాడి చెయ్యిమీద బలంగా ఒక్క వేటు వేశాడు. వాడి చెయ్యి విరిగిపోయింది.

"బాబోయ్, లగెత్తండిరా ఎవడో వచ్చిండు" ఒకడు అరిచాడు. కుర్రాళ్ళంతా పరుగుతీశారు. అందులో మొదటిముద్దు కావాలన్నవాడి జుట్టు పట్టుకుని వెనక్కిలాగాడు. పైపు ఎత్తి వాడి మోకాలుకింద బలంగా వేటువేశాడు. ఆ దెబ్బకి వాడికాలు విరిగింది. వాడూ కిందపడిపోయాడు. ఇంకోఇద్దరిని దొరకపుచ్చుకుందామనుకునే లోపు వాళ్ళు దూరం పారిపోయారు.

చుట్టూ ఉన్నవారిలో నిశ్శబ్దం అలుముకుంది. వరలక్ష్మి ఒక పక్కగా నిలబడి కొంగు నోట్లో కుక్కుకుని ఏడుస్తోంది. అక్కడ జరిగినదానికి సాక్ష్యంగా బాధతో విలవిల్లాడుతూ స్పృహతప్పిన ఇద్దరు కుర్రాళ్ళు పడి ఉన్నారు. వీరినాయుడు వాళ్ళని కాలితో తన్ని వరలక్ష్మి దగ్గరకువచ్చి కొంగుని ఆమె మెడ చుట్టూ కప్పాడు. చుట్టూ కొయ్యల్లా నిలబడి ఉన్న జనాన్ని చూసి కాండ్రించి ఉమ్మేశాడు.

"ఏం మనుషుల్రామీరు? దున్నపోతులు కలిసి ఒక లేగదూడని కుమ్ముతుంటే ఆపలేర్రా? మీరూ మనుషులేనా? ఆరుమంది గూండాలు ఒక ఆడదాన్ని అల్లరి చేస్తుంటే, వందమంది ఎదవలు ఆళ్ళంత బలంగానూ ఉన్న మీరు ఏం సేస్తున్నార్రా? ఏం చూస్తున్నార్రా? మీలాంటి సచ్చెదవలు ఉన్న ఈ కాలేజీలో నా కూతుర్ని సేర్పించడమే నేను చేసినతప్పు. ఛీ... మీ బతుకులు చెడ! వరలక్ష్మిని తీసుకుని వెళ్ళిపోయాడు వీరినాయుడు. అంతవరకూ బిగపట్టుకుని ఉన్న అక్కడి జనంలో చైతన్యం మొదలైంది.

**అతడి గారాలపట్టి ఆ చిట్టితల్లి. ఒక్కక్షణం కూతుర్ని విడిచి ఉండేవాడు కాదు. తన చిట్టితల్లిని దేవుడిచ్చిన వరంగా భావించాడు. భార్య మందలించినా ముద్దు చేయడం మానలేదతను. ఫస్టుక్లాసులో పాసైన కూతురు మంకుపట్టు పట్టింది. చేసేదిలేక పట్నం కాలేజీలో చేర్చాడు. కూతురుకోసం కాలేజీకి వెళ్ళిన ఆ తండ్రికి అక్కడ ఎలాంటి దృశ్యం కనిపించింది? అప్పుడతను ఎలా రియాక్టయ్యాడు?**

ఆ ఊర్లో కాలేజీ స్టూడెంట్లంతా మర్నాటినించి రోడ్లమీద పడ్డారు. 'ఆడపిల్లలమీద అరాచకాలు అరికట్టాలి. వాళ్ళకి రక్షణ కల్పించాలి' అని రాసి ఉన్న పెద్దపెద్ద ప్లకార్డులు పట్టుకుని రోడ్లమీద ఊరేగింపులు జరిపారు. బస్సుల్ని ఆపేశారు. పోలీసు బారికేడ్లు ధ్వంసం చేశారు. లాఠీదెబ్బలు తిన్నారు. రోజూ వచ్చే వార్తలు దుమారం సృష్టించాయి. ఆ ఊరి రాజకీయాల్లో పోలీసు, న్యాయ వ్యవస్థల్లో చలనం కలిగింది. కాలేజీలదగ్గర అమ్మాయిలకు భద్రత కలిగించాలని పోలీసు వ్యవస్థ నిర్ణయించింది. ఈవ్‌టీజర్లకు కఠినశిక్షలు విధించాలని న్యాయవాదులు ముక్తకంఠంతో ఘోషించారు. వ్యవస్థ అట్టే మారడం ఇష్టంలేని రాజకీయనాయకులు మాత్రం 'ప్రజల మనసుల్లో మార్పురావాలని, ప్రజల ఉద్రేకం తగ్గించాలనీ ప్రయత్నించారు.

అయితే ఇక్కడ ఎవరికీ అర్థంకాని విషయం ఒకటుంది. 'ఆడపిల్లలకి అన్యాయం జరక్కుండా ఎవరు కాపాడాలి? వరలక్ష్మికి అన్యాయం జరుగుతున్నపుడు చుట్టూరా నిలబడిచూస్తున్న విద్యార్థులకు ఆ బాధ్యత లేదా? తమ కళ్ళెదుట అన్యాయం జరుగు తుంటే శక్తి ఉండీ ప్రతిఘటించని వాళ్ళు అన్యాయాలు అరికట్టమని ఇంకెవరినో యాచించడం సమంజసమేనా?

వరలక్ష్మి ఆరుగురుతో పెనుగులాడుతున్నపుడు వాళ్ళకి ఆవేశం రాలేదా? వచ్చినా భయంవల్ల ఆ ఆవేశం చప్పబడిపోయిందా? ఈ భయాలు ఉన్నంతకాలం ఇలాంటి అకృత్యాలు జరుగుతాయని వాళ్ళకి తెలియదా? తెలిస్తే వాళ్ళు ఎందుకు ముందుకురాలేదు? ఈ స్తబ్ధత, ఈ భయం, ఈ నీరసం వ్యక్తుల్లో ఉన్నంతకాలం ఈ సమాజాన్ని ఎవరు బాగు పరుస్తారు? వ్యవస్థ చెడిపోయిందని తెలిసి కూడా ఆ వ్యవస్థనే రక్షణ కల్పించమని రోడ్డు మీదపడ్డ ఈ యువతవల్ల ఏదైనా ప్రయోజనం కలుగుతుందా? అసలు ఆ నమ్మకం వాళ్ళకుందా? ఇవన్నీ జవాబులేని ప్రశ్నలు.

నాలుగురోజుల్లో యువత ఆవేశం చల్లబడిపోయింది. మళ్ళీ పరిస్థితి యథావిధిగా తయారైంది. అయితే ఇప్పుడు కాలేజీలదగ్గర మునుపు జరిగినంత ఈవ్‌టీజింగ్ లేదు. విద్యార్థుల ఆందోళన

# సోనమ్‌ను వద్దన్న తండ్రి?

**బా**లీవుడ్ హీరోయిన్ సోనమ్ కపూర్ త్వరలోనే ఓ తెలుగు సినిమాలో కనిపించనుంది అన్న వార్తలు కొంతకాలం క్రితం వరకూ బాగా హల్‌చల్ చేశాయి. అయితే ఈ సినిమాను సోనమ్ చేయనంది అంటున్న వార్త బాలీవుడ్‌లో వినిపిస్తోంది. తెలుగులో 'సాహో' సినిమా కోసం మొదట్లో సోనమ్ కపూర్‌ను సంప్రదించారు. ఆమె ఓకే అనడంతో స్క్రిప్ట్ కూడా ఆమెకు ఇచ్చారు. మధ్యలో ఏమైందో ఏమో కానీ దర్శకనిర్మాతలను పిలిచి ఆ స్క్రిప్ట్ వెనక్కి ఇచ్చేసిందట! కాకపోతే రెమ్యునరేషన్ దగ్గర తేడా వచ్చిందా? లేకపోతే కథనచ్చలేదా? అన్నది అర్థం కావడం లేదంటున్నారు. దీని వెనుక సోనమ్ తండ్రి అనిల్‌కపూర్ హస్తం ఉంది అంటున్నారు. సాధారణంగా సోనమ్ కపూర్ సినిమాల విషయంలో అనిల్‌కపూర్ కల్పించుకోడనీ, కాకపోతే మొదటిసారిగా కూతురు దక్షిణాది సినిమా ఒప్పుకోవడంతో కథ విని ఆ తరువాత వద్దన్నాడని అంటున్నారు. ఈ విషయంలో సోనమ్ ఎలాంటి స్పష్టత ఇవ్వకపోవడంతో ఎవరికితోచిన కథలు వారు వండేసుకుంటున్నారు.



వల్లగానీ, ప్రభుత్వం తీసుకున్న చర్యలవల్లగానీ కాదు. కాళ్ళూ చేతులూ విరగ్గొట్టే తండ్రులు వస్తారేమోనన్న భయంవల్ల.

వీరినాయుడికి ఒక ఏడాది జైలుశిక్ష పడింది. వరలక్ష్మి చదువు మానేసి తల్లిదగ్గర పల్లెలో ఉండిపోయింది. ఉద్రేకపూరితంగా చేసిన నేరం కాబట్టి శిక్ష తగ్గిస్తున్నా అన్నాడు జడ్జి. అసలు కారణం అది కాదు. ఆడవాళ్ళమీద జరిగే అకృత్యాలకి అట్టుడుకి పోతోంది సంఘం. ఆ విషయం జడ్జికీ తెలుసు. వీరినాయుడు చేసినపనికి దాదాపు అందరూ హర్షం వెలిబుచ్చారు ఆ సమయంలో. ఏదిఏమైనా వరలక్ష్మి చదువు ఆగిపోయింది. ఎప్పుడూ ఎవరికీ అపకారం తలపెట్టని వీరినాయుడు జైలుపాలయ్యాడు.

***

ఏడాది గిర్రున తిరిగిపోయింది. వీరినాయుడు జైలునుంచి తిరిగి వచ్చాడు. తండ్రి గుండెలమీద వాలి వరలక్ష్మి వెక్కివెక్కి ఏడ్చింది. వీరినాయుడికి కళ్ళమ్మట నీళ్ళు వచ్చాయి. మరోఏడాది గడిచేసరికి వీరినాయుడు మళ్ళీ మామూలు మనిషి అయ్యాడు. పొలం పనులూ ఊరి పనులూ అన్నీ మళ్ళీ చూసుకోసాగాడు. అతనికి ఆ ఊళ్ళో మంచిపేరు, పలుకుబడి ఉంది. అసలు వీరినాయుడిని జైల్లో పెట్టినప్పుడే ఊరు ఊరంతా ఒకరోజు సమ్మె చేసింది. వరలక్ష్మి ఇంక చదువుకోనని చెప్పేసింది.

***

"అమ్మాయికి పెళ్ళి చెయ్యాల, సంబంధం చూడొద్దా మరి? వీరినాయుడిని అడిగింది సత్యవతి. వీరినాయుడి గుండెల్లో రాయిపడింది. అంటే తన వరాలు ఎల్లకాలం తనదగ్గర ఉండదన్నమాటేగా?

"అవునే మర్చిపోయాను. వరాలు కూడా అనుకుంటోందా ఈ మాట?"

"బాగుందయ్యా, ఆడపిల్ల సిగ్గిడిచి చెప్తాదా మనకి? మనమే తెలుసుకుని చెయ్యాల".

"సర్లే రేపటినించీ ఆ పనిమీదే ఉంటాను" భారంగా లేచాడు వీరినాయుడు.

***

వరలక్ష్మికి సంబంధం కుదిరింది. కుర్రాడు అమెరికానించి వచ్చాడు. పేరు సునంద్. పెళ్ళి చేసుకుని భార్యతో సహ ఇరవైరోజుల్లో అమెరికా వెళ్ళిపోవాలి. కుర్రాడు చూడ్డానికి బాగున్నాడు. చదువుకూడా బాగుంది. అమెరికాలో పనిచేసే కంపెనీ పేరు ఏదో చెప్పాడు. అతనిది కూడా వీరినాయుడు కులమే అని చెప్పాడు.

"అంకుల్, నాకు పల్లెటూరు అమ్మాయి కావాలి. చదువులేకపోయినా పరవాలేదు. అందంగా ఉంటే చాలు".

వరలక్ష్మికి కూడా అతని భావాలు నచ్చాయి.

"మీ అమ్మా నాన్నా ఎక్కడ ఉన్నారు?" అడిగాడు వీరినాయుడు.

"మా నాన్న లేరంకుల్. నాకు పదేళ్ళప్పుడే పోయారు. మా అమ్మగారు ప్రస్తుతం విశాఖపట్నం దగ్గర గ్రామంలో ఉన్నారు. ఏదో గ్రామం పేరు చెప్పాడు. అక్కడ మా ఆస్తీ ఇల్లూ చూసుకుంటూ ఉంది. నేనొక్కడినే మా ఫామిలీలో. నెక్స్ట్ టైమ్ వచ్చినప్పుడు మా అమ్మగార్ని కూడా అమెరికా తీసుకెళ్ళిపోదామనుకుంటున్నాను" అన్నాడు.

"కనీసం మేము ఈ పెళ్ళి గురించి మీ అమ్మగారితోనైనా మాట్లాడాలిగా" సందేహంగా అడిగాడు వీరినాయుడు.

"ఓ యస్, అలాగే మాట్లాడండి. మా అమ్మని తీసుకుని వస్తాను. మా అమ్మతో మాట్లాడాకే పెళ్ళి జరిపించండి" సునంద్ వెళ్ళిపోయాడు.

మూడురోజుల తర్వాత సునంద్ వాళ్ళమ్మని తీసుకు వచ్చాడు.

ఆవిడకి యాభైఏళ్ళు పైనే. జుట్టు బాగా నెరసిపోయి వెండి రంగుతో తళతళ లాడుతోంది. ఆమె ఎవరితోనూ ఎక్కువ మాట్లాడడం లేదు. ప్రతి మాటకీ తలూపుతుంది. అంతే. సత్యవతికి సంతోషంగా ఉంది. కుర్రాడు ఆరోగ్యంగా ఉన్నాడు. డబ్బు సంపాదిస్తున్నాడు. అత్తా, ఆడబడుచుల పోరు ఉండదు.

వీరినాయుడికి మాత్రం ఈ సంబంధం అంతగా ఇష్టం లేదు. అసలు వాళ్ళ కుటుంబాన్ని చూడకుండా పెళ్ళేమిటి? అయితే చివరికి వీరినాయుడి మాటకి విలువలేకుండా అయిపోయింది. భార్యా, కూతురూ పట్టుబట్టడంతో వరలక్ష్మి పెళ్ళి జరిగిపోయింది.

కూతురు టికెట్టుకూ, ఖర్చులకీ అన్నిటికీ కలిపి సుమారు పదిలక్షలు సొమ్ము సునంద్ చేతిలో పెట్టాడు వీరినాయుడు. అమెరికాలో దుస్తులు కొనుక్కుంటుందని మరో మూడులక్షలు వరలక్ష్మికి ఇచ్చాడు. పెళ్ళి జరిగిన మర్నాడే సునంద్‌తల్లి ఊరికి వెళ్ళిపోయింది. కొడుకూ కోడలూ అమెరికా వెళ్ళేవరకూ ఉండమన్నా ఉండలేదు. వరలక్ష్మి అమెరికా వెళ్ళిపోయింది.

మూడునెలలు కూతురు దగ్గరనుంచి ఫోను రాలేదు. ఒకటిరెండు సార్లు ఆఫీసునించి సునందే మాట్లాడాడు. "అంకుల్, మీరేం గాభరాపడకండి, ఇక్కడ వరలక్ష్మికి తెలుగువాళ్ళు బోలెడంతమంది ఫ్రెండ్స్ అయ్యారు. వాళ్ళతో బిజీగా ఉంది. ఇంకోటేమిటంటే మా ఇంటి ఫోను ఇంకా రాలేదు" వీరినాయుడు మనసుని సరిపెట్టుకున్నాడు.

ఆ తర్వాత ఒకరోజు వీరినాయుడికి అమెరికా నుండి ఫోనొచ్చింది. ఫోన్లో వరలక్ష్మి ఏడుస్తోంది.

"మనం మోసపోయాం అయ్యా, ఇతనికి ఇంతకు ముందే పెళ్ళయిందయ్యా, ఒక కూతురు కూడా ఉందయ్యా. మొదటిభార్యని వేరే దేశంనించి తెచ్చుకున్నాడయ్యా. నన్ను కేవలం పనిమనిషిలా తెచ్చుకున్నాడయ్యా. ఆవేళ వచ్చింది వాళ్ళమ్మ కాదయ్యా, నాటకమాడాడు" వెక్కివెక్కి ఏడుస్తూ మాటలు కొన్ని మింగేస్తూ చెప్పింది వరలక్ష్మి.

"నేనొచ్చిన రెండునెలలూ అతని మొదటిభార్య లేదయ్యా. అప్పుడు నన్ను చాలా ప్రేమిస్తున్నట్లు నాటకమాడాడయ్యా. ఆమె వచ్చిందగ్గర్నించీ నా పరిస్థితి అధ్వానమైపోయిందయ్యా. నేను పొద్దుట్నుంచీ రాత్రివరకూ వాళ్ళకి చాకిరీ చెయ్యాలయ్యా, వేరేగదిలో పడుకోవాలయ్యా, కాదంటే ఆమె దెబ్బలు కొడుతుందయ్యా" ఆ మాటలు వింటున్న

వీరినాయుడి రక్తం సలసల మరిగిపోయింది.

"ఇప్పుడు వాళ్ళు ఐదు రోజులు ఎక్కడికో వెళ్ళారయ్యా, ఇంట్లో నన్నుంచి బయట తాళంపెట్టి. 'నీకు కావలసినవన్నీ ఇంట్లోనే ఉన్నాయి, మేము వచ్చేవరకూ ఎక్కడికీ వెళ్ళకు, వెళ్ళేవంటే నిన్ను పోలీసులు అరెస్టు చేస్తారు. వీధిలో రౌడీలు నిన్ను రేప్ చేసి చంపేస్తారు' అని బెదిరించి వెళ్లారయ్యా. నేనెలాగో తప్పించుకుని ఇంకో తెలుగువాళ్ళ సాయంతో అక్కడికి రాగలుగుతున్నానయ్య. హైదరాబాదులో కలుసుకో అయ్యా, నన్నింటికి తీసుకుపో అయ్యా" ఏడుస్తూ ఫోను పెట్టేసింది వరలక్ష్మి.

వీరినాయుడి తల దిమ్మెక్కిపోయింది. వరాలు, తన వరాలుకి ఎంతకష్టం తెచ్చిపెట్టాడా ముండాకొడుకు? పళ్ళు కొరుకుతున్నాడు వీరినాయుడు. అయితే అతనికి తన కర్తవ్యం గుర్తుకువచ్చింది. వెంటనే బయలుదేరాలి. మూర్తీభవించిన శోకదేవతలా ఉన్న వరలక్ష్మిని చూసి బావురుమన్నాడు వీరినాయుడు.

ఎలా పంపాడు వరాలుని తాను? మహాలక్ష్మిలా పంపాడు. ఆ దౌర్భాగ్యుడు మూడునెలల్లో ఆమె బతుకు ఇంత చిందరవందర చేశాడంటే, వాడు సామాన్యుడు కాడు. కుట్రపన్ని వ్యవహరించి వరాలుని తీసుకెళ్ళి అనుభవించి చివరికి దాసీగా మార్చాడు. వాణ్ణి ఏం చెయ్యాలి? టాక్సీలో తండ్రి భుజంమీద తలవాల్చి వరలక్ష్మి ఒకటే మాట అంది తండ్రితో.

"అయ్యా, నాకు జరిగిన అన్యాయానికి బదులు చెయ్యాలయ్యా, ఇట్లాంటి అనర్థం ఇంకే ఆడదానికీ జరక్కూడదయ్యా".

***

"ఇప్పుడు చెప్పండి జడ్జీ బాబూ, ఆ ఎదవ కోసం, ఆ లుచ్చా నాకొడుకు కోసం మూడుసంవత్సరాలు ఎదురుచూశాను బాబూ. అందరూ అన్నీ మర్చిపోయింటారని ఆడిక్కడికి వచ్చాడు. మరి నాకు అవకాశం దొరికిందికదా బాబూ, ఆడు ఈ జన్మలో ఇంకే ఆడదాని జీవితం బలెట్టకుండా ఆడి తల నరికేశాను బాబూ, ఇందులో నేను చేసిన తప్పేమైనా ఉందా బాబూ?

వీరినాయుడు కథ విన్న కోర్టులో జనం స్థాణువులై పోయారు. చీమ చిటుక్కుమన్నా వినిపించే నిశ్శబ్దం ఆవరించింది కోర్టు హాల్లో.

వీరినాయుడు మళ్ళీ మాట్లాడ్డం మొదలుపెట్టాడు.

"అసలు ఆడదాని బతుకు ఈ దేశంలో ఇంత అధ్వానమై పోయిందేం బాబూ. మన వేదాల్లో పురాణాల్లో ఆడదాని గొప్పతనం గురించి చదివాంగానీ ఆళ్ళ కన్నీళ్ళూ కష్టాల గురించీ రాయలేదుకదా బాబూ, మనం వేదాల్లో పూజించే ఆడదాని బతుకు ఇంత అధ్వానమా బాబూ ఆడోళ్ళంటే అసలు ఇంత సులకన ఎందుకు బాబూ. ఇంట్లో దీపం ఎలిగించి ఇల్లు సక్కపెట్టేది ఆడదే బాబూ, ఇంకో మగాడికి జన్మనిచ్చేది ఆడదే బాబూ, అట్లాంటి ఆడోళ్ళని పురిట్లోనే తుంచేస్తుంటే ఏం చేస్తున్నాయి బాబు మీ ప్రభుత్వాలు?

జనం ఊపిరి బిగపట్టి అలానే వింటున్నారు.

"ఆడదాన్ని రచ్చించాల్సిన బాధ్యత ప్రభుత్వాలకి లేదాబాబూ? ఆడదాన్ని ఓ ఆటవస్తువుగా జనం మలుస్తుంటే వాళ్ళ జీవితాలకి రక్షణ కరవైతే చర్యలు తీసుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వానికి లేదా బాబూ, ఇంకెందుకు బాబూ ఈ గవర్నమెంట్లూ, పోలీసులూ?

అసలు నాకు తెలవకడుగుతాను, చదువు నెపంమీద ఈ కాలేజీల్లో చేరే ఈ లుచ్చా నా కొడుకులు, తల్లిలా గౌరవించాల్సిన ఆడదాన్నే అదేటమ్మా 'ఈవ్‌టీజింగ్' పేరుతో అల్లరి పెడుతుంటే పోలీసోళ్ళేటయ్యారు? మీ న్యాయమేటైంది బాబూ? మీ తల్లీ ఒక ఆడదే, మీ భార్యా ఒక ఆడదే, మీ కూతురూ ఒక ఆడదే! వాళ్ళని ఎవరైనా అల్లరి చేస్తే మీరూరుకుంటారా బాబూ".

వీరినాయుడికి ఆవేశం కమ్ముకుని ఉంది ఇప్పుడు.

"ఎందుకు బాబూ, ఈ దొంగనాకొడుకుల్ని, 'ఆళ్ళింకా కుర్రోళ్ళు, ఏవీ తెలవనోళ్ళు' అని ఎందుకు కాపాడుతున్నారు బాబూ? మళ్ళీ ఆళ్ళనీ సమాజంలో కొదిలి ఆళ్ళు మళ్ళీ చేసే అకృత్యాలకి ఆడపిల్లల్ని బలివ్వడానికా బాబూ?

బాబూ ఈ సమాజం బతికి బట్టకట్టాలంటే, వచ్చేకాలంలో మనకి మనుగడ ఉండాలంటే సృష్టికి మూలకారణమైన ఆడదాన్ని పురిట్లోనే చంపేసే తొత్తు నాకొడుకుల్ని అందరిముందరా నిలువునా కిరసనాయిలుపోసి తగులబెట్టాలి బాబూ, ఆడదే లేకపోతే ఆ దుర్మార్గులు ఈ లోకంలోకి వచ్చేవారా బాబూ?

ఆడపిల్ల పుట్టిందని భార్యని ఇంటినించి తరిమేసే మొగాడిని, ఆ భర్తని ఉరెయ్యాలబాబూ, ఒక బిడ్డ ఆడదైనా, మగైనా ఆ బిడ్డ పుట్టడానికి ఇద్దరూ బాధ్యులే అని తెలియని ఆ ఎదవ బతికుంటే ఏం, సస్తే ఏం బాబూ? అందరూ కొడుకుల్నే కంటే ఈ లోకం ఏటవ్వాలి బాబూ? అప్పుడు మనం ఈ సంఘంలో బతగ్గలమా చెప్పండి కోర్టులో గాలి కూడా కదలడం మానేసినట్టయింది. నాకు మీరే శిచ్చయినా వెయ్యండి బాబూ, కాని నేను వేసిన శిచ్చ తప్పు అని మాత్రం అనకండి బాబూ". వీరినాయుడికి ఏశిక్ష పడిందో తెలుసుకోవడం ఇప్పుడు అనవసరం. కాని అతని ప్రశ్నలకు జవాబులు మాత్రం ఇప్పుడు సమాజానికి అత్యవసరం.

నవ్య

## హన్సిక దగ్గర ఆగిన 'సంఘమిత్ర'?

ఏ ముహూర్తాన 'సంఘమిత్ర' సినిమాను అనుకున్నారో కానీ ఇంత వరకూ హీరోయిన్ ఖరారు కాలేదు. శ్రుతితో మొదలు కొని చాలా మంది హీరోయిన్ల చుట్టూ తిరిగిన ఈ సినిమా చివరకు హన్సిక దగ్గరకు వచ్చి ఆగింది. ఈ సినిమాను తెలుగు, తమిళం, హిందీ భాషలలో నిర్మిస్తున్న సంగతి తెలిసిందే! ఈ మూడు భాషలలో బాగా పరిచయమున్న బ్యూటీ కోసం సినిమా దర్శక నిర్మాతలు ప్రయత్నించారు. ముందు టాలీవుడ్ జేజమ్మ అనుష్కను అనుకున్నా, తనకి బాలీవుడ్‌లో పెద్దగా గుర్తింపు లేదు. దాంతో అనుష్క ప్రస్తావనను పక్కన పెట్టేశారు. ఇపుడు వీరి దృష్టి హన్సిక మీద పడింది. హన్సిక బాలనటిగా, ఆ తరువాత హీరోయిన్‌గా బాలీవుడ్‌లో సినిమాలు చేసింది. ఆమె పేరు అక్కడ బాగా సుపరిచితం. దాంతో హన్సిక అయితే బాగుంటుందని దర్శకనిర్మాతలు భావించారట! కాకపోతే హన్సిక ఈ సినిమా చేస్తుందా? లేదా? అన్నది ఇంత వరకూ నిర్ధారణ కాలేదు. ప్రస్తుతానికి హన్సికకు తమిళనాట అవకాశాలు పెద్దగా లేవు కనుక ఈ సినిమా కచ్చితంగా చేస్తుందని సినీ జనాలు అంటున్నారు. ఒక్క తమిళనాటే కాకుండా టాలీవుడ్, బాలీవుడ్‌లలో కూడా హన్సికకు అవకాశాలు లేవు. అలాంటి హీరోయిన్‌తో సినిమా చేయడం కరెక్టేనా? అని కొంతమంది అంటున్నారు.






# కలకత్తా టు తాపేశ్వరం

**మాటకి ముందు 'ఆయ్..' తర్వాతో 'ఆయ్..'. రెండు నిమిషాలు వింటే- చిన్నప్పటి నుంచి తూగోలో పుట్టి పెరిగాడా అనిపిస్తుంది బప్పీని చూస్తే. 'మా వాడిది ప్యూర్ బెంగాల్.. మన బెంగాల్ స్వీట్ టైగర్' అని మిత్రుడు పరిచయం చేసినప్పుడు నా నమ్మలేని నిజాల జాబితాలో బప్పీ కూడా వచ్చి చేరిపోయాడు. బప్పీని చాలాసార్లు చూశాను కానీ తనది బెంగాల్ అని ఎప్పుడూ అనుకోలేదు. మా స్నేహితుడికి తాపేశ్వరంలో ఒక పెద్ద మిఠాయి కొట్టుంది. అదెంత పెద్దదంటే, రోజుకు వందల కేజీల స్వీట్స్ సునాయాసంగా చేసేటంత పెద్దది. దాంట్లో బప్పీ బెంగాల్ స్వీట్ మాస్టర్ అంటే బెంగాలీ స్వీట్స్ చేసే ఉద్యోగం... చేయించే ఉద్యోగం.**

బప్పీని మొదటిసారి చూసిన వారెవ్వరూ అతను బెంగాలీ బాబు అనుకోరు. 'ఆయ్.. మాది బెంగాల్ బోర్డర్ దగ్గరున్న చిన్న పల్లెటూరండి. పన్నెండేళ్లకే మా ఊరు వదిలి కలకత్తా వచ్చేశామండి. అక్కడో నాలుగేళ్లు ఉండి హైదరాబాద్ వచ్చానండి. అక్కడ మా బాబాయ్ నన్ను పనిలో కుదిర్చాడండి.. ఏడాది తర్వాత వైజాగ్.. ఆ తర్వాత రాజమండ్రి.. చివరకు తాపేశ్వరంలో సెటిలైపోయానండి..' అంటూ తన ప్రస్థానాన్ని లేత పాకం తిప్పుతున్నంత సునాయాసంగా చెప్పేస్తాడు బప్పి. ఎక్కడ బెంగాల్... ఎక్కడ తాపేశ్వరం.. ఎక్కడో పుట్టి.. ఎక్కడో పెరిగి ఇక్కడకు ఎందుకొచ్చినట్లు... అయినా బెంగాల్ కూడా స్వీట్స్‌కు ఫేమస్ కదా..' ఇలా నాలో తలెత్తే ఆలోచనలను పసిగట్టినట్లు... 'ఆయ్.. అప్పుడిన్ని జీతాలు లేవండి.. పన్నెండేళ్ల వయస్సులో కలకత్తా వచ్చేశానండి.. అక్కడ వర్కవుట్ కాలేదండి. స్వీట్స్ చేయటం మా బ్లడ్‌లో ఉందండి.. ఎక్కడైతేనేమండి.. బతకటం ముఖ్యం. అందుకే హైదరాబాద్ వచ్చేశానండి.. అక్కడ హిందీ వర్కవుట్ అవుతుంది. ఆ తర్వాత వైజాగ్.. అక్కడ కూడా హిందీ వర్కవుట్ అవుతుందండి. వైజాగ్‌లో సెటిల్ అయ్యేసరికి తెలుగొచ్చేసిందండి.. నాకు మంచి బాస్ దొరికాడండి.. సెటిల్ అయిపోయానండి..' అంటాడు బప్పీ తనదైన తూగో తెలుగులో.

ప్రతి ఏడాది బప్పీలాంటి వాళ్లు కొన్ని వందల మంది ఉద్యోగాలు వెతుక్కుంటూ తెలుగు రాష్ట్రాలకొస్తుంటారు. హైదరాబాద్, వైజాగ్, విజయవాడ, వరంగల్.. ఇలా ఏ పెద్ద నగరంలో చూసినా స్వీట్ షాపుల్లో అయితే స్వీట్ మాస్టర్స్ వాళ్లే.. చాలా చోట్ల అరకొర సదుపాయాలు, అర్ధాకలి బతుకులు కనిపిస్తూ ఉంటాయి. వాటితో పాటు మండు వేసవిలో కూడా గంటలకొద్దీ పొయ్యి ముందు కూర్చుని గరిటె తిప్పటం అంత సులభమైన పనేం కాదు. అరగంట వంటింట్లో ఉండి.. నలభై నిమిషాలు ఆయాసపడే నాకు ఆ ఆలోచనే భయంకరంగా అనిపిస్తుంది. ఆ మాటంటే బప్పీ తమాషాగా నవ్వి 'ఆయ్.. అలవాటండి.. ఒక్కసారి వర్కవుట్ అయితే సెటిల్ అయిపోతుంది. ఇప్పుడు నన్ను ఒక అరపూట కూర్చోమన్నా కూర్చుండిపోతా!' అంటాడు. ఒక్క క్షణం ఆగి 'అందరికీ ఇంత లక్ ఉండదండి. రకరకాల అలవాట్లండి.. వాళ్లు ఇంటికేం పంపుతారండి? డిసిప్లైన్‌గా ఉంటే నాలుగురాళ్లు సంపాదించుకోవచ్చండి...' అని మనసులో మాటను చెబుతాడు. అలా సంపాదించుకున్న నాలుగు రాళ్లతో బప్పీ సొంతూర్లో ఒక చిన్న ఇల్లు కట్టాడు. కొంత పొలం కూడా కొన్నాడు. ప్రతి ఏడాది వాటిని చూసుకోవటానికి వెళ్లి వస్తూ ఉంటాడు. 'చుట్టాలందరూ అక్కడేనండి. మా ఆవిడ ఊరు కూడా అక్కడే. తను ప్యూర్ బెంగాలీనండి. వాళ్లకూ పొలం ఉందండి.' అంటుంటే తన యాసకు నాకు నవ్వొచ్చింది. 'ఇక్కడ సెటిల్ అయినప్పుడు ప్యూర్ తెలుగు అమ్మాయిని చేసుకోకుండా.. బెంగాలీనే ఎందుకు చేసుకున్నావు?' అని అడిగా. 'మా ఊరోళ్లు కదండి..' అని అప్రయత్నంగా బప్పీ నుంచి సమాధానం వచ్చేసింది.

ఒకసారి లెక్కతీస్తే, మన తెలుగువాళ్లు నాలుగొందల రకాల పిండివంటలు చేస్తారని తేలింది. అన్ని రకాలు మనమే చేసేటప్పుడు బెంగాల్ వంటవాళ్లు మనకెందుకు? ఏ రసగుల్లాలో.. మిస్తి దోయినో తింటున్నప్పుడు ఈ అనుమానం నన్ను పీడిస్తూ ఉంటుంది. అదే మాటంటే 'ఆయ్.. అబ్బే.. రాదండి.. ఇక్కడ కాజాలు చేస్తారండి.. మీరెంత కష్టపడ్డా కలకత్తాలో ఈ కాజాలు రావండి.. వచ్చినా తినరండి.. ఎవరి స్పెషాలిటీ వాళ్లదేనండి.. బెంగాలనుకోండి.. పాలు స్పెషలండి.. ఇక్కడి పాలతో చేస్తే ఆ రుచి రాదండి.. ఓసారి బెంగాల్ పాలు పట్టుకొచ్చి ఇక్కడ వండితే రుచే లేదండి. ఆ క్లైమేట్ వేరండి.' అని అసలు విషయాన్ని చెబుతాడు బప్పీ. 'చివరగా నాకో విషయం చెప్పు.. నువ్వు బెంగాలీనా.. తెలుగా..' అని అడిగా. తను మౌనంగా అప్పుడే చేసిన రసగుల్లాను ఒక కప్పులో పెట్టి నాకిచ్చాడు. నేను దాన్ని నోట్లో వేసుకున్నా. 'ఆయ్.. మీరు తిన్నది బెంగాలీనా.. తెలుగా.. మీరే చెప్పండమ్మా..' అన్నాడు. నాకు సమాధానం దొరకక మౌనంగా ఉండిపోయా.

**–సీత**

**email: fbackfm@gmail.com**



# మోదీకి లాభమా? నష్టమా

**అనేక ఇబ్బందులు కోపతాపాల మధ్య అమలులోకి తెచ్చిన జీఎస్‌టీ వల్ల మోదీ ప్రభుత్వానికి రాజకీయంగా, ఎన్నికల పరంగా ప్రయోజనమేమైనా ఉంటుందా అన్నది వేచి చూడాల్సిన అంశం.**

జీఎస్టీని ప్రారంభించడం వ్యక్తిగతంగా నరేంద్ర మోదీకి లాభమా? నష్టమా? సాధారణంగా రాజకీయంగా కూడా లబ్ధి చేకూర్చనిదే పాలక పక్షాలు ఎటువంటి అభివృద్ధి కార్యక్రమాన్ని గానీ, సంక్షేమ పథకాన్ని గానీ చేపట్టవనే సంగతి అందరికీ తెలిసిందే. ఆ దృష్టితో ఆలోచిస్తే, జీఎస్టీ (వస్తు, సేవల పన్ను) కూడా రాజకీయంగా, ఎన్నికల పరంగా కేంద్రంలోని పాలక బీజేపీకి ఉపకరించాలి కదా!...అనేక కష్టనష్టాలకు ఓర్చి బీజేపీ ప్రభుత్వం ఈ 'సంస్కరణ' చేపట్టిందంటే కచ్చితంగా ఏదో రాజకీయ ప్రయోజనాన్ని ఆశించి ఉంటుంది. దేశ ప్రయోజనాలకు పెద్దపీట వేస్తే వేయొచ్చు. కానీ, రాజకీయంగా కూడా ప్రయోజనం ఉంటే మరీ మంచిది. రాజకీయ ప్రయోజనాన్ని మోదీ ఆశించినా ఆశించకపోయినా బీజేపీ అధ్యక్షుడు అమిత్ షా ఆశించే ఉంటారు.

జీఎస్టీ పేరుతో ఓ విప్లవాత్మక ఆర్థిక సంస్కరణను చేపట్టడం మోదీ ప్రభుత్వానికి గొప్పదనం మాత్రమే తెచ్చిపెట్టిందనుకోవడానికి వీల్లేదు. అది ముమ్ముందు విజయాన్ని కూడా తెచ్చి పెట్టే అవకాశం ఉందని విశ్లేషకులు భావిస్తున్నారు. గొప్పదనానికి, విజయానికి మధ్య ఓ చిన్న తేడా ఉంది. జనం ఓటు వేసినా, మీడియా ప్రశంసించినా అది విజయం అవుతుంది. కానీ, చరిత్రకారులు కూడా గుర్తిస్తే, అంటే చరిత్రలోకి కూడా ఎక్కితే అది గొప్పదనం అవుతుంది. వారంరోజుల క్రితం ఎంతో హంగామా, ఆర్భాటంతో జీఎస్టీని ప్రారంభించినప్పుడు నరేంద్ర మోదీ గొప్పదనం కోసం చూశారు. కానీ అమిత్ షా విజయం కోసం చూస్తున్నారు. ఇది రాజకీయ విశ్లేషకుల మాట. జీఎస్టీని ఆయన ప్రారంభించిన సమయం, సందర్భాన్ని బట్టి చూస్తే, ఆయన తన సంకల్పంలో విజయం సాధించినట్టే కనిపిస్తోంది. దేశ ప్రజలే కాదు, ప్రపంచ దేశాలు సైతం మోదీ సాహసోపేత చర్యను సంభ్రమాశ్చర్యాలతోనే వీక్షించడం జరిగింది.

సుమారు 70 ఏళ్ల క్రితం రాజ్యాంగ ముసాయిదాను ప్రారంభించిన పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లోనే మోదీ ఇప్పుడు జీఎస్టీని ప్రారంభించారు. ఆయన ఈ సందర్భంగా రాజ్యాంగ నిర్మాతలనే కాకుండా, స్వాతంత్ర్యోద్యమం గురించి కూడా గుర్తు చేసుకున్నారు. అప్పట్లో సర్దార్ వల్లభాయ్ పటేల్ వివిధ రాష్ట్రాలను, సంస్థానాలను ఒకే గొడుగు కిందకు తెచ్చినట్టే, ఇప్పుడు తాము ఒకే దేశం ఒకే పన్ను, ఒకే విపణి అనే లక్ష్యానికి అవకాశం ఇచ్చే జీఎస్టీని ప్రారంభిస్తున్నట్టు ఆయన ప్రకటించారు. సెంట్రల్ హాల్‌లోని పలువురు రాజనీతిజ్ఞుల చిత్రపటాల సరసనే భవిష్యత్తులో తన చిత్రపటం కూడా కనిపించాలని ఆయన ఆశిస్తున్నట్టు కనిపిస్తోంది. మహాత్మాగాంధీ, వల్లభాయ్ పటేల్ తరువాత దేశాన్ని ఒక్క తాటి మీదకు తెచ్చిన మూడవ వ్యక్తి ఆయనేనని బీజేపీ నాయకులు కూడా కీర్తించారు! జీఎస్టీ అమలుతో మళ్లీ ఇన్‌స్పెక్టర్ రాజ్ వ్యవస్థ మొదలవుతుందని, వ్యాపార, వాణిజ్యాల్లో లాభాలు గణనీయంగా తగ్గుతాయని భయం ఉండనే ఉంది. దీనితో పాటు ప్రారంభోత్సవ కార్యక్రమానికి కాంగ్రెస్ వంటి మహోన్నత చరిత్ర గలిగిన పార్టీ గైర్హాజర్ కావడం కొద్దిగా నిరాశ కలిగిస్తున్నప్పటికీ, ప్రారంభోత్సవ రోజు మాత్రం వైభవంగా గడిచిపోయింది. క్రికెట్‌లో ప్రపంచకప్ వచ్చినట్టు ఆ రోజు అర్ధరాత్రి వరకూ సంబరాలు కూడా కొనసాగాయి.

## సమయం అనుకూలమేనా?

అసలు ప్రపంచ ఆర్థిక స్థితిగతులే పునరుజ్జీవన దశలో ఉన్నాయి. అనేక దేశాల ఆర్థిక వ్యవస్థలు తమ అవస్థల నుంచి గట్టెక్కేందుకు నానా పాట్లు పడుతున్నాయి. ఐరోపా ఖండంలోని అభివృద్ధి చెందిన దేశాలు వడ్డీరేట్లను పెంచడానికి ప్రణాళికలు సిద్ధం చేస్తుండగా, తమ వృద్ధి లక్ష్యాన్ని చేరుకోవడానికి అమెరికా తీవ్రంగా కృషి చేస్తోంది. సులువుగా వ్యాపారం చేసే దేశాల మధ్య తమ ర్యాంకును మెరుగుపరచుకోవడానికి భారత్ మూడేళ్లుగా తన విధానాలను సంస్కరిస్తోంది. ఇటువంటి సమయంలో మోదీ జీఎస్టీని ప్రారంభించడం వల్ల ఇతర దేశాలతో సులువైన వ్యాపారం చేయడానికి అవకాశం కల్పించారు. ఆర్థిక రంగంలో కొంత ఆశావహ పరిస్థితిని సూచిస్తోంది. జీఎస్టీ భారం వినియోగదార్ల మీద పడి ద్రవ్యోల్బణం తగ్గే అవకాశం ఉందని ఆర్థిక నిపుణులు భావిస్తున్నారు. ఇది మోదీ ప్రభుత్వానికి అనుకూల అంశమవుతుందని కూడా వారు ఆశిస్తున్నారు.

ఎన్డీఏ ప్రభుత్వం గనుక తన ఆర్థిక సంవత్సరాన్ని జనవరి నుంచి డిసెంబర్‌కు మార్చే పక్షంలో, ఈ ఏడాది రెండు బడ్జెట్‌లు సమర్పించినట్టవుతుంది. దీనివల్ల ప్రభుత్వానికి అదనపు ఆదాయాలు సమకూరి, వివిధ ప్రాజెక్టులు, పథకాలకు నిధులు అందజేయడానికి అవకాశం ఏర్పడుతుంది. జీఎస్టీ అమలు ప్రారంభదశలో కనిపించిన గందరగోళ పరిస్థితులు దీనివల్ల మరుగునపడే అవకాశం ఉంటుంది. ఎన్నికలు జరగడానికి మరో రెండేళ్ల వ్యవధి ఉన్నందువల్ల, జీఎస్టీ అమలుకు సంబంధించి ఎటువంటి గందరగోళం, చిక్కులు తలెత్తినా పరిష్కరించుకోవడానికి సమయం ఉంటుంది. మొత్తం మీద వస్తు, సేవల పన్ను కారణంగా ఒకే విపణి అనే లక్ష్యాన్ని చేరుకోవడానికి ప్రభుత్వానికి తగినంత సమయం ఉంది.

పరోక్ష పన్నుల సంస్కరణకు సంబంధించి జీఎస్టీ మించి చేయగలిగిందేమీ లేదని ఆర్థిక నిపుణులు అభిప్రాయపడుతున్నారు. ఇందులో కొన్ని లోపాలు ఉంటే ఉండవచ్చు. అమలులో కూడా సమస్యలు, సవాళ్లు ఉండవచ్చు. అయితే, వీటిని పరిష్కరించడానికి ప్రభుత్వం ఆర్థిక నిపుణులతో ఏర్పాటు చేసిన జీఎస్టీ మండలి ఉండనే ఉంది. జీఎస్టీ




**- రాజశుక**



గనుక సమర్థవంతంగా, పటిష్ఠంగా అమలు జరిగితే తానొక సంస్కరణవాదిగా చరిత్రలో మిగిలిపోతానని మోదీ భావిస్తున్నట్టుంది. నిజానికి జీఎస్టీ ఒక్క మోదీకి మాత్రమే పరిమితం కాదు. దీనికి దాదాపు పదేళ్ల నుంచీ ప్రయత్నాలు జరుగుతున్నాయి. అప్పట్లో మన్మోహన్‌సింగ్ నాయకత్వంలోని యూపీఏ ప్రభుత్వం పార్టీలకతీతంగా వివిధ రాష్ట్రాల ఆర్థిక మంత్రులతో ఒక కమిటీ వేసింది. ఈ కమిటీలో సీపీఎం, బీజేపీ, నేషనల్ కాన్ఫరెన్స్, కాంగ్రెస్, తృణమూల్ కాంగ్రెస్ రాష్ట్రాల ఆర్థిక మంత్రులు కూడా ఉన్నారు. అయితే, జీఎస్టీ రేటును 18 శాతంగా ఖాయం చేసి, అందుకు రాజ్యాంగ సవరణ కూడా చేయడంపై కాంగ్రెస్ రాష్ట్రాల ఆర్థిక మంత్రులే అభ్యంతరం చెప్పడంతో ఇది ఆగిపోయింది.

### మోదీ దూరదృష్టి

జీఎస్టీని రూపొందించడాన్ని, అమలు చేయడాన్ని కేవలం తన గొప్పదనంగా పరిమితం చేసుకోవడం సమంజసం కాదని మోదీ కూడా గ్రహించుకున్నట్టు కనిపిస్తోంది. అన్ని రాష్ట్రాల ప్రభుత్వాలకు ధన్యవాదాలు చెబుతూ కేంద్ర మంత్రివర్గం ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ప్రత్యేక పార్లమెంట్ సమావేశానికి హాజరైన వివిధ రాష్ట్రాల ముఖ్యమంత్రులందరికీ 'థాంక్యూ' లేఖలు వెళ్లాయి. కాంగ్రెస్ సహా కొన్ని ప్రతిపక్షాలు ఈ సమావేశాన్ని బహిష్కరించడాన్ని ఆయన నర్మగర్భంగా విమర్శించారు. జీఎస్టీ దేశమంతటికీ, అన్ని పార్టీలకూ చెందిందని ఆయన వ్యాఖ్యానించారు. పదేళ్ల క్రితం నాటి ఆర్థిక మంత్రుల కమిటీకి ఛైర్మన్‌గా వ్యవహరించిన అశిం దాస్‌గుప్తా కూడా దీనికి హాజరయ్యారు కానీ ఆయన పార్టీ సీపీఎం మాత్రం దీనికి హాజరు కాలేదు.

ఈ సమావేశాన్ని బహిష్కరించాలన్న ఆలోచన కాంగ్రెస్ ద్వారానే వచ్చింది. జీఎస్టీ విషయంలో తమకు దక్కాల్సిన ఖ్యాతి మోదీకి దక్కుతోందనే దుగ్ధతోనే కాంగ్రెస్ ఆ సమావేశాన్ని బహిష్కరించాలని నిర్ణయించుకుంది. అయితే, కాంగ్రెస్ అలగడానికి ఇది సమయమూ కాదు, సందర్భమూ కాదు. ఒకప్పుడు కాంగ్రెస్ వాట్, ఆర్థిక బాధ్యత బడ్జెట్ నిర్వహణ చట్టాన్ని ప్రవేశపెట్టినప్పుడు, దానికి అవసరమైన భూమికనంతా అంతకు పూర్వపు ఎన్డీయే ప్రభుత్వం సిద్ధం చేసింది. యశ్వంత్ సిన్హా ఆర్థిక మంత్రిగా ఉండగా ఇది జరిగింది. కాగా, ఇప్పుడు జీఎస్టీని బయటకు తెచ్చిన ఘనత మాత్రం బీజేపీ ప్రభుత్వానికే దక్కుతుంది. కాంగ్రెస్ తన హయాంలో ఈ పని చేయలేకపోయింది.

నిజానికి 1947 తరువాత ఇంత పెద్ద ఆర్థిక సంస్కరణను ఏ ప్రభుత్వమూ చేపట్టలేకపోయింది. దేశంలో మొదటిసారిగా ఆర్థిక సంస్కరణలను చేపట్టిన ఘనత చాలావరకూ పీవీ నరసింహారావు ప్రభుత్వానికి దక్కుతుందనడంలో సందేహం లేదు. ఆ తరువాత వాజ్‌పేయి ప్రభుత్వం పెద్దయెత్తున ప్రైవేటీకరణ చేపట్టింది. మన్మోహన్ సింగ్ ప్రభుత్వం కొద్దిపాటి మార్పులు చేర్పులతో ఈ సంస్కరణలను అవిచ్ఛిన్నంగా కొనసాగించింది. జీఎస్టీ విషయంలో మోదీ ఈ ఘనతంతా తనకే చెందుతుందని భావించి ఉండొచ్చు. అంతమాత్రాన కాంగ్రెస్ ఉడికిపోవాల్సిన అవసరం లేదు. సమావేశానికి హాజరయి ఉంటే ఇందులో కాంగ్రెస్‌కూ పాత్ర ఉందనే విషయం రూఢి అయ్యేది. జీఎస్టీ వల్ల పన్నులు ఒకే రకంగా ఉండడంతో పాటు, దేశమంతా వస్తువులు, సేవలు నిరాటంకంగా, నిరాఘాటంగా రవాణా, సరఫరా కావడానికి వీలు పడుతుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని కాంగ్రెస్ కాస్తంత హుందాగా వ్యవహరించి ఉండాల్సింది.

### కాంగ్రెస్ తప్పటడుగు

'ఒకే పన్ను, ఒకే దేశం' విధానం దేశ ఫెడరల్ వ్యవస్థను పరిపుష్టం చేస్తుంది. దేశమంతా ఒకే పన్ను ఉండాలని రాష్ట్రాలు కూడా కోరుకున్నాయి కాబట్టి రాష్ట్రాల మధ్య ఇంతవరకూ ఉన్న పన్ను పోరాటాలు నిలిచిపోయే అవకాశం ఉంది. 2000 ప్రాంతంలో వాట్ మీద చర్చలు జరుగుతున్నప్పుడు, దేశమంతా ఒకే పన్ను లేకపోవడమే పెద్ద సమస్యగా అడ్డుపడింది. వివిధ రాష్ట్రాల్లో వివిధ పన్నులు అమలు జరుగుతున్నప్పుడు ఏ సంస్కరణ అయినా సజావుగా సాగడం కష్టమే. జీఎస్టీ మీద చర్చలు జరుగుతున్నప్పుడు కూడా రాష్ట్రాలు ఒకే పన్నుకు అంగీకరించవనే అభిప్రాయం వ్యక్తమైంది. ఇప్పుడు రాష్ట్రాలన్నీ అంగీకరించడాన్ని బట్టి, దేశంలో కొత్త పన్ను వ్యవస్థ ఆరంభం కావడమే కాకుండా, రాష్ట్రాల మధ్య సహకారం పెరగడానికి కూడా అవకాశం ఏర్పడింది. కేంద్రమే కాక, రాష్ట్రాలు కూడా ఇటువంటి వ్యవస్థ కోసం సుమారు పదేళ్లుగా బుర్ర బద్దలు కొట్టుకుంటున్నాయి. చివరికి ఇవి జీఎస్టీ మండలి నిర్ణయాలకు కట్టుబడ్డాయి.

ఒకే దేశం, ఒకే పన్ను వ్యవస్థ అమలులోకి వస్తే రాష్ట్రాలు తమ ఆర్థిక స్వయంప్రతిపత్తిని కోల్పోతాయా అనే సందేహాలు కూడా వ్యక్తమయ్యాయి. అయినప్పటికీ, రాష్ట్రాలు పన్ను రేట్లను నిర్ణయించే అధికారం జీఎస్టీ మండలికి అప్పగించాయి. వాట్, అమ్మకం పన్నుల్లో అధిక శాతం వాటాను అనుభవించిన రాష్ట్రాలలో ఇంత పెద్ద మార్పు ఊహించను కూడా ఊహించలేం. అవన్నీ దూరదృష్టితో ఆలోచించి, జీఎస్టీ వల్ల ఒనగూడే విస్తృత ప్రయోజనాలను అర్థం చేసుకునే ఆర్థిక స్వయంప్రతిపత్తిని వదులుకోవడానికి సిద్ధపడ్డాయి. జీఎస్టీ వల్ల బడ్జెట్ తీరుతెన్నులు కూడా మారిపోతాయి. పరోక్ష పన్నుల కారణంగానే బడ్జెట్ చుట్టూ 'రహస్యం' వ్యాపించి ఉండేది. ఇప్పుడు పరోక్ష పన్నుల వ్యవస్థ పారదర్శకంగా మారిపోయింది. ప్రభుత్వానికి ఎప్పుడు ఎంత డబ్బు వస్తోందో, అవి వేటి వేటికి ఖర్చు చేస్తోందో అందరికీ అర్థమైపోతుంటుంది. అందువల్ల భవిష్యత్తులో బడ్జెట్‌లు ఓ ఖర్చుల చిట్టా కింద మారిపోవడం ఖాయం.

ఇందులో ఉన్న లాభార్జన వ్యతిరేక నిబంధన కొద్దిగా ఆందోళన కలిగిస్తోంది. తమ ఉత్పత్తుల అమ్మకాల ద్వారా తమకు లాభాలు చేకూరినప్పుడు, ఆ వస్తువుల ధరలను వీలైనంతగా తగ్గించాలనే ఈ నిబంధనను నిరోధకం కింద ఉపయోగిస్తామే తప్ప చర్యలు తీసుకోమని కేంద్రం తేల్చి చెప్పింది. ఇది ఎంత వరకూ అమలు అవుతుందోనని వ్యాపార వర్గాలు భయపడుతున్నాయి. జీఎస్టీ వల్ల ఎన్ని ప్రయోజనాలు సమకూరుతాయన్నది, ఎన్ని సమస్యలు, సవాళ్లు ఎదురవుతాయన్నది కొంత కాలం వేచి చూస్తే తప్ప అనుభవానికి రాదు. ప్రయోజనాల కన్నా సమస్యలు, ఇబ్బందులు ఎక్కువైతే మోదీ ప్రభుత్వమే కష్టాలు పడుతుంది. జీఎస్టీని అమలు చేసే విషయంలో ఖ్యాతిని దక్కించుకున్న మోదీ ప్రభుత్వం దానివల్ల ఎదురయ్యే కష్టనష్టాలను భరించక తప్పదు.

నవ్య





6

# లాకర్ నెం. 369

-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785



**ఇంత గొప్ప కేసును పరిష్కరించిన సందర్భాన్ని పురస్కరించుకుని బ్యాంకు వాళ్ళు ఆ సాయంత్రం ఒక పెద్ద పార్టీ అరేంజ్ చేశారు.**

**ఆ బ్యాంకుతో సంబంధ బాంధవ్యాలు పెంచుకోవడం నాకు ఇష్టం లేదు. నేను పార్టీకి రానని, దారిలోనే శంషాబాద్‌లోని 'నోవాటెల్'లో దిగిపోతానని మొండిపట్టు పట్టాను. కానీ, మా బాస్ ఒప్పుకోలేదు. 'నేను కూడా హైదరాబాద్ బయల్దేరాను. బెంగళూరు ఏర్‌పోర్టులో ఉన్నానని' చెప్పి నన్ను పార్టీకి అటెండ్ కమ్మని ఫోర్స్ చేయడంతో నేను హైదరాబాద్ నగరంలో అడుగు పెట్టాను.**

లేకపోతే, ఈ నగరమన్నా, ఇక్కడి ప్రజలన్నా, ఈ బ్యాంక్ అన్నా నాకు పరమ అసహ్యం. మనుషులను మోసం చేయడం, ఒక మనిషి చైతన్యాన్ని నిర్వీర్యం చేయడం ఇక్కడి వాళ్ళకు వెన్నతో పెట్టిన విద్య. ప్రపంచమంతా అలాగే ఉన్నా, నాకు కలిగిన అనుభవాల మూలంగా నాకు హైదరాబాద్ మీద ఆ అభిప్రాయం ఏర్పడింది.

నా జీవితం సర్వనాశనమయిందీ, నాలోని సున్నితత్వం నశించిందీ ఇక్కడే.

కానీ, మన మనసులోని సున్నిత భావాలను గౌరవించే విశాల హృదయం వ్యవస్థలను నడిపే వారికి ఉండదు. మనం లోలోపల కాలిపోతున్నా పైకి మాత్రం మర్యాదలను పాటించాల్సిందే. మన కన్నీళ్ళను మనమే అమృతంగా భావించి తాగి, దగ్ధమవుతున్న మన ఆశయాలను చూస్తూనే, పెదాలకు ప్లాస్టిక్ నవ్వులను అతికించుకునే, బతికేయాలి. అప్పుడు, అది నా వల్ల కాలేదు. నేను అలా కృత్రిమంగా జీవించలేక పోయాను. అందుకే, బ్యాంకు ఆఫీసర్ ఉద్యోగాన్ని వదిలేశాను.

### జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో మిడిల్ మేనేజ్‌మెంట్ స్థాయి అధికారి అతను. మాకనూరులో జరిగిన బ్యాంకు దోపిడీ కేసును ఛేదించేందుకు వెళతాడు. ఆ ఊరిప్రజలను, పోలీసులను మోటివేట్ చేసి, అవసరమైన సమాచారం తెచ్చిన వారికి లక్షరూపాయల రివార్డ్ ప్రకటిస్తాడు. నేరస్థులను రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకుంటాడు. ఈ సందర్భంగా జోనల్ ఆఫీసులో పార్టీ అరేంజ్ చేయడంతో, అధికారి హైదరాబాద్ బయలుదేరతాడు.

ఆ తర్వాత...

నా ఆలోచనలకు అంతం ఉండదు. కానీ, ధ్వంసమైన నా స్వప్న సామ్రాజ్యాలను చూస్తూ ప్రయాణం చేస్తుంటే మనసు ఉద్విగ్న భరితమైంది. నేను బ్యాంకు ఉద్యోగం చేస్తున్నప్పుడు తిరిగిన ప్రదేశాలు కళ్ళ ముందు కనిపిస్తుంటే ఒక విషాద తరంగం వీచింది. ఇంతలో జోనల్ ఆఫీసుకు చేరుకుంది కారు.

మా బాస్ ఆల్రెడీ హైదరాబాద్ చేరుకుని జోనల్ ఆఫీసులో నా కోసం ఎదురు చూస్తున్నాడు.

అందుకే, మనసు చంపుకుని, గుండెల్లో పేరుకుపోయిన అయిష్టతతో, బ్యాంక్ ప్రెమిసెస్‌లో ఎనిమిదేళ్ళ తరువాత అడుగు పెట్టాను.

బ్యాంకు దగ్గర వాతావరణం అంతా కోలాహలంగా ఉంది. నన్ను రిసీవ్ చేసుకోవడానికి, జోనల్ మేనేజర్, మిగిలిన అధికారులతో పాటూ, మా బాస్, నా సెక్రటరీ వనజ కూడా, కారిడార్‌లో నిలబడి ఉన్నారు.

రెడ్ కార్పెట్ పరిచి ఉంది.

నేను రెడ్ కార్పెట్ మీద కాలు మోపగానే పూల వర్షం కురిసింది. అందరూ నన్ను అభినందనలతో ముంచెత్తారు. పూల బొకేలను అందుకుంటూ, వాటిని ఎక్కడ పెట్టాలా అని అటూ ఇటూ చూస్తుంటే, అప్పుడు కన్పించింది ఆమె. పై నుంచి కురుస్తున్న పూల వర్షంలో నుండి, స్లో మోషన్‌లో నడిచి వస్తున్నట్లుగా ఆమె, అందాలన్నీ ముచ్చటగా మూట కట్టుకుని, అప్పుడే భూమ్మీదకు అవతరించిన దేవకన్యలా, పరుగు పరుగున వచ్చి,

"ప్లీజ్! లెట్ మీ హావ్ యిట్!" అంటూ నా చేతిలోని బొకేలు తీసుకోబోయింది.

ఎవరైనా తమ జీవితంలో దేవకన్యలను నిజంగా చూశారో లేదోగానీ నేనా క్షణాన చూశాను.

నాలాంటి అర్భకుణ్ణి ఆదుకోవడానికి తన లాంటి అపురూప సౌందర్యవతి రావడం చూసి నాకే సిగ్గనిపించింది. అందుకే, బొకేలు తనకు ఇవ్వకుండా,

"నో ప్రాబ్లెమ్! మీకెందుకు.... శ్రమ.." అన్నాను. బొకేలు తన చేతికి ఇవ్వక పోవడంతో, తను, మరిం



తగా నా దగ్గరకు వచ్చింది. 'అపురూప రూప సుందరి నీవూ...' అటువంటిదే ఏదో పాట నా మనసులో ఝుమ్మంటూ మోగింది. అంత దగ్గర నుంచి చూస్తే నవ్వుతున్న ఆమె ముఖంలోని ప్రతీ అణువూ గోచరించింది. ఏవో ఖైమరుపు లోకాలకు తీసుకెళ్ళే పొగడ పూల వాసనలు నన్ను ముప్పిరి గొన్నాయి.

దేవకన్య సరదా కోసం భూమ్మీద అడుగు పెట్టి, ఇక్కడి సౌందర్యానికి ముగ్ధురాలై పోయి ఇక్కడే స్థిర నివాసమేర్పరుచుకుని, జరుగుబాటు కోసం, 'పనికి ఆహార పథకం' క్రింద ఈ బ్యాంకులో, ఆమె, పని చేస్తున్నట్టుగా నాకు అనిపించింది.

నేను మధురోహల్లో తేలిపోతుండగానే,

"నో సర్! ఇట్స్ మై ప్లెజర్!" అంటూ నవ్వింది.

వంద హరివిల్లులు ఒక్కసారిగా కట్టకట్టుకుని మెరిసినట్టయింది. ఆ నవ్వు, అకాలంలో, నిండు ఎండల్లో కురిసిన వానతో పాటూ వచ్చిన, మెరుపులా ఉంది.

అంత వరకూ నిరాసక్తంగా ఉన్న నేను పునరుజ్జీవితుణ్ణయ్యాను. ఆమెను చూస్తుంటే ఏదో హాయి, ఏదో తన్మయత్వం, ఏదో ఆత్మీయ భావం, ఏదో అలౌకిక ఆనందం కలగసాగాయి.

ఆమెను వెంటనే నా కౌగిలిలోకి తీసుకుని,

"ఎక్కడున్నావ్ ప్రియా ఇన్ని రోజులూ?" అని అడగా లనిపించింది. నేను నిజంగానే, ఆమెను, నా గాఢ పరిష్వంగంలోకి తీసుకుందామనే చేతులు చాచాను.

ఆమె నా చేతుల్లోని పూల బొకేలను తీసుకుని వెళ్ళింది. అలా వెళ్తుంటే, ఆమె నడకలోనూ, ఆమె ప్రతీ భంగిమలోనూ ఒక గ్రేస్, ఒక లాలిత్యం, ఒక వైభవం కనిపిస్తోంది నాకు.

ఆ బొకేలలో ఉన్న అనేక గులాబీ పూల పక్కనున్న ఏదో ఒక ముల్లుకు వేలాడుతున్న నా గుండెను కూడా ఆమె తన వెంట తీసుకుని వెళ్ళింది.

"కం!" జోనల్ మేనేజర్ కర్కశంగా అని ముందు నడుస్తుంటే, నేను కదలలేక కదలలేక అక్కడి నుంచి కదిలాను. చాలా మంది వెనకాల తనుంది. నా మనసేమో తనతోనే ఉంది.

జోనల్ మేనేజర్ ఛాంబర్‌లోకి వెళ్తూ, ఒక్కసారి ఆగి, తిరిగి చూశాను. ఆమె దూరంగా నిలబడి నన్నే చూస్తోంది. నాకు తనేదో చెప్పాలనుకుంటున్నట్టుగా అనిపించింది.

లోపల కాఫీ, టీలు అయ్యాక బ్యాంక్ స్టాఫ్‌ను పరిచయం చేసే కార్యక్రమం మొదలయింది. ఎవరెవరో కలుస్తున్నారు. షేక్‌హ్యాండిస్తున్నారు. 'గుర్తున్నానా?' అంటూ పలకరిస్తున్నారు. కానీ, నేను మాత్రం ఆమెనే చూస్తున్నాను. నేను 'ఫ్లర్ట్' చేస్తున్నానని తనకు అర్థమైనట్టుంది. తను సిగ్గులమొగ్గ అయింది. నేను కొంచెం ధైర్యంగా ఆమెనే చూస్తున్నాను.

అందరూ క్యూ లైన్‌లో వచ్చి అభినందిస్తున్నారు. లైన్ మెల్లిగా కదులుతోంది. ఆమె నా దగ్గరికి ఎప్పుడొస్తుందా అని ఆత్రుతగా ఉన్నాను. ఐదు నిమిషాల సమయం నాకు ఐదు యుగాలుగా తోచింది.

ఎట్టకేలకు, తనొచ్చి నా ముందు నిలబడింది. ఆమె దాదాపు నా ఎత్తుంది. నా కళ్ళు ఆమె కళ్ళనే చూస్తున్నాయి. ఆమె కనుగుడ్లు, కంగారుగా, అక్వేరియంలో చేప పిల్లల్లాగా, కదులుతున్నాయి.

"షీ ఈజ్ సాక్షి! సాక్షి రెడ్డి. మా లీగల్ డిపార్ట్‌మెంట్‌లో ఆఫీసర్." అన్నాడు జోనల్ మేనేజర్.



ఆమె నవ్వుతూ షేక్‌హ్యాండిచ్చింది. కర్కశమైన నా చేతులకు పాలగువ్వ లాంటి మృదు మధుర మైన ఆమె చేయి తగలగానే, ఒళ్ళంతా పులకిం చింది. నాలుగైదు రోజులుగా పడిన శ్రమంతా ఆ ఒక్క స్పర్శతో మటుమాయమై పోయింది. ఆమె స్పర్శ నన్నేదో ఊర్ధ్వ లోకాలకు తీసుకెళ్ళింది. ఆమె,

"హాయ్ సర్! కంగ్రాట్యులేషన్స్!" అంది.

తుంబురుడి వీణానాదంలా ఉంది ఆమె స్వరం. శంఖంలాంటి ఆమె గొంతు నుండి వెలువడే ప్రతీ ధ్వనీ అంత మధురంగా, వీనులవిందుగా కాకుండా మరెలా ఉంటుంది.

నేను ఆమె చేతిని, మరొక్క క్షణం ఎక్కువగానే నా చేతిలో ఉంచుకుని, మృదువుగా రాస్తూ,

"థ్యాంక్స్! ఇట్స్ మై ప్లెజర్ టూ మీట్ యూ. ఐయాం బ్లెస్సడ్!" అన్నాను.

ఆ క్షణం నుంచీ, ఆ బ్యాంకు నాకు అత్తగారి ఇల్లులా అనిపించసాగింది. నేనైతే భూమికి ఆరం గుళాల ఎత్తున తేలిపోతూ నడిచాను ఆ సాయం కాలమంతా.

రెండు పరస్పర విరుద్ధ శక్తులు బలంగా ఆక ర్షించుకుంటాయి. ధన, ఋణ శక్తులున్న అయ స్కాంత ముక్కలు ఒకదానికొకటి కొంత దూరం ఉండగానే, చటుక్కున లాక్కోబడి హత్తుకుని అతుక్కు పోతాయి. వాటిని విడదీయాలంటే, ఆ రెండింటి అయస్కాంత బలాల మొత్తానికన్నా ఎక్కువ బలం ఉపయోగించాలి.

ప్రస్తుతం నేనైతే ఆ ఆకర్షణ శక్తికి లోబడి ఆమెనే అంటిపెట్టుకుని ఉండాలనే స్థితిలో ఉన్నాను.

కానీ, మా బాస్, జోనల్ మేనేజర్లు ఇద్దరూ కలిసి, నన్ను అక్కడి నుంచి హోటల్‌కు లాక్కు పోయారు.

అక్కడ కొంచెం సేపు రిలాక్స్ అయ్యి, ఫ్రెషప్ అయ్యాక పార్టీకి వెళ్ళాలి.

***

పార్క్ హయత్ హోటల్.

హైదరాబాద్ నగరంలో పేరున్న ఐదు నక్ష త్రాల హోటళ్ళలో పేరున్న హోటల్. మాన్యులకే గానీ, సామాన్యులకు అందని ద్రాక్ష వంటి హోటల్.

రూం నెంబర్ 963 లో రూం సర్వీసు వాళ్ళు బాత్‌టబ్బులో బబుల్ స్ప్రే చేసి నీటి ఉష్ణోగ్రతను నాకు కావలిసిన రీతిలో అడ్జస్ట్ చేసి 'డ్రా' చేసి అంటే సర్వం సిద్ధం చేసి వెళ్ళారు.

నేను సాక్షి రెడ్డిని కలిసిన ఆనందంలో గుర్తించ లేదు కానీ, నా ఒళ్ళంతా, నాలుగు రోజుల కఠిన శ్రమ వల్ల, నిద్రలేమి వల్ల, పచ్చి పుండులా పులిసి పోయింది. అందుకే బ్యాంకు నుంచి రాగానే, పార్టీకి చాలా టైం ఉండడంతో, హోటల్లో ఇరవై నాలుగ్గం టల పాటు సదా సన్నద్ధంగా ఉండే కాంప్లిమెంటరీ 'థాయ్' మసాజర్(మస్యూర్)ను పిలిచాను. అతను అరగంట పాటు నా ఒంట్లోని అవయవాలన్నీ ఏ కీలుకు ఆ కీలు విరిచేశాడు.

తర్వాత DRT చేశాను. దాంతో ఒంట్లోని అల సట అంతా పటాపంచలై పోయింది.

మెల్లిగా బాత్‌టబ్బులోకి దిగాను.

ఘుమఘుమలాడుతున్న, సుగంధ ద్రవ్యాలూ, హెర్బల్ ఆయిల్సూ కలిపిన, గోరువెచ్చటి నీళ్ళు నా శరీరాన్ని ఆప్యాయంగా ఆహ్వానించాయి. ప్రియురా లిలా నా శరీరాన్ని అవి గాఢ పరిష్వంగంలోకి తీసు కున్నాయి. నా మనసు ఏవేవో సుందర ప్రదేశాల్లో విహరిస్తుండగానే, రెండు నిముషాల్లో మత్తు ఆవ హించినట్టయింది.

ఫోన్ మోగితే కళ్ళు తెరిచాను. ఒక్క క్షణం క్రితమే కళ్ళు మూసుకున్నాననుకున్నాను గానీ బాత్‌టబ్బులోకి దిగి అరగంట పైనే అయింది.

తలుపు ముందర హౌస్ కీపింగ్ వాళ్ళు నా సూట్‌ను ఎక్స్‌ప్రెస్ డ్రై క్లీన్ చేసి పట్టుకొచ్చిన విషయం మానిటర్లో కనపడింది. నేను బద్ధకంగా రిమోట్‌తో తలుపు తీశాను. వాళ్ళు నిశ్శబ్దంగా సూట్ హ్యాంగర్‌ను కప్‌బోర్డుకు తగిలించి వెళ్ళారు.

టైం చూశాను. పార్టీకి ఇంకా చాలా టైముంది.

నేను మళ్ళీ కళ్ళు మూసుకున్నాను. కానీ, కళ్ళ ముందర సాక్షి ప్రత్యక్షమయింది. బ్యాంకులో ఆమెను చూసినప్పటి నుండీ మనసు ఏదో మధు రోహల్లో తేలిపోతోంది. తనువూ, మనసూ పదే పదే ఆమె సాన్నిహిత్యాన్నే కోరుతోంది. తను నా నుండి విడిపోయిన ఒక అభిన్న శరీర భాగమేమోనని అని పిస్తోంది.

నేను సాధారణంగా, అంత తొందరగా, ఏ స్త్రీ పట్ల ఆకర్షితుణ్ణి కాను. ఎంత గొప్ప అందగత్తె అయినా నేను చలించను. గత అనుభవాల దృష్ట్యా నేను, వద్దనుకున్నప్పుడు, కఠిన శిలగా మారిపో గలను. అందుకే నేను అందగత్తెల పట్ల అట్రాక్ట్

**పార్క్ హయత్ హోటల్... పార్టీ హాలు కోలాహలంగా ఉంది. చాలామంది వచ్చారు. ఒకరకమైన జుబిలియెంట్ మూడ్ ఉంది. అతిథులంతా ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్టుగా ఉంది. అప్పుడే హాల్లోకి ఎంటరయ్యాడతను. అతని కళ్ళు ఎవరి కోసమో చుట్టూ పరికిస్తున్నాయి. వేదిక దగ్గరగా, అతని చూపు నిలిచిపోయింది. అతను ఎవరికోసం చూస్తున్నాడు?**

కాగూడదని గట్టిగా నిర్ణయించుకున్నాను. కాబట్టే, బెంగుళూరు వంటి మహానగరంలో అందగత్తెలకు కొరత లేకున్నా నేను ప్రేమలో పడలేదు. అలాగే, నా ప్రొఫెషన్‌లో హై ప్రొఫైల్ సర్కిల్స్‌లో అద్భుత సౌందర్యరాశులు, నా లాంటి బ్యాచిలర్స్ అంటే పడి చచ్చే వాళ్ళు కోకొల్లలు. ఆ సర్కిల్స్‌లో, పెద్దగా, నీతి నియమాలు అంటూ నీతిపన్నాలు వల్లించే వాళ్ళు కూడా ఉండరు. అయినా సరే, నేను ఏమంతగా, ఇంప్రెస్ కాలేదు. వాళ్ళతో ఉంటే గింటే శారీరక సంబంధంతప్ప ఎమోషనల్ అటాచ్‌మెంట్ ఉండదు నాకు. వాళ్ళనే తప్పక కలుసుకోవాలనే తపన, "yearning" ఉండదు. వాళ్ళ సమక్షంలో కాలం గడపాలనే కాంక్ష ఉండదు.

కానీ, సాక్షిని చూసినప్పటి నుండీ, నాలో మరు గున పడిపోయాయనుకున్న మధుర భావాలు చిగురించసాగాయి. మామూలుగా ఈ వయసులో ఉండే యువకులకు లాగే నాలోనూ స్పందనలు కలుగుతున్నాయి. చిత్రంగా ఇంత వరకు నేను ఆమె ముఖాన్ని తప్ప ఆమె శరీరాన్ని చూడలేదు. నా చేతిలోని బొకేలు తీసుకోవడానికి నా దగ్గరగా వచ్చినప్పుడు ఆమె ఒంటిరంగు మాత్రం చూశాను.

అంట కాగిన ఆవుపాలమీది మీగడలను పొరలు పొరలుగా పేర్చి, ఇరవై నాలుగ్గంటల పాటు ఫ్రీజ్ చేస్తే వచ్చే మీగడ రంగు, ఆమె ఒంటి రంగు.

తను నాకు అంత దగ్గరగా వచ్చేసరికి, ఆమె ఒంటి నుంచి వీచిన పొగడపూల పరిమళం నన్ను మైమరపించింది. ప్రతీ స్త్రీకి ఒక శరీర పరిమళం (scent of the woman) ఉంటుంది. కేవలం రసికుడైన పురుషుడు మాత్రమే అది గుర్తి స్తాడు. దీనికి కేవలం నాసికలు పని చేస్తే చాలదు. స్త్రీ హృదయాన్ని, ఆమె అంతరంగాన్ని, అంతర్గత పరిమళాలను గుర్తించే ఆఘ్రాణ శక్తి ఉండాలి. ఆ విద్యలో నేను డిస్టింక్షన్‌లో పాసయ్యాను కదా! అందుకే సాక్షి ఒంటి పరిమళాన్ని పసిగట్టాను.

అయినా ఆమె పట్ల నాకు అనురాగం కలగడం నాకే ఆశ్చర్యంగా ఉంది. రాగిణి తర్వాత, ఏ అమ్మాయి సమక్షంలో కూడా, నాకు, ఇలాంటి స్పందనలు కలగ లేదు.

సాక్షి సమక్షంలో పాత గాయాల తాలూకు మచ్చలు మరుగున పడిపోసాగాయి.

అందుకే, పార్టీకి వెళ్ళడానికి మరింత శ్రద్ధగా తయారయ్యాను. నాలుగురోజుల ముదురు



గడ్డాన్ని ట్రిమ్ చేశాను. ట్రిమ్ చేసినంతమేరా చెంపలు పచ్చగా మెరిసిపోతున్నాయి. నాకెంతో ఇష్టమైన మెరూన్ కలర్, బంద్‌గలా సూట్ వేసుకుని అదే హోటల్లో అరేంజ్ చేసిన పార్టీకి బయల్దేరాను.

పార్టీ హాల్ అంతా కోలాహలంగా ఉంది. చాలా మంది కపుల్స్ వచ్చారు. ఒక జుబిలియెంట్ మూడ్ ఏర్పడి ఉంది.

నేను హాల్లోకి ఎంటర్ కాగానే నా కళ్ళు మొత్తం హాలును స్కాన్ చేశాయి సాక్షి కోసం.

హాల్లో ఉత్తర దిశగా ఒక తాత్కాలిక వేదికను ఏర్పాటు చేశారు. అతిథులంతా అక్కడే గుమికూడి ఉన్నారు. వారిలోనే సాక్షి కూడా ఉంది. నా రాక గురించి ఎవరో చెప్పినట్టుంది. తను నా వైపు తిరిగింది.

"ఓ మై గాడ్!" అనుకున్నాను ఆమెను చూడ గానే.

తను ఇప్పుడు పసుపు రంగు పట్టుచీరలో ఉంది. అసలు ఒంటి చుట్టూ చీరే లేనట్టూ, తనే ఒక బంగారు శిల్పం అయినట్టూ మెరిసిపోతోంది. పార్టీ హాల్లోని షాండిలియర్ లైట్ల వెలుతురు ఆమె మీద పడి పరావర్తనం చెంది, చూపరుల కళ్ళు మిరు మిట్లు గొల్పుతున్నాయి.

నిజానికి, సాక్షిని, మొత్తంగా, అప్పుడే చూస్తు న్నాను.

సౌందర్యాన్నంతా ఒక మౌల్డ్‌లో గుమ్మరిస్తే తయారయిన, పోతపోసిన పసిడిబొమ్మలా ఉంది. ఈ నాటి జీరో సైజు బొమ్మల్లా, చీకి పారేసిన మామిడి టెంకల్లాంటి ముఖాలతో కాకుండా పుష్టిగా,

# లాకర్ నెం.369

## కూపన్ నెం.2 విజేత


**ఎన్. చాముండేశ్వరి**

గుంటూరు


అణువణువూ జీవచైతన్యం తొణికిసలాడుతున్న ట్టుగా, పచ్చటి ఒంటి చర్మం కింద శృంగార రసం పరుగులు తీస్తున్నట్టుగా ఉంది. టచ్ చేస్తే చాలు ఆ పరువాల ప్రభావంతో మనసు పరవశంలో మునిగిపోతుంది.

తను నన్ను చూడగానే నా వైపు వడివడిగా అడుగులు వేసింది.

నా వైపు, రాయంచలా అడుగులు వేస్తూ వస్తున్న, సాక్షిని చూస్తేనే మనసు పులకరించి పోయింది. ఆమె ముఖంలో తాండవిస్తున్న సంతోషం, నుదుటి మీది దోసగింజ ఆకారంలోని స్టిక్కర్, దాని క్రింద అలవోకగా అద్దిన కుంకుమ బొట్టూ, ముక్కుకు మెరుస్తున్న ముక్కుపుడకా ఒక హుందా తనాన్ని ఆపాదిస్తున్నాయి.

తను నా దగ్గరకు రాగానే, ఎంతో కాలంగా పరిచయమున్నట్టుగా నా రెండు చేతులు పట్టు కుంది. డయాస్ వైపు దారి తీసింది. ఆ పార్టీ కోసం తను పెద్దగా, అదనంగా అలంకరించుకోలేదు. అయినా, ఆమెలో ఏదో కొత్తదనం, ఏదో మెరుపు గోచరిస్తోంది నాకు. తను నా చెయ్యి పట్టుకుని తీసుకెళ్తున్నప్పుడు ఆమె శరీర భాగాలు నాకు సుతారంగా తాకుతున్నాయి. ఆ మాత్రం స్పర్శకే నేను పులకించి పోయాను. అందరినీ తప్పించుకుంటూ మేము డయాస్ చేరగానే, తను పక్కకు తప్పుకుంది.

అక్కడ మా బాస్, జోనల్ మేనేజర్ ఇంకా బ్యాంకు ఉన్నతాధికారులు ఉన్నారు.

నేను రాగానే, మా బాస్ నన్ను పక్కకు లాక్కె ళ్ళాడు.

నేను అసహనంగా,

"రాజీవ్! ఏమిటిదంతా? చాలా టూ మచ్ చేస్తున్నాడు!" అన్నాను.

నాకు సాక్షిని చూడగలగడం సంతోషమే అయినా, ఇదంతా కృత్రిమంగా అనిపించింది.

"ష్! మెల్లిగా. ఈ జోనల్ మేనేజర్ ప్రమోషన్ లిస్టులో ఉన్నాడని చెప్పాను గదా! ఏదో ఒక వంకన వాళ్ళ హెడ్డాఫీసు బాసులను కాకా పట్టడానికి, ఇంప్రెస్ చేయడానికి ఇదంతా చేస్తున్నాడు. ఇప్పుడు కూడా హెడ్డాఫీసు నుండి వాళ్ళ పర్సనల్ డిపార్ట్‌మెంట్ జనరల్ మేనేజర్ వచ్చాడు. జోనల్ మేనేజర్ పక్క నున్న బట్టతల వ్యక్తి అతనే. అతన్ని బుట్టలో వేయ డానికే ఒక క్లయింటుతో చెప్పి ఈ పార్టీని స్పాన్సర్ చేయించాడు." అన్నాడు.

ఇంతలో జోనల్ మేనేజర్ మా దగ్గరకు వచ్చి మమ్మల్ని తీసుకుని వెళ్ళి, వాళ్ళ జనరల్ మేనే

---

ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!
మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి
కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!

## లాకర్ నెం. 369-4 (19-7-2017)

మా ప్రశ్న: బంగారు రంగు కేసులో ఉన్న ఏ బొమ్మ మెమొంటోను ఆ అధికారికి బ్యాంకు తరపున ఇచ్చారు?

మీ జవాబు--------------------------------------------------------------------------------

చిరునామా--------------------------------------------------------------------------------

--------------------------------------------------------------------------------

--------------------------------------------పిన్------------------------ఫోన్‌నెం--------------------------------

ఈ కూపన్‌ను 18 జూలై 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

వివాహాది శుభకార్యాలకు కంచిపట్టు చీరల నిలయం పి.యస్.మూర్తి క్లాత్ స్టోర్స్ మెయిన్‌రోడ్, హన్మకొండ వారి సౌజన్యంతో...

*నిబంధనలు వర్తిస్తాయి

జరుకు పరిచయం చేశాడు. తర్వాత,

"హలో ఫ్రెండ్స్! సైలెన్స్ ప్లీజ్!" అంటూ మైకులో అరిచి రెండు నిమిషాల్లో గోల తగ్గగానే,

"ఈ రోజు మన బ్యాంకు చరిత్రలో అత్యంత ప్రాధాన్యత కలిగిన రోజు. మనమొక గొప్ప ప్రమాదం నుండి బయటపడ్డాం. ఆల్ బికాజ్ ఆఫ్ దిస్ యంగ్ మ్యాన్!" అంటూ నా చేతిని పైకి లేపి,

"గివ్ ఏ బిగ్ ఛీర్ టూ హిం" అంటూ అందరికీ నన్ను పరిచయం చేశాడు.

తర్వాత అందరూ కలిసి,

".... బ్యాంక్ జిందాబాద్.... జిందాబాద్" అనీ

"జోనల్ మేనేజర్ జిందాబాద్" అనీ

"జనరల్ మేనేజర్ జిందాబాద్" అనీ

"....... కంపెనీ జిందాబాద్" అని పార్టీ స్పాన్సర్ చేసిన కంపెనీ పేరుతో ఐదు నిమిషాల పాటు నినాదాలు చేశారు.

"బ్యాంక్ వాళ్ళు ఎక్కడికి వెళ్ళినా ఆఖరుకు ఫైవ్‌స్టార్ హోటల్లో పార్టీకి వచ్చినా అరవడం




మాత్రం మానరు" అనుకున్నాను.

తరువాత, తన ప్లాన్ సక్సెస్‌ఫుల్‌గా అమలు పరచబడి, జనరల్ మేనేజర్ సంతోషించడంతో, మైకు తీసుకుని, జనరల్ మేనేజర్ వైపు చూస్తూ,

"సార్! ఈ కేసు వివరాలన్నీ మీకు తెలుసు. అయినా, మీకేమైనా సందేహాలుంటే తీర్చాలని జస్ట్ ఫర్ ది సేక్ ఆఫ్ రికార్డ్ ఈ కేసు పూర్వాపరాలు చెబుతాను. మన 'మాకనూరు' బ్రాంచిలో మన ఎంప్లాయే దొంగతనం చేశాడు. నాలుగు రోజులైనా పోలీసులు అతని ఆచూకీ కనిపెట్టలేక పోవడంతో మన సెక్యూరిటీ ఏజెన్సీ సహకారం తీసుకున్నాము. దిస్ గై, యూ నో సర్! యాన్ ఇంట్రెస్టింగ్ థింగ్ అబౌట్ హిం ఈజ్, అతను ఇంతకు ముందు మన బ్యాంకులో పనిచేసిన ఆఫీసరే. బ్యాంకుకు రిజైన్ చేసి, ఐపీయస్‌గా పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో చేరి, అక్కడా రిజైన్ చేసి తర్వాత ఈ సెక్యూరిటీ ఏజెన్సీలో చేరాడు." అంటూ జనరల్ మేనేజర్ వైపు చూశాడు. అందుకు ఆయన ఆశ్చర్యపోయినట్టుగా, మొదటిసారే విన్నట్టుగా, సరిగ్గానే రియాక్షన్ ఇచ్చే సరికి పొంగిపోయి,

"ఇతనే ఈ కేసును ఛేదించాడు. సింహాద్రి అనే జూనియర్ మోస్ట్ క్యాషియర్, మన సీనియర్ ఆఫీసర్లు నిర్లక్ష్యంగా వ్యవహరించడం వల్ల, తను చేజిక్కించుకున్న కీస్‌తో కరెన్సీ ఛెస్ట్‌ను, లాకర్‌లను బ్రేక్ ఓపెన్ చేసి వంద కిలోల బంగారం, యాభై కోట్ల రూపాయలను దోచుకున్నాడు. అతనికి, ఈ దోపిడీలో, అతని బంధువూ, 'మాకనూరు' బ్యాంకు ఉద్యోగులకు టీ సప్లై చేసే 'పాటిల్' అనేవాడూ సహాయం చేశారు. దోపిడీ జరిగిన శనివారం రాత్రి మూడు గంటల సమయంలో ఈ ముగ్గురూ పెద్ద పెద్ద బ్యాగులతో రైల్వే స్టేషనుకు వెళ్ళడం చిన్న మల్లయ్య అనే గ్రామస్థుడు చూశాడు. కానీ, సింహాద్రి బ్యాంకు క్యాషియర్ కావడంతో అతనికి అనుమానం రాలేదు. వీళ్ళు ముగ్గురూ స్టేషనుకు చేరుకునే సరికి అక్కడ ఆ రోజు స్పెషల్ డ్రైవ్ ఉండడంతో, రైల్వే పోలీసులు మోహరించి ఉన్నారు. వీళ్ళు భయపడి నగలూ, నగదును వాటర్ టైట్ బ్యాగుల్లో సర్ది, కృష్ణానది మధ్యలో, పెద్ద పెద్ద బండరాళ్లకు కట్టి దాచిపెట్టి, పారిపోయారు. ఇద్దరు పారిపోగా, పాటిల్ అనేవాడు ఊళ్ళోనే ఉండి ఇక్కడి విషయాలన్నీ వారికి చేరవేస్తుండేవాడు. అందుకే నాలుగు రోజులైనా సింహాద్రి ఆచూకీ దొరకలేదు. మనకు వాడి మీద అనుమానం ఉన్న మాట నిజమే అయినా ఎందుకో అతడే దొంగ అనే నిర్ధారణకు రాలేక పోయాం. ఈ హీరో ఎంటర్ అయ్యి, పోలీసు యంత్రాంగాన్నీ, ఊరివాళ్ళనూ, బ్యాంకు వాళ్ళనూ ఉరుకులు పరుగులు పెట్టించి సింహాద్రిని ట్రేస్ చేశాడు. తర్వాత వాణ్ణి ఊర్లోకి రప్పించడానికి ఒక ప్లాన్ ప్రకారం అక్కడి నుంచి బిచాణా ఎత్తి వేస్తున్నట్టు నాటకం ఆడారు. పాటిల్‌ను ఫాలో అయ్యి వాడి ఫోన్ సంభాషణలన్నీ టాప్ చేసి, వాడి ద్వారానే సింహాద్రి మీద ఒత్తిడి పెంచి, మొత్తానికి దొంగను 'మాకనూరు' రప్పించాడు. సింహాద్రి 'రాయచూర్'లో రైలెక్కినప్పటి నుంచీ పోలీసులు అతన్ని వెంబడించారు. వాళ్ళిద్దరూ అతి తెలివిగా రైలు కృష్ణా స్టేషన్‌లోకి రాక ముందే, ఔటర్‌లో ఆగినప్పుడు, దూకి నది వైపు పరిగెత్తారు. నదీగర్భంలో దాచిన సొమ్మును వాళ్ళు ముగ్గురూ బయటికి తీసుకొస్తుండగా, రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకున్నారు. నాలుగు రోజుల పాటు నిద్రాహారాలు మాని శ్రమించినందుకు ఫలితం దక్కింది." అంటూ ఊపిరి పీల్చుకున్నాడు.

ఇప్పటి వరకు జోనల్ మేనేజర్ అంటే నాకు కొంచెం చులకన భావం ఉండేది. కానీ, అతను అంత పకడ్బందీగా సంఘటనలను ప్రెజెంట్ చేసిన తీరును చూసి అచ్చెరువొందాను. ఇద్దరు బ్యాంకు సీనియర్ ఆఫీసర్లనూ ఇరికించాడు. కేసును తనే సాల్వ్ చేసినంత బిల్డప్ ఇచ్చాడు. తన తప్పేమీ లేదని జనరల్ మేనేజరుకు చెప్పకనే చెప్పాడు.

మళ్ళీ మొదలు పెట్టాడు.

"వీ ఆర్ వెరీ ప్రౌడ్ ఆఫ్ దైర్ సర్వీసెస్ సర్! మీరు వాళ్ళను కన్సల్ట్ చేయమని ఇచ్చిన సలహా వల్లనే ఇదంతా ఈజీగా సాల్వ్ అయిపోయింది సర్! థ్యాంక్యూ వెరీ మచ్ ఫర్ యువర్ గైడెన్స్ ఎట్ ఏ క్రిటికల్ టైం సర్!" అంటూ అతన్ని మునగ చెట్టు ఎక్కించే ప్రయత్నాలు ప్రారంభించాడు.

అందరూ చప్పట్లతో అభినందించడం మొదలు పెట్టారు.

'మా బ్యాంకు తరఫున ఒక చిన్న మొమెంటో!' అంటూ బంగారు రంగు కేస్‌లో ఉన్న చార్మినార్ బొమ్మను సాక్షి తీసుకు రాగా జనరల్ మేనేజర్ చేతుల మీదుగా నాకు ఇప్పించారు. నేను దాన్ని తీసుకుని వనజకు అందించాను.

"మీరు కూడా రెండు ముక్కలు మాట్లాడండి, ప్లీజ్!" అంటూ జోనల్ మేనేజర్ మైకును నాకు అందించబోతూ, అప్పుడే హాల్లోకి ప్రవేశించిన వ్యక్తిని చూసి,

"ఐయాం వెరీ వెరీ హాపీ టూ అనౌన్స్ దట్ అవర్ బిలవ్డ్ రామస్వామి గారు ఇప్పుడే వచ్చారు. లెటజ్ వెల్కం హిం విత్ బిగ్ అప్లాజ్" అంటూ ముఖం నిండా చిరునవ్వులు పులుముకుని ఆ వ్యక్తిని ఆహ్వానించాడు.

ఆ పేరు వినగానే నా ఒంటి మీద తేళ్ళూ జెర్రులూ పాకినట్టయింది. 'అతనేనా?' అని భయపడుకుంటూ ఆ వైపు చూశాను.

సాక్షి చిరునవ్వుతో అతన్ని రిసీవ్ చేసుకుని మా దగ్గరకు తీసుకు వస్తోంది.

సాక్షి వంటి అందాల చందమామను కారు మబ్బులు కమ్మినట్టుగా; క్షీరసాగర మథనంలో ఉద్భవించిన చంద్రబింబాన్ని కబళించే రాహువులా; ఎక్కడ పచ్చని చెట్లు, మంచి మనుషులు సుఖ సంతోషాలతో నివసిస్తుంటారో అక్కడ అగ్నిపీడగా, శని దేవత నాట్యమాడుతున్నప్పుడు, వేరు దగ్గర నుంచి సైతం డొల్ల చేస్తూ ఆనంద హరిత వనాలను కబళించే వేరు పురుగు లాంటి మనిషి ముఖం సాక్షి వెనకాల వస్తూ కనిపించింది.

నేను ఒళ్ళంతా కంపించి పోయాను. నాకు ముచ్చెమటలు పోయసాగాయి. కళ్ళు తిరగసాగాయి.

నేను స్పృహ తప్పి పడబోతుంటే ఒక దేవత చేతులు నన్ను కింద పడకుండా కాపాడాయి.

పచ్చని పట్టుచీరల సౌకుమార్యం కూడా నాకు సాంత్వన కలిగించలేదు.

నేను స్పృహ తప్పాను.

**(ఇంకా వుంది)**

# CRIME తాను తవ్వుకున్న గొయ్యి

**అదో ఖరీదైన బంగళా. అందులో ఉంటున్నది నలుగురే. యజమాని ఆనంద్, ఆయన భార్య గీతాంజలి, ఆనంద్ తమ్ముడు మోహన్, గీతాంజలి చెల్లెలు అంజలి. మోహన్ అవివాహితుడు.**

**ఆ ఇంట్లో అందరికీ బెడ్‌కాఫీ అలవాటు. పనిమనిషి విమల ఉదయం కాఫీ కలిపింది. ఆనంద్, గీతాంజలి గదికివెళ్ళి వాళ్ళిద్దరికీ కాఫీ ఇచ్చి మోహన్ గదికి వచ్చింది. అతను గదిలో లేడు. దాంతో అంజలి గది తలుపు తట్టింది విమల.**

తలుపు తెరుచుకోలేదు. ఈసారి గట్టిగా తలుపు తట్టింది. అయినా తలుపు తెరుచుకోలేదు. ఎంత పిలిచినా, గట్టిగా తట్టినా తలుపు తెరవ లేదు అంజలి. దాంతో విమల భయపడింది. కంగారుగా కేకలుపెట్టింది. కేకలు విని ఆనంద్, గీతాంజలి పరుగున వచ్చారు. మాస్టర్ కీ తెచ్చి ఆటోమేటిక్ డోర్ లాక్ సిస్టం ఉన్న ఆ గది తలుపులు తెరిచారు.

గదిలో బెడ్‌మీద అంజలి అచేతనంగా పడి ఉంది. చెల్లెలు శరీరాన్ని తాకి చూసింది గీతాంజలి. చల్లబడిపోయింది. బీరువా తెరచివుంది. అందులో వస్తువులన్నీ చెల్లాచెదురై ఉన్నాయి. లాకర్‌లోని నగలపెట్టె ఖాళీగా ఉంది. అందరూ షాక్ అయ్యారు. గీతాంజలి పెద్దగా ఏడ్వసాగింది.

ఆనంద్ పరుగునవెళ్ళి పొరుగునున్న డాక్టర్‌ను పిలుచుకొచ్చాడు. ఆయన అంజలిని పరీక్షించాడు. విషం తాగటంవల్ల మరణించివుండొచ్చని, ఇది పోలీస్‌కేసని చెప్పాడు.

ఆనంద్ వెంటనే పోలీస్‌స్టేషన్‌కు ఫోన్‌చేశాడు.

***

ఇన్‌స్పెక్టర్ సింగ్ అరగంటలోనే తన బలగంతో ఆ బంగళాకు చేరుకున్నాడు. మృతురాలిని క్షుణ్ణంగా పరిశీలించాడు. ఆమె శరీరం నీలంగా ఉంది. దాంతో తన అనుమానం బయటపెట్టకుండా గదంతా పరిశీలించాడు. బీరువా దగ్గరకెళ్ళి చూశాడు. బీరువాలో వస్తువులు చిందరవందరగా పడి ఉన్నాయి. లాకర్ తలుపు తెరచి ఉంది. లోపల నగలపెట్టె ఖాళీగా ఉంది. ఆ గది కిటికీ తెరచి ఉంది. దానికున్న ఐదు ఊచల్లో ఒకటి లేదు. మరొక ఊచకు ముడివేసిన నైలాన్‌తాడు బయటికి వేలాడుతోంది.

సింగ్ వెంటనే ఓ కానిస్టేబుల్‌ను పిలిచి చెవిలో ఏదోచెప్పి బయటకు పంపాడు.

"ఇంట్లో ఏవైనా వస్తువులు పోయాయా?" అడిగాడు.

"బీరువా లాకర్‌లో నగలపెట్టె ఉండాలి?" చెప్పింది గీతాంజలి.

"లాకర్ కీ ఎవరి దగ్గర ఉంటుంది?" ప్రశ్నించాడు సింగ్.

"నా దగ్గర ఉంది" అంది గీతాంజలి.

బయటికి వెళ్ళిన కానిస్టేబుల్ తిరిగొచ్చి సింగ్ చెవిలో ఏదో చెప్పాడు.

అంతలో ఆ గది బాత్‌రూం చూసేందుకు వెళ్ళిన మరో కానిస్టేబుల్ కేకపెట్టి పిలిచాడు. సింగ్ వెంటనే అక్కడికి వెళ్ళాడు. గదిమూల ఒక ఐరన్ రాడ్ ఉంది. గ్లౌజులు తొడిగిన చేతులతో ఆ రాడ్ తీసుకొచ్చి కిటికీ ఊచలతో పోల్చి చూశాడు సింగ్. అది కిటికీ ఊచే.

ఫొటోగ్రాఫర్లు, వేలిముద్రల నిపుణులు తమ పనులు ముగించి వెళ్ళిపోయాక అంజలి శవాన్ని పోస్ట్‌మార్టం నిమిత్తం ప్రభుత్వ ఆస్పత్రికి తరలించారు. పోలీస్ కానిస్టేబుల్స్ శవాన్ని బెడ్‌మీది నుంచి దించుతుండగా తలగడకింద కనిపించిన వస్తువును చూడగానే ఇన్‌స్పెక్టర్ సింగ్ కళ్ళు మెరిశాయి. మాలా-డి టాబ్లెట్లు. అంజలికి వివాహం కాలేదు.

వెంటనే గీతాంజలిని పక్కగదిలోకి తీసుకెళ్ళి ప్రశ్నించాడు సింగ్. "మీ చెల్లెలు ఎవరినైనా ప్రేమించిందా? ఆమె ప్రవర్తన ఎలాంటిది? ఆమె ఈ టాబ్లెట్లు ఎందుకు వాడుతోంది? అంజలి మరణానికి సరైన కారణం తెలుసుకోవాలన్నా, హంతకుడిని పట్టుకోవాలన్నా మీరు ఏదీ దాచకుండా చెప్పాలి".

గీతాంజలి కాస్సేపు తటపటాయించి తర్వాత చెప్పింది. "మా మరిది మోహన్‌కు ఇచ్చి చెయ్యాలనే ఉద్దేశంతో నా చెల్లెలు అంజలిని ఇక్కడికి పిలిపించాను. కొన్నాళ్ళు ఒకేచోట ఉంటే ఒకరినొకరు అర్థం చేసుకుంటారని తరువాత వివాహం చేయవచ్చని నేను, మా ఆయన అనుకున్నాం. మా మరిది మంచి కంపెనీలో పని చేస్తున్నాడు. ఇద్దరి మధ్య చనువు ఉంది. కానీ వారు ఇంత దగ్గరయ్యారని ఊహించలేకపోయాను. అయితే మా మరిది హత్య చేసేంతటి నీచుడు కాదు, చాలా మంచివాడు" అంది ఏడుస్తూ.

ఇంట్లో అందరిని విచారించి వివరాలు రాసుకున్న తర్వాత అక్కడి నుండి బయలుదేరాడు సింగ్.

***

కుర్చీలో కూర్చున్న ఇన్‌స్పెక్టర్ సింగ్ ఏదో ఆలోచిస్తూ అసహనంగా కదిలాడు.

ఎంత ఆలోచించినా అంజలి కేసు పరిష్కారానికి క్లూ దొరకలేదు.

ఆ రోజు బంగళానుండి బయటకొచ్చిన సింగ్ నేరుగా మోహన్ పనిచేస్తున్న కంపెనీకి వెళ్ళి అతని గురించి దర్యాప్తు చేశాడు. ఘటన జరిగిన రోజు మోహన్ నైట్‌డ్యూటీలో ఉన్నమాట నిజమే. అయితే ఎర్లీ లాగౌట్ అయ్యాడు. అంత తొందరగా పని ముగించుకుని మోహన్ ఎక్కడికి వెళ్ళాడు? ఇంటికి వెళ్ళి అంజలిని హత్యచేశాడా? కిటికీఊచ తొలగించి ఆమె గదిలోకి ప్రవేశించాల్సిన అవసరం ఏముంది? అంజలిని ఎందుకు హత్యచేశాడు? అనే ప్రశ్నలు సింగ్ ముందుకొచ్చాయి. దాంతో విచారణ ప్రారంభించాడు. సుమలత అనే అమ్మాయిని మోహన్ ప్రేమిస్తున్నాడు. అంజలి మరణించిన రోజు రాత్రి ఎర్లీ లాగౌటయ్యాడు. నేరుగా ఆమె ఇంటికి వెళ్ళాడు. మోహన్ సుమలత ఇంట్లో ఉన్నాడని పోలీసు ఎంక్వైరీలో వెల్లడైంది.

అంజలి హత్య విషయం ఇన్‌స్పెక్టర్ సింగ్ ద్వారా తెలుసుకున్న మోహన్ ఆశ్చర్యపోయాడు. అంజలి హత్యతో తనకు ఎలాంటి సంబంధం లేదన్నాడు. సుమలత అతని వాదనను బలపరిచింది. తనకిచ్చి పెళ్ళిచేసే ఉద్దేశంతోనే అంజలిని పిలిపించారని, అయితే ముందు నుంచే సుమలతను ప్రేమిస్తున్నందువల్ల తను ఆసక్తి చూపించలేదని మోహన్ చెప్పాడు. అంజలి కూడా తనను ఆకర్షించడానికి కొన్నాళ్ళు ప్రయత్నించిందని, తనకు ఆమె పట్ల ఆసక్తి లేదని గ్రహించి తన ప్రయత్నం మానుకుందని చెప్పాడు.

**అదో పెద్ద బంగళా. ఉదయమే ఆ ఇంటి పనిమనిషి బెడ్‌కాఫీ కలిపి ఆ గది తలుపు తట్టింది. ఎంతకీ తలుపు తెరచుకోలేదు. దబదబా తలుపులు బాదినా లోపల ఆమె నిద్రలేవలేదు. చివరకు మాస్టర్ కీతో తలుపులు తీసి చూశారు. గదిలో బెడ్‌మీద అచేతనంగా పడి వుంది ఆమె. బీరువా చిందరవందర చేశా రెవరో. నగలు దొంగిలించారు. కిటికీకి తాడు వేలాడుతోంది. ఇంతకూ రాత్రి ఏం జరిగినట్టు? ఆమెను రేప్‌చేసి చంపేశారా?**

మోహన్ మాటల్లో సింగ్‌కి నిజాయితీ కని పించింది. అతను చెప్పినదాంట్లో అబద్ధం లేదని పించింది. మరి హంతకుడెవరు? హత్య ఎందుకు జరిగింది? దొంగతనమే హత్యకు కారణమా? లేక ఇంకేదైనా ఉందా? కొత్త కోణంలో ఆలోచించాడు.

ఆ ఇంటి పనిమనిషి విమలను ఓ కానిస్టే బుల్ రహస్యంగా వెళ్ళి కలిశాడు. మాలా-డి మాత్రలు ఏ మెడికల్‌షాపులో కొన్నారు? ఎవరు కొన్నారు? వాటిని తెప్పించుకున్నదెవరు? లాంటి విషయా లన్నీ సేకరించి సింగ్ చెవినవేశాడు. కేసు పరిష్కా రానికి ద్వారాలు తెరుచుకుంటున్నట్టు అనిపిం చింది సింగ్‌కి.

ఇంతలో పోస్ట్‌మార్టం నివేదిక వచ్చింది. విష ప్రయోగంవల్ల అంజలి మరణించింది. పైగా ఆమె రెండు నెలల గర్భవతి అని నివేదికలో వెల్ల డైంది. ఆ నివేదిక పరిశీలించాక సింగ్ అనుమానం ఆనంద్‌పైకి మళ్ళింది. 'తన గుట్టు రట్టు అవు తుందని భయపడి అతనే ఆమెను హత్య చేశాడా? లేక అంజలికి వేరెవరితోనైనా సంబంధం ఉందా? దొంగతనం ఎవరు చేశారు? కిటికీ ఊచతొలగించి లోపలికి వచ్చింది ఒకవేళ అంజలి ప్రియుడా? అయితే ఎవరు?'

ఇన్‌స్పెక్టర్ మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. కేసు ముడి విడిపోతున్నట్టు అనిపించి మళ్ళీ చిక్కు ముడి పడిందే అనుకున్నాడు. అంతలో ఫోరెన్సిక్ డిపార్ట్ మెంట్‌వారి నుండి రిపోర్ట్ వచ్చింది. ఆ నివేదిక చదివాడు సింగ్. అందులో ఒక విషయం గమ నించగానే అతని కళ్ళు తళుక్కున మెరిశాయి.

వెంటనే ఆనంద్ కుటుంబాన్ని పోలీస్ స్టేష న్‌కు పిలిపించాడు.

ఆనంద్ దంపతులను, మోహన్‌ను సాద రంగా ఆహ్వానించి తన గదిలో కూర్చోబెట్టి కాఫీలు తెప్పించాడు. ఆ అతిథి మర్యాదలకు ఆశ్చర్యపోతూ కాఫీలు సేవించారు. కాఫీలు తాగటం ముగించ గానే అందరినీ తన గదిపక్కన మీటింగ్ హాల్లోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టాడు. లోపలకి వెళుతూ కానిస్టే బుల్‌కు సైగ చేశాడు. చిన్నగా తలూపాడు అతను.

"అంజలిని ఎవరు చంపారో మరికొద్ది సేపట్లో తెలుస్తుంది. ఆమె మరణానికి కారణమైన వ్యక్తి మన మధ్యలో, అంటే ఇక్కడే ఉన్నారు" అన్నాడు నవ్వుతూ.

ఇన్‌స్పెక్టర్ మాటలకు వాళ్ళందరి ముఖాలు పాలిపోయాయి. ఒకర్నొకరు అనుమానంగా చూసు కున్నారు. మరుక్షణం వాళ్ళ ముఖాలు కోపంతో ఎర్రబారాయి.

"ఇన్‌స్పెక్టర్‌గారూ, హంతకులు మాలోనే ఉన్నా రని ఎలా చెప్పగలరు? ఆమెను హత్య చేయా ల్సిన అవసరం మాకేముంది? అయినా బయటి వాళ్ళు చేసి ఉండవచ్చు కదా?" అన్నాడు ఆనంద్.

"అంజలిని హత్య చేసినవారు ఇక్కడే ఉన్నా రని ఎందుకు అంటున్నానంటే ఆమెకు బయట



శత్రువులు ఎవరూ లేరని మా దర్యాప్తులో తేలింది. బయటినుంచి దొంగతనం చేయడానికి వచ్చిన వ్యక్తి ఆమెను హత్య చేసివుంటే అతను ఎలా చంపాడు? దేనితో చంపాడు? ఆమెకు విషం ఎలా ఇచ్చాడు? దొంగతనానికి వచ్చేవాడు విషం వెంట తెచ్చుకోవటం అసహజమైన విషయం. కిటికీ ఊచ బయటి నుంచి కోస్తే గార్డెన్‌లో పడి ఉండేది. కానీ జాగ్రత్తగా బాత్రూమ్‌లో దాచారు. అంటే ఇంట్లోవాళ్ళే చేసి ఉండాలి. దొంగతనానికి కూడా అవకాశాలు లేవు. బీరువా బద్దలు కొట్టలేదు. చక్కగా తాళా లతో తెరచారు. వస్తువులు చెల్లాచెదురుగా పడేసి దొంగతనం సీన్ క్రియేట్ చేశారు. లాకర్‌డోర్ కూడా బలవంతంగా తీసినట్టు లేదు. కీతోనే తీసి ఉండాలి. కీ అంజలి గదిలోనే ఉంటే దొంగ తాళంతో తెరిచాడనుకోవచ్చు. నేను అడిగి నప్పుడు తాళాలు గీతాంజలి లోపలి నుంచి తెచ్చి ఇచ్చింది" అంటూ

సింగ్ ఒక్క క్షణం ఆగాడు.

గీతాంజలి ముఖం వాడిపోయింది.

"పోస్ట్‌మార్టం రిపోర్ట్‌లో అంజలి రెండు నెలల గర్భవతి అని తేలింది" అని మాటలాపి మళ్ళీ ముగ్గురువైపు చూశాడు సింగ్. మోహన్, ఆనంద్ ముఖాల్లో ఆందోళన కనిపించింది. వాళ్ళను గమ నిస్తూ సింగ్ మళ్ళీ తన మాటలు కొనసా గించాడు.

"నేరస్థుడు ఎక్కడో ఒక్కచోట తప్పు చేస్తాడు. అదే అతడిని పట్టిస్తుంది. అలాంటి తప్పే ఇక్కడ జరిగింది. రెండు నెలల గర్భవతి అయిన అంజలికి మాలా-డి టాబ్లెట్ల అవసరముందా? ఒక్క టాబ్లెట్ కూడా వాడని షీట్ హత్యకు ముందురోజు సాయంత్రం తెప్పించారు. వాటిని తెప్పించిన వ్యక్తే ఆమెను చంపి ఉండాలి" అన్నాడు ఇన్‌స్పె క్టర్ సింగ్ అందరి ముఖాల వంక చూస్తూ.

సరిగ్గా అదే సమయంలో టేబుల్ మీద ఫోన్ మోగింది. ఫోన్ తీసుకుని సింగ్ అవతలి వ్యక్తి చెప్పింది విని, ఫోన్ పెట్టేశాడు. "గీతాంజలిగారూ, మీ చెల్లెలు అంజలిని హత్య చేసినట్టు ఇప్పటికైనా ఒప్పుకుంటారా? కిటికీ ఊచమీద, బీరువామీద కేవలం మీ వేలిముద్రలే ఉన్నాయి. ఇంతక్రితం మీరు తాగిన కాఫీకప్పు మీది వేలిముద్రలతో ఆ వేలిముద్రలు సరిపోయాయి. మాలా-డి టాబ్లెట్లు మీ పనిమనిషి విమలచేత తెప్పించింది కూడా మీరే చెప్పండి మీ చెల్లెల్ని ఎందుకు హత్య చేయాల్సి వచ్చింది?" సూటిగా ప్రశ్నించాడు సింగ్.

రెండు చేతులతో ముఖాన్ని కప్పుకుని బోరు మంటూ ఏడవసాగింది గీతాంజలి.

***

గీతాంజలి తండ్రి చిరుద్యోగి. ఓ చిన్న ఇంట్లో అద్దెకు ఉంటూ గుట్టుగా సంసారం సాగించే

# భయపడిన స్వీటీ

ఇది ఇప్పటి ముచ్చట కాదు. ఎప్పటి మాటో! లేడీ ఓరియెంటెడ్ సినిమాలకి అనుష్క తప్ప మరో ఆప్షన్ లేదు అన్నంతగా ప్రేక్షకుల మదిలో ముద్ర వేసింది అనుష్క. ప్రారంభంలో ఇలాంటి పాత్రలు చేయాలంటే భయమేసేది. ఒకటికి పదిసార్లు ఆలోచించేదానిని. ఆ పాత్రకు సరిపోతానా? అన్న సంశయం సినిమా షూటింగ్ పూర్తయ్యేవరకూ నాలో ఉండేది. ఇప్పుడు అలాంటి సంశయాలు లేవు. బాగా పరిపక్వత వచ్చిందని చెప్పలేను గానీ గతంలో కన్నా బెటర్ అని అంటోంది అనుష్క. కాకపోతే ఇకనుంచి సీరియస్ పాత్రలను తగ్గించుకోవాలని చూస్తోందట! అనుష్క నిర్ణయం మంచిదే కానీ, ఈ వయస్సులో ఆమెకు గ్లామర్ పాత్రలు ఎవరు ఇస్తారు? అన్న అనుమానాన్ని కొందరు వ్యక్తం చేస్తున్నారు.

వాడు. అతని ఇద్దరు కుమార్తెలే అతని అదృష్టం. ఇద్దరూ దేవకన్యల్లా ఉండేవారు. ఆనంద్ ఒక బిజినెస్‌మెన్. గీతాంజలి అందానికి అతను దాసుడయ్యాడు. వెంటనే ఆమె వివరాలు సేకరించి ఆమె తల్లిదండ్రులను కలిసి పెళ్ళి ప్రస్తావన చేశాడు. కూతురు అదృష్టానికి ఆ తల్లిదండ్రులు మురిసిపోయారు. పెళ్ళికి అంగీకరించారు. పెళ్ళి ఖర్చులు తనే భరించాడు ఆనంద్. పెళ్ళిచేసుకుని భార్యను ఇంటికి తెచ్చుకున్నాడు. రంభలాంటి భార్యతో మొదటి రాత్రి స్వర్గసుఖాలు అనుభవించాడు. ఆరోజు నుంచి ప్రతీరాత్రి మొదటిరాత్రిలాగే గడిపాడు ఆనంద్. ఆమెను ఎంతో అపురూపంగా చూసుకునేవాడు. ఇద్దరూ ఎంతో అన్యోన్యంగా ఉండేవారు.

రోడ్డు ప్రమాదంలో గీతాంజలి తల్లిదండ్రులు చనిపోయారు. అనుకోని సంఘటనతో ఆమె చెల్లెలు అంజలి ఒంటరిదైపోయింది. భర్త అనుమతితో చెల్లెల్ని తమ ఇంటికి తీసుకొచ్చింది గీతాంజలి. ఆనంద్ తమ్ముడు మోహన్‌కు పెళ్ళికాలేదు. చెల్లెలికి మరిదినిచ్చి చేస్తే ఆమె జీవితం సెటిల్ అవుతుందని అక్కా చెల్లెలు ఒకేచోట ఉండవచ్చని గీతాంజలి ఆశపడింది. ఆనంద్ కూడా అందుకు అంగీకరించాడు.

మోహన్ నచ్చటంతో అంజలికూడా అతనితో చనువుగా ఉండేందుకు ప్రయత్నించింది. అయితే మోహన్ సుమల తను ప్రేమించటంవల్ల అంజలిని తిరస్కరించాడు. అంజలి అభిమానం గాయపడింది. నిజానికి గీతాంజలికంటే రెట్టింపు అందగత్తె అంజలి. తీర్చిదిద్దిన అవయవ సౌష్టవంతో చూపరులను ఇట్టే ఆకర్షించేది. అలాంటి తనను మోహన్ కాదనటంతో అవమానంగా ఫీలైంది.

అదే సమయంలో ఆనంద్‌దృష్టి అంజలిమీద పడింది.

మిసమిసలాడే యవ్వనంతో చెంతనున్న మరదల్ని చూసి గుటకలు మింగేవాడు. మరదలనే చనువుతో సరసాలాడేవాడు. ఆ ముచ్చట్లుచూసి గీతాంజలి సంతోషించేదిగానీ ఆమెకు అనుమానమే రాలేదు.

ఒకరోజు గీతాంజలి ఫ్రెండ్ దగ్గరికి వెళ్ళింది. మోహన్ ఆఫీసుకెళ్ళాడు.

అంజలి తన గదిలో మంచంమీద పడుకుని కథల పుస్తకం చదువుకుంటోంది.

మంచంమీద అంజలి వయ్యారంగా పడుకున్న దృశ్యం చూసి అటుగావెళుతున్న ఆనంద్ షైమరచిపోయాడు. గదిలోకి వెళ్ళి మెల్లగా ఆమెను సమీపించాడు. బావను చూసి అంజలి కంగారుగా లేవబోయింది.

"లేవకు, అంజలి..." అంటూ ఆనంద్ ఆమె మీద వాలి ఆమెను గట్టిగా హత్తుకుని ముద్దులు కురిపించాడు.

మొదటిసారి పురుషస్పర్శకు ఆమెకు మతిపోయింది.

వద్దు అనబోయిన ఆమె నోటిని ఆనంద్ తన పెదవులతో మూసేశాడు.

అతని చేతులు ఆమె శరీరంమీద నాట్యం చేశాయి.

ఆమె శృతి చేసిన వీణ అయింది.

***

ఇక ఆ తరువాత ఇద్దరూ ఏకాంతం దొరకగానే కలుసుకుని కోరికలు తీర్చుకునే వారు.

వారిద్దరి మధ్య సంబంధం ఏర్పడిందన్న విషయం గీతాంజలికి తెలిసే సమయానికి అంజలి రెండు నెలల గర్భవతి. గీతాంజలి నెత్తిన పిడుగు పడినట్టయ్యింది. తనకు ద్రోహం చేసిన భర్త మీద, తోడబుట్టిన చెల్లెలుమీద పట్టరాని కోపం వచ్చింది. తన సంసారానికే ముప్పు వచ్చిందని భయపడింది. భర్త తనకు దూరమైపోతాడని భయపడింది. దాంతో బాగా ఆలోచించి ఓ పథకం వేసింది. ఆ పథకం ప్రకారం ఓ కెమికల్ ల్యాబ్‌లో పనిచేసే తన మిత్రురాలి సహాయంతో 'ఆర్సెనిక్ ఆల్బమ్' విషపదార్థం సంపాదించింది. ఆ రాత్రి భోజనంలో కలిపి అంజలి గదికి పంపింది. ఆమె భోజనం ముగించిన తరువాత అర్ధరాత్రి మెల్లగా తన దగ్గరున్న 'మాస్టర్ కీ'తో అంజలి గది తలుపుతీసి బీరువాలోని నగలు తీసుకుంది. కిటికీ ఊచ తీసి కింది మూలలో పెట్టింది. ఒక ఊచకు నైలాన్‌తాడు కట్టి కిందికి వేలాడదీసింది. సాయంత్రం విమల ద్వారా తెప్పించిన మాలా-డి స్ట్రిప్‌ను అంజలి తలగడ కింద పెట్టింది. గది బయటికి వచ్చి దగ్గరికి లాగింది. ఆటోమేటిక్ లాక్ కావటం వల్ల డోర్ వెంటనే లాక్ అయింది.

తన గదికి వెళ్ళి పడుకుంది.

***

అలా అంజలి హత్య జరిగింది.

తన సంసార జీవితానికి ఎక్కడ చెల్లెలు బంధనంగా మారుతుందోనని భయపడి ఆమెను హతమార్చి, దొంగతనం, హత్య జరిగినట్టుగా చిత్రీకరించే ప్రయత్నం చేసింది. తాను తవ్వుకున్న గోతిలో తానే పడింది గీతాంజలి.

ఇన్‌స్పెక్టర్ గీతాంజలిని కోర్టులో హాజరు పరిచాడు.

ప్రస్తుతం గీతాంజలి జైల్లో ఉంది.

—సూర్యనేత్ర

## సౌభాగ్య చక్రం

జూలై 12 నుంచి
జూలై 18 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

బదిలీలు, మార్పులు, విద్యా విషయాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం బంధుమిత్రుల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి ఆర్థికంగా శుభప్రదం. 13, 14 తేదీల్లో దూరంలో ఉన్న ప్రియతములు ఇల్లు చేరతారు. కుటుంబ వ్యవహారాల కారణంగా మనశ్శాంతి లోపిస్తుంది. రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరం. 15, 16 తేదీల్లో బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. కుటుంబసభ్యులతో ఉల్లాసంగా గడుపుతారు. 17, 18 తేదీల్లో ఆర్థిక విషయాల్లో చిక్కులు ఎదురవుతాయి. కుటుంబసభ్యుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారు ఆచితూచి వ్యవహరించాలి.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

విద్య, ప్రయాణాలు, సోదరీసోదరుల విషయాలకు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధవారం వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 13, 14 తేదీల్లో బంధుమిత్రుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. విద్యాసంస్థల్లో ప్రవేశానికి అనుకూలం. స్నేహ బాంధవ్యాలు విస్తరిస్తాయి. 15, 16 తేదీల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ప్రయాణాలు, చర్చలు లాభిస్తాయి. 17, 18 తేదీల్లో సోదరీసోదరుల విషయాలు మనస్తాపం కలిగిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లలో నిదానం అవసరం. స్టేషనరీ, ఏజెన్సీలు, రవాణా రంగాల వారు, రిప్రజెంటేటివ్‌లు, టీచర్లకు శుభప్రదం.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, షాపింగ్, ఆర్థికపరమైన సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఆర్థిక వ్యవహారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 13, 14 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల సహకారం లోపించే అవకాశం ఉంది. 15, 16 తేదీల్లో బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక విషయాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. 17, 18 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారు ఆర్థిక విషయాల్లో చిక్కులు ఎదుర్కొంటారు. పెట్టుబడుల్లో నిదానం అవసరం. ఉన్నత విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి.



### కర్కాటకం (జూన్ 22 - జూలై 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఆర్థిక నిర్ణయాలు, దూరప్రయాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధవారం రుణాలు మంజూరవుతాయి. గత స్మృతులు నెమరువేసుకుంటారు. 13, 14 తేదీల్లో బంధుమిత్రుల కలయిక ఉల్లాసం కలిగిస్తుంది. ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. న్యాయ, బోధనా రంగాల వారికి ప్రోత్సాహకరం. 15, 16 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో కీలక అంశాలపై దృష్టి సారిస్తారు. కొత్త ప్రాజెక్టుల ప్రారంభానికి అనుకూలం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 17, 18 తేదీల్లో ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. సమావేశాల్లో కొత్త పరిచయాలు ఏర్పడతాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



### సింహం (జూలై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం సినీ, రాజకీయ రంగాలవారు గౌరవ, మన్ననలు అందుకుంటారు. న్యాయ, రక్షణ రంగాలవారికి శుభప్రదం. 13, 14 తేదీల్లో పాత బకాయిలు వసూలవుతాయి. వైద్యం, విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. మనసును ఏదో వెలితి బాధిస్తుంది. 15, 16 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారికి శుభప్రదం. కీలక సమాచారం అందుకుంటారు. బోధన, రక్షణ రంగాలవారికి ప్రోత్సాహకరం. 17, 18 తేదీల్లో పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. 13, 14 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. స్పెక్యులేషన్లలో నిదానం అవసరం. జనసంబంధాలు విస్తరిస్తాయి. 15, 16 తేదీల్లో పెట్టుబడుల్లో సత్ఫలితాలు సాధిస్తారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. మ్యూచువల్ ఫండ్స్, బీమా లావాదేవీలకు అనుకూలం. 17, 18 తేదీల్లో న్యాయ, బోధన, రక్షణ రంగాల వారు ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. చర్చలు ఫలించకపోవచ్చు. విద్యాసంస్థలతో పనులు పూర్తవుతాయి.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ప్రముఖులతో సమావేశాలు, పెట్టుబడులపై ఈ వారం దృషి సారిస్తారు. బుధవారం చి న్నారులుల, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 13, 14 తేదీల్లో ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. సిబ్బందిని నియమించుకుంటారు. పెద్దల ఆ రోగ్యం కలవరపెడుతుంది. పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. 15, 16 తేదీల్లో జనసంబంధాలు విస్తరిస్తాయి. వేడుకల్లో ప్రముఖులను కలుసుకుంటారు. భాగస్వామి వైఖరి ఉ ల్లాసం క లి గిస్తుంది. గౌరవ మన్ననలు అందుకుంటారు. 17, 18 తేదీల్లో ఆర్థిక విషయాల్లో పెద్దల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. సంస్మరణల్లో పాల్గొంటారు.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

విద్య, వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, బృందకార్యక్రమాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం బదిలీలు, మార్పులకు అనుకూలం. ఇంటికి అవసరమైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 13, 14 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. అడ్మిషన్లు లభిస్తాయి. ప్రేమానుబంధాలు బెడిసికొట్టే ప్రమాదం ఉంది. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 15, 16 తేదీల్లో హోటల్, వైద్య, ఉపాధి రంగాల వారికి నిరుత్సాహకంగా ఉంటుంది. వృత్తి, వ్యాపారాల్లో సంకల్పం నెరవేరుతుంది. 17, 18 తేదీల్లో బంధుమిత్రుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. శ్రీవారు, శ్రీమతి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వేడుకల్లో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

బదిలీలు, పెట్టుబడులు, వేడుకలు, వృత్తిపరమైన సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధవారం విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థిక విషయాల్లో సోదరీ సోదరుల సహకారం లభిస్తుంది. 13, 14 తేదీల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 15, 16 తేదీల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పెట్టుబడులు, పొదుపు పథకాల విషయంలో మంచి ప్రతిఫలాలు అందు కుంటారు. 17, 18 తేదీలలో వృత్తి, వ్యాపారాల్లో అనుకోని ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఆరోగ్యం మందగించే అవకాశం ఉంది. వైద్యం, హోటల్, వినోద రంగాల వారు నిదానం పాటించాలి.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

వేడుకలు, సోదరీ సోదరుల విషయాలు, భాగస్వామ్యాలు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం స్పెక్యులేషన్లు, పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 13, 14 తేదీల్లో సమావేశాలు, చర్చల్లో కీలకపాత్ర పోషిస్తారు. బంధుమిత్రుల కలయిక ఆనందం కలిగిస్తుంది. వాగ్వివాదాలు దూరంగా ఉండాలి. 15, 16 తేదీల్లో కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. 17, 18 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

ఇంటర్వ్యూలు, ప్రయాణాలు, బదిలీలు, వేడుకలు, చిన్నారుల విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఆరోగ్యం మెరుగవుతుంది. విందుల్లో పాల్గొంటారు. 13, 14 తేదీల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఇంక్రిమెంట్లు అందుకుంటారు. హోటల్, వైద్య రంగాల వారికి కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. 15, 16 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. వృత్తిపరమైన చర్చలు ఫలిస్తాయి. బంధుమిత్రుల కలయిక ఆనందం కలిగిస్తుంది. 17, 18 తేదీల్లో కుటుంబ సభ్యుల ఆరోగ్యం కలవరపెడుతుంది. బదిలీలు, సీట్ల మార్పిడి అసౌకర్యం కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు నిదానం పాటించాలి.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

చిన్నారుల విషయాలు, పెట్టుబడులు, విద్యా విషయాలు, బదిలీలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధవారం వృత్తి విద్యా కోర్సుల్లో ప్రవేశానికి అనుకూలం. దూరంలో ఉన్న ప్రియతముల నుంచి కీలక సమాచారం అందుకుంటారు. 13, 14 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. సాంకేతిక కోర్సుల్లో ప్రవేశానికి ఆటంకాలు ఎదురవుతాయి. 15, 16 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఫీజులు, బిల్లులు చెల్లించేందుకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 17, 18 తేదీల్లో ఇంటర్వ్యూలలో ఆశించిన ఫలితం రాకపోవచ్చు. ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది.



# ప్రయాణం



(రాచెల్ కలోఫ్ ఆత్మకథ)

-బాలి

సెల్: 98499 63082

**మా** అత్తగారు అక్కడక్కడ గోతుల్లో ఉన్న మంచు ముక్కల్ని మరిదితో తెప్పించి, చిన్న గిన్నెలో వేసి కడుపు మీద కాపడం పెట్టడం మొదలెట్టింది. మరుసటి రోజు ఉదయానికల్లా నొప్పి తగ్గింది. ఛార్లెస్ డాక్టర్‌ను తీసు కొచ్చాడు. ఆయన నన్ను పరీక్షించి ఇంజెక్షన్ ఇచ్చి ఏవేవో మందులు రాసి అధిక సంతానం వల్ల ఈ పరిస్థితి తెచ్చుకున్నానని నిందించి, బాగా రెస్ట్ తీసు కుంటూ, మందులు వాడమని చెప్పి వెళ్లాడు.

ఎముకలు కొరికే చలిలో, కనీసం తిండి గురించి కూడా ఆలోచించకుండా ఆ డాక్టర్‌ను నా కోసం తెచ్చిన మా బావ గారు ఛార్లెస్‌కు రుణపడి ఉన్నానని చెప్పాను. ఆయనా, మా అత్తగారు "కుటుంబం అన్నాక ఆ మాత్రం ఒకరికొకరు సాయం చేసుకోమా" అన్నారు.

నేను పూర్తిగా కోలుకోవడానికి, కనీసం లేచి నిలబడడానికి వారం రోజులు పట్టింది. మా యూదుల్లో ఎంత మందిని కంటే సంఘంలో అంత గొప్ప గౌరవం ఉంది. కాదనలేము. అయితే ప్రకృతి ప్రసాదించిన ఈ సంతాన ప్రాప్తిలో ఈ గడ్డిభూముల్లో పిల్లల్ని కనడం, సాకి పెద్దవాళ్లను చెయ్యడం, మాటలు కాదు.

దానికి మా భార్యాభర్తల వద్ద ఏ సమాధానమూ లేదు. మరో సంవత్సరం గడిచింది. నేను గర్భవతినయ్యాను.

టౌన్‌లో డాక్టర్లు గర్భవతుల పట్ల చక్కటి పర్యవేక్షణలో, ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నారని తెలిసి ఈ మారు టౌనుకు

పోయి హాస్పిటల్‌లోనే పురుడు పోసుకోవాలనుకున్నాను. అబ్రహం అలాగే నిర్ణయించాడు.

అది 1911వ సంవత్సరం.

నాకు అమ్మాయి 'సియోలియా' పుట్టింది. నార్మల్ డెలివరీ. రెండు వారాలకు పైగా టౌన్‌లో ఉండిపోయాను. పాపం మా పెద్దమ్మాయి మిన్నీయే ఇల్లంతా చక్కబెట్టుకుంది. తన చెల్లెల్నీ, తమ్ముళ్లనూ చూడడం, వంటపనులతో పాటు, అటు వ్యవ సాయపు పనులు కూడా తనమీదే పడ్డాయి. నేను టౌన్‌లో పురిటి మంచంలో ఉన్నానే గానీ, ఆలోచన లన్నీ ఇంటి మీదే!

నేను ఇంటికొచ్చేసరికి ఆమె ఆ ఇంటిని శుభ్రంగా ఉంచడం చూసి ముచ్చటేసింది. అయితే టౌన్‌లో డాక్టర్ల పర్యవేక్షణ గురించి రెండు ముక్కలు ఇక్కడ చెప్పాలి. నేను విన్నదీ, అక్కడ జరిగిందీ వేరు కాబట్టి. డబ్బుకి డబ్బూ పోయింది. డాక్టర్ల వ్యవహారం కూడా అస్సలు బాగాలేదు. రోగుల్ని పందుల కన్నా హీనంగా చూస్తున్నారు. మందులు పోసే పద్ధతీ, ఇంజెక్షన్ ఇచ్చే పద్ధతీ అలాగే ఉంటు న్నాయి. ఏ మందులు ఇవ్వాలో, ఏ మందులు దేనికి ఉపయోగించాలో వారికే తెలియదనిపిం చింది. వారికన్నా మా అత్తగారే నయం!

## జరిగిన కథ

*రాచెల్ కలోఫ్ ఉక్రెయిన్‌లో పుట్టి పెరిగింది. ఆమె రాసుకున్న ఆత్మకథే ప్రయాణం. రాచెల్ చిన్నతనంలోనే తల్లి మరణించటంతో తండ్రి తన నలుగురు పిల్లలని బంధువుల పంచనచేర్చి, అమెరికా వెళ్ళిపోతాడు. అమెరికాలో ఉంటున్న అబ్రహం రాచెల్‌ను పెళ్ళి చేసుకుంటాడు. ఇద్దరు ఆడపిల్లల తరువాత కొడుకు పుట్టడంతో కోవెనెన్ట్ తంతు జరిపిస్తారు. ఆ తరువాత ఆ గడ్డి భూముల్లో ఎదురైన సమస్యలను అధిగమిస్తూ, కుటుంబం కూడా పెద్దదవడంతో కొంచెం పెద్ద ఇల్లు నిర్మించుకుంటారు. రాచెల్ ఆరోగ్యం క్రమంగా దెబ్బతింటుంది. ఒకరోజు ఆమె పొత్తి కడుపులో నొప్పితో బాధపడుతుండగా ఆమె అత్త గారు వస్తుంది.*

*ఆ తర్వాత....*

నా ఆఖరి పాప సియోలియా పుట్టిన దగ్గ ర్నుండి పెద్ద ఆరోగ్యంగా లేదు. పదమూడు నెలలు వచ్చేవరకూ అడుగులే వెయ్యలేకపోయింది. మధ్య మధ్యలో మూత్రసంబంధమైన ఇబ్బంది ఒకటి. ఆమెకు కొన్ని పదార్థాలు పడవు. అది గమనించి ఆమెకు పూర్తిగా జీర్ణమయ్యే పదార్థాలే తినిపిం చాను. ఇక ఆ తరువాత రోజుల్లో ఎదుగుతున్న కొద్దీ చురుగ్గా తిరగడం, మాటలు రావడం జరి గింది.

1910 నుండే మా ఇల్లూ, మా పంటలూ, పొలాల్లో చాలా మార్పు వచ్చింది. పౌండు పిండి కోసం, ఒక సీసా కిరోసిన్ కోసం, ఒక డబ్బా బొగ్గుల కోసం అబ్రహం చేతుల వంక చూసిన నేను ఇప్పుడు నా ఇంటిలోనే ఓ గది నిండా ఆరునెలలకు సరిపడా రేషన్ దాచుకోగలుగుతున్నాను.

అంతేకాదు మొత్తం మా కలోఫ్ కుటుంబానికి దక్కింది 360 ఎకరాలు. సెక్షన్ 2930 భూములు మావే! అందులో మా బావగారికి 120 ఎకరాలు వెళ్లాయి. అయితే అబ్రహం ఇక్కడ చుట్టుపక్కల ఉన్న కుటుంబాలతో పరిచయాలు పెంచుకొని మీటింగ్ పెట్టుకుని ఆలోచించి పిల్లలకు అనవస రంగా చదువులు లేక, క్రియేటివ్‌నెస్ లేక ఒంట రిగా అయిపోతున్నారని తలంచి స్కూలు పెడదా మని ఆలోచించాడు. దానికి అబ్రహం ఎక్కువ శ్రద్ధ తీసుకున్నాడు. సొసైటీ ఏర్పడింది. ఆ సొసైటీకి మా భూమిని కొంత తక్కువ ధరకు అమ్మాం. దీని వలన సుఖం ఏమిటంటే మా స్కూలు ఇంటికి



దగ్గరే ఉంటుంది. అంతేగాక అబ్రహం దాన్ని ఎప్పటి కప్పుడు గమనించవచ్చు.

దీనికి సొసైటీలోని మెంబర్లు అందరూ ఒప్పుకున్నారు. అన్నట్టు ఆ సొసైటీ పేరు 'ది ఫార్మర్స్ సొసైటీ'. ఆ చిన్న స్కూలు దినదిన ప్రవర్ధమానమయ్యింది. కొద్దిరోజుల్లోనే ఇద్దరు యువ ఉపాధ్యాయులు వచ్చారు. వారికి తిండీ నిద్రా అన్నీ స్కూల్లోనే! లిటరేచర్, సైన్స్, సంగీతం, డ్యాన్స్ నేర్పడం, మధ్యలో డిబేట్స్ అన్నీ చక్కగా జరిగేవి.

అబ్రహం రెండు గుర్రాలు కొన్నాడు కొత్తగా. కోతలకు పనికొచ్చే పరికరాల వంటివీ కొన్నాడు. ఇప్పుడు అబ్రహం పేరు చాలా చోట్ల ఈ నార్త్ డకోటాలో వినిపిస్తోంది. చాలా మందికి వ్యవసాయ పరికరాలు అద్దెకు కాక మామూలుగా ఇవ్వడం మొదలెట్టాం. ఎవరికి ఏం కావాలన్నా మా ఇంటికే వస్తున్నారు. మా యూదు మతపరమైన ముఖ్యమైన పండుగలన్నీ మా ఇంట్లోనే జరుగుతున్నాయి. జ్యూయిస్ రైతులందరూ ఆయా పండగ రోజుల్లో కలిసి మెలిసి సాయం చేసుకోవడాలూ, కష్టసుఖాలు చెప్పుకోవడాలూ చేస్తున్నారు. మా మా అనుభవాలతో వాటికి పరిష్కారమార్గం చూపిస్తున్నాం. దీనితో మా ఇల్లు పెద్ద శరణాలయంగా మారిపోయింది. ఒకవేళ తప్పని పరిస్థితుల్లో వారు మా ఇంట్లోనే ఉండిపోవలసి వస్తే నిద్రపోవడానికీ, భోజనం వసతికీ అనుకూలంగా మంచి గదులూ, వసతులూ ఏర్పాటు చేశాం.

కిరోసిన్ ఎక్కువగా కొని గుడ్డ ముక్కలతో వత్తులు చేసి లాంతర్లు రెండు మూడు వెలిగించి, గదుల్లోనూ, హాలులోనూ ఉంచడం వల్ల మా ఇంటికి వచ్చే అతిథులకు ఇదే పెద్ద స్వర్గంలా కనిపించడం మొదలెట్టింది. ఇది చూసి అబ్రహం వీధిలో ఇంటి వారగా ఓ వీధి దీపం ఏర్పాటుచేస్తే బాగుంటుందని తలంచాడు. దానికి అద్దం ముక్కలు, రేకుముక్కలు కత్తిరించి కొంచెం ఎత్తులో గాలికి ఆరిపోకుండా, మంచుకి తడవకుండా కర్ర స్థంభంపై చిన్న దీపాన్ని ఏర్పాటు చేశాడు. దాన్ని ప్రతిరోజూ నేను గానీ, అబ్రహం గానీ కిరోసిన్ పోసి వెలిగించేవాళ్లం. అది ఆ గడ్డిమైదానంలో, ఆ చీకట్లో చాలా గొప్పగా ఉంది. దీనివల్ల ఇంకో బాధ ఏర్పడింది. అంతకు ముందు ఎక్కడెక్కడో తిరుగాడే అడవి జంతువులు ఈ వెలుగులో మా ఇంటి చుట్టూ తిష్ఠ వేసి, వీలయితే నేలను తవ్వి కోడిపిల్లలను ఎత్తుకు పోవడం మొదలెట్టాయి.

స్కూలు విషయం చూస్తే సంవత్సరంలో మూడింతలమంది పిల్లలు చేరారు. తల్లిదండ్రులే వేగన్‌లలో స్కూలు ముందు వారిని దించి వెడుతున్నారు. మంచు ఎక్కువగా ఉంటే వారి తిండీ, నిద్రా స్కూలు గదుల్లోనే. వ్యవసాయం పనులతో పాటు స్కూలుపనులతో అబ్రహంకి తీరిక లేదు. అదే ఆనందంగా ఉందంటాడు. నేను చిన్నప్పుడు పెద్దగా చదువుకోలేదు. నేను పోగొట్టుకున్నది ఇప్పుడు నలుగురుపిల్లల్లోనూ కనపడుతూంటే ఇంతకు మించి ఆనందం ఏముంటుంది అంటాడు. సరే నేను ఎంత వరకూ సహకరించగలనో ఆ పని చేస్తున్నాను.

ఈ నార్త్ డకోటాలో మా ఏరియాలో అబ్రహం ఈ ఫార్మర్స్ సొసైటీ స్థాపించడం, నలుగురిలో చైతన్యం తేవడం వల్ల ఇతనికి గవర్నమెంట్‌లో గుర్తింపు రావడం మొదలయ్యింది. యునైటెడ్ స్టేట్స్ ప్రెసిడెంట్స్ విలియం టాఫ్ట్, ఉడ్రోవిల్సన్‌ల నుండి ఉత్తరాలు వచ్చాయి. స్కూలు పేరు కూడా విక్టోరియా స్కూలు అనీ, మేముండే ప్రాంతాన్ని సిర్కా అనీ అంటారు. ఈ రెండింటినీ కలిపి 'విక్టోరియా స్కూలు సిర్కా'గా స్థిరం చేశాడు. స్కూల్లో పిల్లల సంఖ్య పెరుగుతుండటంతో, మరి కొన్ని చందాలు పోగు చేసి ఆ స్కూలు బిల్డింగ్‌ను ఇంకా విస్తరింపచేశాడు. చలికాలంలో గానీ వేసవిలో గానీ పర్మనెంట్‌గా ఉండే టీచర్‌ని ఏర్పాటుచేశాడు. అబ్రహం టౌన్ నుంచి వీలయినంత రేషన్ ఆ టీచర్‌కి తెచ్చి ఇస్తే అతడు వంట చేసుకునేవాడు. అదయ్యాక పిల్లల కోసం ఎదురు చూసేవాడు. ఈ ప్రయరీ భూముల్లో అకాల గాలులూ, వర్షాలూ ఎక్కువ. అటువంటి పరిస్థితుల్లో వారి వారి ఇళ్లకు మా బండి మీదే దిగబెట్టడం జరిగేది.

ఇలా మా జీవితాలు ఓ కొలిక్కి తెచ్చుకున్నామన్న సంతృప్తిలో ఉండగా నేను నా ఆఖరి కొడుకు 'జాకోబ్'ని కన్నాను (1912 సంవత్సరం). ఇదే నా ఆఖరి సంతానం అనుకుంటాను. ఇతడు టౌన్‌లోనే పుట్టాడు. అప్పటికే నా పెద్ద కూతురు మిన్నీతో కలిసి పిల్లలు ఇంటిని చక్కబెట్టుకోవడం

**రాచెల్‌కు అరవై ఏళ్ళు వచ్చాయి. పిల్లలకు పెళ్ళిళ్ళు అయి ఎవరి దారిన వారు వెళ్ళారు. గతంలోకి వెళ్ళిపోయిందామె. వెళ్ళినకొద్దీ ఆమెకు ఆశ్చర్యంగానూ, కాస్తంత నిరాశగానూ అనిపించింది. అసలు గతంలో నేనేవర్ని? నేను ఏమాశించి ఇంత దూరం వచ్చాను? నా కల నెరవేరిందా? వంటి ప్రశ్నలు ఆమెను ఉక్కిరి బిక్కిరి చేశాయి. మరి ఆమె ప్రశ్నలకు సమాధానాలు లభించాయా?**

అలవాటు చేసుకోవడం వల్ల ఈ పురుడు పెద్ద కష్టం అనిపించలేదు. జాకోబ్‌నే జాక్ అని పిలుస్తున్నాం. అతడు పుట్టినప్పటి బరువు 13 పౌన్లు. చాలా ఆరోగ్యంగా పుట్టాడు. మరో చక్కటి విషయం ఏమిటంటే నాకు డెలివరీ చేయించిన డాక్టర్ చాలా స్నేహపూర్వకమైన వ్యక్తి. పేరు కాక్స్. కానీ పెద్ద తాగుబోతని విన్నాను. వినడమేమిటి? అతని ముఖమే చెప్పేది. కానీ నా రిక్వెస్ట్ మీద ఆ వారం తాగడం మానేసినట్టున్నాడు. ఫ్రెష్‌గా కనపడడమే కాదు, ఎప్పుడు కావాలంటే అప్పుడు అటెండ్ అయ్యేవాడు. అదొక గొప్ప సంతోషం. అయితే ఆ తరువాత కొంతమంది మిత్రులతో మాటల సందర్భంలో నాకు డెలివరీ చేసినది మిస్టర్ కాక్స్ అని చెప్పగానే చాలా మంది ఆశ్చర్యంగా చూశారు. మరికొంత మంది నీవు అదృష్టవంతురాలివి సుమా అన్నారు. వాడు సరిగ్గా అటెండ్ కాడు. పచ్చి తాగుబోతు. వాడి వలన చాలా మంది గర్భశోకాన్ని అనుభవించారు. పసికందులు చనిపోయారు. ఆయనకున్న అనుభవం వల్ల హాస్పిటల్‌లో సక్రమంగా పనిచేస్తే అతనికి చాలా పైకం వచ్చేది. మంచివాడు అనే పేరు నిలబడేది అన్నారు.

అంతా అయ్యాక వీరు ఆ మాట చెబుతోంటే నాకు భయం వేయడం మొదలెట్టింది. అంతలోనే నేను చాలా అదృష్టవంతురాలనని నాకు నేనే ధైర్యం చెప్పుకున్నాను.

రోజులు మామూలుగానే నడుస్తున్నాయి. ఇక మా పొలం పంటలు సంగతి చూస్తే అదొక లక్కీ గేమ్ కింద అయిపోయింది. పంట పండి, నూర్పిళ్లు అయి గింజ ఇంటికి వచ్చేవరకూ నమ్మకం లేదు.

ఈ ప్రాంతంలో మాకు పేరూ, పలుకుబడీ, గౌరవాలున్నా, కష్టించిన దశలో దానికి తగ్గ ఫలం అందాలి కదా! అదేం లేదు. నిమిషాల్లో మొత్తం పొలం మరుభూమిగా మారిపోతుంది. ఇటు మామూలుగా అత్తగారి కుటుంబం, అటు బావగారి కుటుంబం రోజురోజుకీ దివాలా అయిపోతున్నారు. తిరిగి అబ్రహం మీదనే ఆధారపడుతున్నారు.

ఇక బిడ్డా పాపలతో నా కుటుంబమూ పెద్దదిగానే ఉంది. అయితే బావగారు ఛార్లెస్ కుటుంబం ఏమని నిర్ణయించుకుందో తెలియదు. వారి వాటాకు వచ్చిన భూమిని అమ్మేసి నార్త్ డకోటా నుంచి శాశ్వతంగా న్యూయార్క్ వైపు వెళ్లిపోయారు. శీతాకాలం మూడు నెలలూ మా ఇంట్లోనే గడిపే



మా అత్తగారు, మా మావగారు చనిపోగానే శాశ్వతంగా మా ఇంటికే వచ్చేసింది. మా మరిది మోసెస్ పెళ్ళి చేసుకొని అత్తారింటికి ఇల్లరికం వెళ్లిపోయాడు.

ప్రస్తుతం నాకు కాలం ఇచ్చిన బహుమతి ఏమంటే నాకు అరవై ఏళ్లు వచ్చేశాయి. పిల్లలకు పెళ్ళిళ్ళు అయి ఎవరి దారిన వారు వెళ్లారు. గతాన్ని నెమరు వేసుకుంటే నేనెవర్ని? ఏమాశించి ఇక్కడకు వచ్చాను? నా ఆశ నెరవేరిందా? ఇవన్నీ తలుచుకుంటే నవ్వు వస్తుంది. అయినా ఇప్పుడు అవన్నీ అనవసరం. నా భర్తా, నేనూ భుజం భుజం కలుపుకున్నాం. కష్టాలూ, సుఖాలూ పంచుకున్నాం. ఈ నార్త్ డకోటాలో సెటిల్ అయ్యి లేక అవబోయి, వెనక్కు మళ్లిన కుటుంబాలను చూసినా, లేదా ఇక్కడ స్థిరపడిన కుటుంబాలను చూసినా మా దంపతుల్లా ఒక్క తాటిమీద నిలబడ్డవారు తక్కువ. అసలు లేరు!

నా జీవన ప్రయాణంలో ఎదురయిన మలుపులు చూస్తుంటే నాకే ఆశ్చర్యమేస్తోంది. రష్యా దేశంలో ఏదో మూల పుట్టాను. ఏదో ఆశ! నాలుగు మెతుకులు తినడానికి దొరుకుతాయని, జీవితంలో నన్ను సుఖపెట్టే పురుషుడు దొరుకుతాడని గాలిలో గమకాలు పాడుతూ ఇటు వచ్చాను. ఆ చిన్నతనంలో అర్థం చేసుకోలేకపోయాను గానీ అబ్రహం కన్నా నాకు గొప్పవాడు లేడు. భగవంతుడు కరుణామయుడు. ఇది అతని లీల.

జీవితమంటే మృదువైన తల్పం కానే కాదు. దాని కింద అన్నీ ఉంటాయి. భగవంతుణ్ణి వేడుకోవడమంటే నీ విల్‌పవర్‌ని నీవు తిరిగి తెచ్చుకోవడమే! నీ ఆత్మశక్తిని తిరిగి నీవు నిలుపుకోవడమే!

అయితే ఈ క్షణాలలో నాకు దుఃఖం వస్తోంది. గుండెల్లో తెలియని బాధ పిండేస్తోంది. నా సుఖమే ముఖ్యమనుకుని ఇలా వచ్చానని? ఇది నన్ను నేను క్షమించుకోలేని ఆలోచన. మూగగా రోదిస్తాను ఈ ఆలోచన రాగానే! అదే...నా తోబుట్టువులను వదులుకోవడం.

తమ్ముడు చిన్నవాడు. అక్కా, అన్నా రోగిష్టులు. నేను శాశ్వతంగా ఎటో వెళ్లిపోతున్నానని (అది శాశ్వతం అని నాకూ తెలియదు) తెలిసీ నా చుట్టూ ఎంత దుఃఖంతో తిరిగారు. తిరిగి కలుసుకున్నానా నా వారిని? పోనీ వారెలా ఉన్నారని తెలుసుకున్నానా? నాకా అవకాశాలు ఎక్కడున్నాయి?

వారి గురించి ఆలోచన వచ్చినప్పుడు నా పాత చెక్కపెట్టె (ఇది అబ్రహం న్యూయార్క్‌లో కొన్నాడు) తెరచి, అడుగునున్న కవర్ మడతల్లో దాచిన ఆ ఫోటోలు తీయడమే! అందులో నా చిన్న తమ్ముడూ, అక్కా, అన్నా ఉన్నారు. పేదరికంతో, అనారోగ్యంతో, నీరసపడిన ముఖాలతో, దైన్యంగా, ఆశలు నింపుకున్న కళ్లతో నా ఇరుపక్కలా కూచొని ఉంటారు. అదొక మారు తనివితీరా చూడడం, కన్నీటిని తుడుచుకోవడం, తుడుచుకొని తిరిగి జాగ్రత్తగా కవరులో సర్ది పెట్టె అడుగున పెట్టడం.... నా పిల్లలు పెద్దయ్యాక ఆ ఫోటోలు చూపించాను కన్నీటితో. ఓహో! నీలాగే ఉన్నారన్నారు పోలికలు వెతుకుతూ. అయినా ఎందుకా కన్నీళ్లు అన్నారు తిరిగి.

నా హృదయ వేదన ఈ చిన్న పిల్లలకేం తెలుస్తుంది? అబ్రహం తనవారిని, ఆ రష్యాలో ఉన్న బంధువుల్ని మరిచిపోయాడే! ఎప్పుడన్నా కదిపితే...దుఃఖం తప్పితే మరేం లేదన్నాడు. అసలు ఆ ఆలోచనలకే తెరలు దింపమన్నాడు.

ఇదీ నా ప్రయాణం.

అబ్రహం ప్రస్తుతం రుమానిటిజంతో బాధపడుతున్నాడు. నా ఆరోగ్యమూ అంతంత మాత్రంగానే ఉంది. అయినా ఫరవాలేదు. ఇదొక పెద్ద వయసు కాదు. ఇద్దరం హాయిగా ఉన్నట్టే. నా భర్తకు నేనూ, నాకు నా భర్తా చిన్న చిన్న పనుల్లో సహకరించుకుంటున్నట్టే.

**(అయిపోయింది)**

## మనమీదేనర్రోయ్!

సరసి





# రంగురంగుల సాగరతీరాలు











**సాగరతీరంతో మనిషికి ఎంతో అనుబంధం. సంతోషం, సంతాపం, ఎడతెగని ఆలోచనలు...ఇలా సన్నివేశం, సందర్భం ఏదైనా సాంత్వనకోసం మనం చేరేది అందుబాటులో ఉన్న సాగరతీరానికే.**

**మూడ్ బాగాలేకపోయినా, మనల్ని మనం రీచార్జ్ చేసుకోవడానికైనా, ఎనర్జిటిక్‌గా ఉండాలన్నా సాగరతీరమే అనువైన ప్రదేశం. మన సరదాలకూ, ఓదార్పులకూ, క్రియేటివిటీకీ ఆ ఇసుకతిన్నెలే మన నేస్తాలు. భూమ్యాకాశాలు ఏకమైపోయినట్టు కనిపించే సాగరాన్ని చూస్తూ ఆ ఇసుకమీద కూర్చుని ఇష్టమైన వారితో కబుర్లు చెబుతూ, ఆహ్లాదంగా ఆడుతూ పాడుతూ గడిపే ఆ క్షణాలు ఎంతో మధురంగా ఉంటాయి. అందుకే కాలమేదైనాసరే బీచ్‌కి వెళ్ళేందుకే పర్యాటకులు ఎప్పుడూ ఆసక్తి చూపిస్తారు. వయసు ఎంతైనా సరే చిన్నపిల్లల్లా బీచ్‌లో కేరింతలు కొట్టడానికే ఎదురు చూస్తుంటారు.**

**ఇసుకతిన్నెలంటే గుర్తొచ్చింది, మామూలుగా సముద్రతీరంలో ఇసుక ఏరంగులో ఉంటుంది? ఇదేం ప్రశ్న? ఇంకేరంగులో ఉంటుంది బ్రౌన్ కలర్‌లో ఉంటుంది అని చెప్తారు. కానీ ఈ సముద్ర తీరాలలో ఇసుకమాత్రం వెరైటీగా వివిధ రంగుల్లో ఉంటుంది. ఇంతకీ ఆ సముద్ర తీరాలేమిటి? చిత్ర విచిత్ర రంగుల్లో ఉండే ఆ సాగర తీరాలు ఎక్కడున్నాయి? ఆ కథాకమామీషు ఏమిటో తెలుసుకోండి మరి.**

## ఎరుపురంగు సముద్రతీరం

ఆ సముద్రతీరం ఎరుపురంగు ఇసుకతో కనిపిస్తూ ఉంటుంది. ఈ రెడ్‌శాండ్ బీచ్ హవాలిలోని మాయి అనే ప్రాంతంలో ఉంది. ఈ బీచ్‌నే కైహాలులు అనే పేరుతో కూడా పిలుస్తారు. ఈ బీచ్‌ని చూస్తే మనం మరో అద్భుతలోకంలో ఉన్నామా? అనే భ్రమలో పడడం గ్యారెంటీ. ఇంతకీ ఈ సముద్రతీరంలో ఇసుక ఎరుపురంగులో ఉండడానికిగల కారణం ఏంటంటే, అక్కడ నేలలో ఎక్కువగా ఇనుము (ఐరన్) ఉండడమే. కేవలం ఇక్కడ మాత్రమేకాదు, గ్రీస్ దేశం సాంటోరిని అనే ప్రదేశంలో కూడా రెడ్‌కలర్ శాండ్ బీచ్ ఉంది. ఇనుము మిశ్రమం అధికంగా ఉండడంవల్ల ఇసుక ఇలా రెడ్‌కలర్‌లో ఉంటుంది.

## నల్లరంగు సముద్రతీరం

నలుపురంగు ఇసుక ఉన్న సముద్రతీరం న్యూజిలాండ్ గన్నెట్ బర్డ్ అనే ప్రాంతంలో ఉంది. ఈ బీచ్ పేరు మురివాయ్ బ్లాక్‌శాండ్ బీచ్. దీని వైశాల్యం 37 మైళ్లు. ఈ సముద్ర తీర ప్రాంతంలో అగ్నిపర్వతం ఉంది. అక్కడవుండే నేలలో దాని తాలూకు ఖనిజాలు, భూమిలో ఉండే ఐరన్, టైటానియం అన్నీ కలగలిసి ఆ ప్రదేశంలో ఇసుక మొత్తాన్ని నల్లగా మార్చేశాయి. అలా ఆ బీచ్ బ్లాక్‌శాండ్‌తో నిండి ఉంటుంది. ఒకప్పుడు ఈబీచ్ దరిదాపులకు కూడా ఎవరూ వెళ్ళేవారు కాదు. కానీ కాలక్రమేణా చాలామంది సందర్శకులు ఈ బ్లాక్ బీచ్ చూడడానికి వెళుతున్నారు.

## ఆకుపచ్చ సముద్రతీరం

చల్లనిసముద్రం నీలం రంగు దుప్పటి పరుచుకున్నట్టుంటుంది. దాని పక్కనే ఆలివ్ గ్రీన్ తివాచీలా పరుచుకున్న ఇసుక! ఆ ప్రకృతిరంగులు మనల్ని ఎంతో ఉత్తేజితం చేస్తాయి. ఆకుపచ్చని ఆ ఇసుకలో ఆడుకుంటుంటే ఎంత బాగుంటుందో కదా! అలా ఆడుకోవాలంటే మీరు హవాయి దాకా వెళ్ళాల్సిందే. హవాయిలోని కౌ జిల్లాలో, సౌత్‌పాయింట్ దగ్గర ఉంది ఈ బీచ్. దీనిపేరు పాపకోలియా బీచ్. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని ప్రముఖ సముద్రతీరాల్లో ఇది కూడా ఒకటి. ఇక్కడ ఇసుక ఆలివ్ గ్రీన్ కలర్‌లో ఉంటుంది. తెల్లని నురుగులు జిమ్మే అలలు, ఈ గ్రీన్‌కలర్ ఇసుకపైన తేలియాడుతూ ఉంటే పర్యాటకులు మంత్రముగ్ధులై చూస్తూ ఉండిపోతారు. ఈ బీచ్‌పేరు అదే అయినప్పటికీ అక్కడి ప్రజలు దీన్ని గ్రీన్‌శాండ్ బీచ్ లేదా మహానా బీచ్ అనే పేరుతో పిలుస్తుంటారు. ఇలాంటిదే ఇంకో బీచ్ కూడా ఉంది. పేరు గామ్. అక్కడ ఇసుక కూడా ఆలివ్ గ్రీన్‌కలర్‌లో ఉంటుంది. ఇది గ్రీన్‌శాండ్ బీచ్‌కి దగ్గరలోనే ఉంది. ఈరెండు బీచ్‌లలో ఇసుక ఆకలర్‌లో ఉండడానికి గల కారణం అక్కడి నేలలో ఆకుపచ్చ ధాతువులుండడమే.

## గులాబి సముద్రతీరం

మగువలకు ఇష్టమైన రంగు పింక్. ఆ బీచ్ కూడా అంతేనండోయ్. మొత్తం పింక్

కలర్‌లో ఉంటుంది. బహమౌస్‌లోని ఎలేతురా దగ్గరలో ఉన్న హార్బర్ ఐలాండ్‌లో ఉన్న ఈ బీచ్‌లో ఇసుకరంగు పింక్‌కలర్‌లో ఉంటుంది. ఈబీచ్‌లోకి వెళ్లగానే ప్రశాంతంగా ఉంటుందని పర్యాటకులు చెబుతుంటారు. ముఖ్యంగా మగవారికన్నా మగువలే ఈ బీచ్‌కి వెళ్ళేందుకు ఎక్కువ ఆసక్తి చూపుతున్నారట. అక్కడి నేలలో కోరల్, కాల్షియం కార్బొనేట్ పదార్థాలుండడం, సముద్రజలం దానికి తోడుకావడంవల్ల ఈ తీరం పింక్ కలర్‌లో ఉందని పరిశీలకులు చెబుతున్నారు.



## పర్పుల్ కలర్ సముద్రతీరం

అక్కడి సముద్ర తీరంలో ఇసుక పర్పుల్ కలర్ (వంగపండు రంగు)లో ఉంటుంది. కాలిఫోర్నియాలో ఉన్న ఈ సముద్రతీరాన్ని పెఫియఫర్ బీచ్ అని పిలుస్తారు. ఈ బీచ్ మొత్తం పర్పుల్, వైలెట్ షేడ్స్‌తో కూడి ఉంటుంది. దగ్గరలో ఉన్న కొండలలో ఉన్న మాంగనీస్, సముద్ర అలలు, భూమి ఉపరి తలంపైన ఉండే క్వార్జ్...ఈ మూడింటి రసాయనిక సమ్మేళనమే అక్కడి ఇసుకకు ఈరంగు తెచ్చిపెట్టింది. అయితే కొండలు ఉండడంవల్ల, బీచ్ సరైన ఆకృతిలో లేకపోవడంవల్ల ఈతకొట్టేందుకు ఈ బీచ్ అనుకూలంగా ఉండదు. కేవలం చూసి ఆనందించడానికి మాత్రమే అక్కడికి వెళ్లొచ్చు.



## కాషాయరంగు సముద్రతీరం

ఆరెంజ్ కలర్ ఇసుకతో ఉండే ఈ సముద్ర తీరం ఇటలీలోని సార్డీనియాలో ఉంది. ఈ బీచ్‌ను 'ఫిరో' అని పిలుస్తారు. అక్కడ ఉండే ఆరెంజ్‌లైమ్‌స్టోన్, నత్తగూళ్ళు, అగ్నిపర్వతాల ధాతువులు అన్నీ కలిసి అక్కడి తీరాన్ని ఆరెంజ్ రంగులోకి మార్చేశాయి. ఇలాంటి రంగు ఇసుకతోనే ఉన్న మరో బీచ్ మాల్టాలోని గోజో ప్రాంతంలో ఉంది.

## తెలుపురంగు సముద్రతీరం

సముద్రం తెల్లగా పాలనురగలా ఉన్నట్లే దానితీరంలో ఇసుకకూడా తెల్లగా పాలనురుగులా ఉంటుంది. ఈ తెలుపురంగు ఇసుకతీరం ఆస్ట్రేలియాలో ఉంది. పేరు హయామ్స్ బీచ్. ఈబీచ్ ప్రపంచంలో ఉన్న అత్యంత వైటెస్ట్ బీచ్‌గా గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డులో చోటు సంపాదించుకుంది. ఈబీచ్‌కి దగ్గరలోనే ఒక విలేజ్ ఉంది. ఆ విలేజర్లు జీవనోపాధి కోసం ఆ సముద్రంలోకి రోజులో మూడుగంటలు మాత్రమే పనిచేయడానికి వెళతారు. ఫ్లోరియాలోని సిస్టా అనే ప్రాంతంలో కూడా ఇంకో వైట్‌శాండ్ బీచ్‌ని కనుగొన్నారు. దానిపేరు క్రెసెంట్ బీచ్. ఈబీచ్‌లు తెల్లగా ఉండడానికి కారణం అక్కడ నేలలో క్వార్జ్ పదార్థం ఉండడమే. ఈ పదార్థం ఒక పౌడర్‌లా బీచ్‌మొత్తం పరుచుకుని ఉంటుంది.



## రెయిన్‌బో సముద్రతీరం

రెయిన్‌బో సముద్రతీరం ఏంటి అనుకుంటున్నారా? ఈ బీచ్ దగ్గర ఉన్న ఇసుక అంతా రకరకాల రంగుల్లో ఇంద్రధనుస్సులాగా ఉంటుంది. ఈబీచ్ 0.62 మైళ్లదూరమే ఉంటుంది. చాలా చిన్నబీచ్. ఇది ఆస్ట్రేలియాలో ఉంది. ఈ సముద్రతీరం వెంట 74 రకాల రంగుల్లో ఉండే ఇసుకను మనం చూడవచ్చు. సముద్ర అలలు మంచుముక్కలను కోయడంవల్ల అందులోనుంచి ఐరన్ ఆక్సైడ్ ఏర్పడి, అయోడిన్‌తో కలిసి ఇసుక ఇలా రకరకాల రంగుల్లో మనకు కనిపిస్తుంది. ఈబీచ్ చూడగానే ఇంద్రధనుస్సులా రకరకాల రంగులతో కనిపిస్తుంది. ఇలా కనిపించడం వెనుక ఓ పెద్ద కథ కూడా ఉందండోయ్. పూర్వకాలం రెయిన్‌బో అనే వ్యక్తి ఆత్మ ఒక అందమైన స్త్రీ చేతిలో గెలిచినందుకు ఆనందంతో తన శక్తిని ఈ నేలపైకి విసిరాడని అందుకే ఇక్కడ రెయిన్‌బో రంగులు విస్తరించాయనీ అక్కడి ప్రజలు నమ్ముతారు. అందుకే స్థానికులు దీన్ని రెయిన్‌బో బీచ్ అని ముద్దుగా పిలుచుకుంటారు.



## గ్లాస్ బీచ్

ఆ బీచ్‌కి వెళ్లాలంటే చాలా జాగ్రత్తగా ఉండాలి. గాజుపెంకులు గుచ్చుకునే అవకాశాలున్నాయి. అదేంటి అనుకుంటున్నారా? అవును ఆ బీచ్ తీరప్రాంతం అంతా గాజుముక్కలతో నిండి ఉంటుంది. అందుకే దీన్ని గ్లాస్‌బీచ్ అని పిలుస్తుంటారు. కాలిఫోర్నియాలోని ఫోర్ట్‌బ్రాగ్ ప్రాంతంలో ఈబీచ్ ఉంది. ఈబీచ్ చూసేందుకు వచ్చే పర్యాటకుల సంఖ్య ఈమధ్యకాలంలో బాగా పెరిగిందని అక్కడి అధికారులు చెబుతున్నారు. ఇక్కడ ఇన్ని గాజుపెంకులు ఉండడానికి ఓ కారణం ఉంది. 1906లో ఈ బీచ్ దగ్గర ఒక వాటర్‌డంప్ సైట్ ఉండేది. అక్కడికి ఎక్కువగా పగిలిన గ్లాస్‌ముక్కలు డంప్ చేసేవారు. రకరకాల గాజుముక్కలు ఈ సముద్రతీరంలో పేరుకుపోవడంతో ఇది గ్లాస్‌బీచ్‌గా స్థిరపడిపోయింది. కేవలం చూసి ఆనందించాల్సిందే తప్ప ఇక్కడ ఈతకొట్టడం వీలుకాదు.



## నత్తగూళ్ల సముద్రతీరం

వెస్టర్న్ ఆస్ట్రేలియా ప్రాంతంలోని షార్క్ బే రీజియన్‌లోని డెన్హామ్ ప్రాంతంలో ఈ బీచ్ ఉంది. ఈ షెల్ బీచ్ తీరం నిండా అన్నీ నత్తగుల్లలే కనిపిస్తాయి. దాదాపు 60 కిలోమీటర్ల వరకు నత్తగుల్లలే కనిపిస్తాయి. ఈ బీచ్ చూడడానికి చాలామంది పర్యాటకులు వచ్చిపోతుంటారు.

–రామకృష్ణశర్మ

# నూరుకట్ల పిశాచం కథలు ②

-వసుంధర

**అనగనగా ఒక ఊళ్లో సోమయ్య అనే సామాన్య గృహస్థుడు ఉండేవాడు. అతడికి భుక్తికి లోటు లేదు. కానీ అతడి భార్య సీతమ్మకి దురాశ ఎక్కువ. ఉన్న ఇంటిని మేడగా మార్చాలనీ, దాసదాసీజనంతో అంగరంగ వైభోగ జీవితం గడపాలనీ అనుకునేది. భర్త ఎంత కష్టపడి సంపాదించినా తిండికీ, ఇతర అవసరాలకే సరిపోయేదితప్ప, సీతమ్మ కలలు నిజం కావడానికి ఆ డబ్బు సరిపోయేది కాదు. అందుకని సాధువుల్నే నమ్ముకుంది సీతమ్మ. ఊళ్లోకి వచ్చిన ప్రతి సాధువునూ ఇంటికి ఆహ్వానించి మర్యాదలుచేసి పంపేది. కొన్నాళ్లకి ఆమె అదృష్టం పండి, నిజంగానే మహిమగల ఓ సాధువు ఆమె ఇంటికొచ్చాడు. ఆమె చేసిన మర్యాదలకు, శుశ్రూషలకు సాధువు సంతోషించి, ఏదైనా కోరుకోమన్నాడు. వెంటనే ఆమె భోగభాగ్యాలతో తులతూగే జీవితం కావాలంది. "డబ్బులో సుఖం ఉందనుకోకు. నీ కుటుంబానికి సుఖ సంతోషాలు కోరుకో. ఎక్కువ మేలు జరుగుతుంది" అని సాధువు సలహా ఇచ్చాడు. కానీ సీతమ్మ తనకి డబ్బే కావాలని పట్టుబట్టింది. అప్పుడు సాధువు సీతమ్మ పన్నెండేళ్ళ కూతురు చంద్రముఖిని దగ్గరగా రమ్మన్నాడు.**

# ఏడిస్తే ముత్యం

చంద్రముఖి దగ్గరకు రాగానే సాధువు ఆమె తల నిమిరి, "ఈ రోజునుంచీ ఈమె సంతోషం అన్నది మరిచిపోయి, విచారంగా ఉంటుంది. పోయిన ఆ సంతోషం రోజుకొక ముత్యమై ఆమె భోరున ఏడ్చినపుడు నోటినుంచి రాలుతుంది. ముత్యాల కోసం, కూతుర్ని ఏడిపిస్తావో, లేక ప్రేమతో ఆమెను సంతోషంగా ఉంచుతావో నీ ఇష్టం" అని సీతమ్మతో అన్నాడు.

"ఏడిస్తే ముత్యం వస్తుంటే, దాన్ని సంతోషంగా ఉంచడం ఎందుకు స్వామీ!" అంది సీతమ్మ ఆశ్చర్యంగా.

"మనిషికి సంతోషమే సగం బలం. స్వార్థాన్నీ ఆశనీ నమ్మితే, సంతోషం గొప్పతనం అర్థంకాదు. ఎప్పటికైనా డబ్బుతో నీకు తృప్తి కలిగితే, అప్పుడైనా నీ కూతుర్ని సంతోషంగా ఉంచే ప్రయత్నం చెయ్యి" అని సాధువు తన దారిన తాను వెళ్ళిపోయాడు.

మర్నాడు, సీతమ్మ కూతుర్ని తిట్టింది. ఎప్పుడూ తిట్టని తల్లి తిట్టేసరికి, చంద్రముఖికి దుఃఖం వచ్చి భోరున ఏడ్చింది. వెంటనే ఆమె నోటి నుండి ఒక ముత్యం రాలింది. సీతమ్మ ముత్యం తీసుకుని భర్తకు చూపించి జరిగినదంతా చెప్పింది. "నా బంగారుతల్లి, లక్ష్మీదేవి!" అంటూ సోమయ్య చంద్రముఖిని పొగడడం ఆరంభించాడు.

"దాన్నలా పొగడకు. అది విచారంగా ఉంటేనే మనకు ముత్యం వస్తుంది" అంది సీతమ్మ.

సోమయ్యకిది అమానుషం అనిపించింది. కానీ భార్య మాటలకు జడిసి ఊరుకున్నాడు. అయితే, భర్త రహస్యంగా కూతుర్ని సంతోషపెట్టే మాటలు అనొచ్చని భయపడిన సీతమ్మ, కూతురినో గదిలో ఉంచి తాళం వేసి, తాళం చెవి తన దగ్గర భద్రంగా ఉంచుకుంది.

కొన్నాళ్లిలా గడిచాయి. సోమయ్య దంపతుల వద్ద డబ్బు బాగా చేరుతోంది. కానీ చంద్రముఖితోనే కాస్త ఇబ్బందిగా ఉంది. ఆమె మొదటిరోజు తిడితే ఏడ్చింది. రెండోరోజు తిట్టినా ఏడవలేదు. కొట్టబోతే ఏడ్చింది. మూడోరోజు కొట్టబోయినా ఏడవలేదు. నిజంగా కొట్టడానికి సీతమ్మకు చేతులు రాలేదు. అందుకని నూతిలో తోసేస్తానని బెదిరిస్తే అప్పుడు ఏడ్చింది. మరోరోజు కారం తినిపించి ఏడిపించింది. ఇలా రోజుకో రకంగా చేయాల్సొస్తుంటే, కొన్నాళ్లకి కూతురు పూర్తిగా ఏడవడం మానేస్తుందేమోనని సీతమ్మ గాబరా పడసాగింది. ఇంతలో మరో సమస్య...

ముత్యాన్ని సోమయ్య ఆ ఊళ్లోని వరహాలయ్య అనే వ్యాపారికిచ్చి డబ్బు తెచ్చుకుంటున్నాడు. సోమయ్య రోజుకో ముత్యం తేవడం గమనించిన వరహాలయ్య దాని గురించి ఆరా తీశాడు. ముందు సరైన జవాబు ఇవ్వలేదు కానీ వరహాలయ్య అడగ్గా, అడగ్గా, దొడ్లో పాతు దొరికిందని చిన్న అబద్ధం ఆడేశాడు సోమయ్య.

వరహాలయ్య నమ్మలేదు. అలాగైతే, ముత్యాలన్నీ ఒక్కసారే తేవొచ్చుగా! సోమయ్య రోజుకొక ముత్యమే తెస్తున్నాడేమని ఆయన అనుమానించి ఆ ఊళ్లోనే ఉంటున్న తన తమ్ముడు రత్నాలయ్యకి చెప్పాడు. ఇద్దరూ కలిసి బాగా ఆలోచించి, ఓ పథకం వేశారు. ఆ ప్రకారం రత్నాలయ్య న్యాయాధికారిని కలిసి, తన ఇంట్లో ముత్యాల దొంగతనం జరిగిందని ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి ఆరా తియ్యగా, సోమయ్య వరహాలయ్యకి, రోజుకో ముత్యం అమ్ముతున్నట్లు తెలిసింది. వెంటనే న్యాయాధికారి సోమయ్యని పిలిపించి సంజాయిషీ అడిగాడు. సోమయ్యకు అసలు విషయం చెప్పక తప్పలేదు. అంతా విన్న న్యాయాధికారి, "ఇదంతా అభూత కల్పనలా ఉంది. ఈ విషయం పదిమంది పెద్దల ఎదుట ఋజువు చెయ్యనిదే నేను నమ్మలేను" అన్నాడు.



గత్యంతరంలేక సరేనన్న సోమయ్య, మర్నాడు తన కూతుర్ని న్యాయస్థానంలో హాజరు పెట్టాడు. అక్కడ తండ్రి ఆమెని నలుగురులోనూ బాగా తిట్టాడు. ఆమె దిగులుపడింది తప్పితే ఏడవలేదు. తర్వాత తల్లి వచ్చి తను చేసేవన్నీ చేసినా చంద్రముఖి ఏడవలేదు. "ఇదంతా పెద్ద నాటకం! ఏంచేసినా ఏడవకుండా వీళ్లు కూతురికి శిక్షణ ఇచ్చారు. ఇంత వరకూ సోమయ్య అమ్మిన ముత్యాలన్నీ దొంగ సొత్తు" అని అక్కడ అందరూ అనుకోసాగారు.

సోమయ్య న్యాయాధికారి కాళ్లమీదపడి, "నా కూతురు ఏడిస్తే ముత్యం రాలడం నిజం. మీరేం చేసినా తప్పుపట్టను. దాన్నెలాగో అలా ఏడిపించండి" అన్నాడు. అప్పుడు రక్షకభటులు చంద్రముఖిని బెదిరించారు. పెద్దపులులున్న బోనులో తోసేస్తామన్నారు. కొందరు దయ్యాల ముసుగు వేసుకుని భయపెట్టారు. చంద్రముఖి హడలిపోయిందితప్ప ఏడవలేదు. న్యాయాధికారికి కోపమొచ్చి, సోమయ్యకీ, భార్యకీ పదేళ్ల కఠిన కారాగార శిక్ష విధించాడు.

***

వినయశీలుడు ఇంకా ఏదో చెప్పబోతుండగా, ఒక రాజభటుడువచ్చి, వినోద ప్రదర్శనకు వేళయిందనీ, అది మించిపోతే, ఆ రోజుకింక వినోద ప్రదర్శన ఉండదనీ రాణికి మనవి చేశాడు. మహారాణి చిరాకుపడి, "వినోద ప్రదర్శన లేకపోతేపోనీ, అంతకు మించిన ఉత్సాహాన్నిచ్చే కథ వింటున్నాను. ఇక మీదట నేను పిలిచేలోగా ఎవరైనా ఇక్కడ అడుగు పెడితే, మరణదండన తప్పదని నా ఆజ్ఞగా చెప్పు" అని భటుడిని హెచ్చరించింది. వినయశీలుడివైపు తిరిగి, "వినోద ప్రదర్శన విషయం మరొకరోజు చూద్దాం. కథ కొనసాగించు" అన్నది ఆత్రుతగా.

"మహాప్రసాదం. తమ ఆనతి మీరగలనా?" అంటూ వినయశీలుడు కథను ఇలా కొనసాగించాడు.

***

న్యాయాధికారి అలా అనగానే సోమయ్య, అతడి భార్య ఏం మాట్లాడలేక తమ అదృష్టం దురదృష్టంగా మారిపోయిందే, అని దిగులు చెందారు.

ఆ సమయంలో జనంలోంచి ఓ వ్యక్తి వచ్చాడు. అతడి చేతిలో సన్నటి పొడవాటి బెత్తం ఉన్నది. అతడా బెత్తం ఎత్తి చంద్రముఖి ముంజేతిమీద బలంగా కొట్టాడు. వెంటనే అక్కడ చర్మం చిట్లి రక్తం కారసాగింది. చంద్రముఖి కెవ్వుమని అరిచి భోరున ఏడవసాగింది. అంతే, అంతా చూస్తుండగా, ఆమె నోటినుండి ముత్యం ఒకటి రాలి పడింది! అది చూసి న్యాయాధికారి, వరహాలయ్యతో సహా అక్కడ చేరిన వారందరూ నిశ్చేష్టులైపోయారు. సోమయ్య మాత్రం చటుక్కున ఆ బెత్తం మనిషిని సమీపించి, "మా అమ్మాయిని ఏడ్పించడానికి దాని రక్తం కళ్లచూస్తావా? నువ్వు మనిషివా, రాక్షసుడివా?" అంటూ గట్టిగా అరచి, కేకలు పెట్టాడు.

అందుకా బెత్తం మనిషి నవ్వి, "నేను మనిషినే! ఇది మామూలు బెత్తం కాదు, మాయ బెత్తం. చూడు దీని మహిమ" అంటూ బెత్తంతో దెబ్బ తగిలిన చోట రాశాడు. ఆశ్చర్యంగా ఆమె గాయం ఆనవాలు కూడా లేకుండా పూర్తిగా మాయమైపోయింది. న్యాయాధికారి సోమయ్యని వదిలేశాడు.



**దాసదాసీజనంతో కూడిన వైభోగ జీవితం కావాలని ఆశించేది ఆమె. అందుకు సాధువులనే నమ్ముకుంది. ఒకరోజు మహిమగల సాధువు ఆమెకు వరం ఇచ్చాడు. కన్నబిడ్డను ఏడిపిస్తే ఆ బిడ్డ నోట్లోంచి ముత్యం రాలుతుందన్నాడు. అప్పటి నుండి ఆ బిడ్డను కొట్టి ఏడిపించి ముత్యాలు సంపాదించింది ఆ తల్లి. ఆమె సంపద పెరిగింది. కానీ అంతలోనే ఆమెకు కొత్త సమస్యలొచ్చాయి. ఏమిటవి?**

ఇప్పుడు సీతమ్మకు కొత్త ఉపాయం దొరికింది. ఆమె ఆ బెత్తం మనిషికి రోజుకింత ఇస్తానని బేరమాడి కుదుర్చుకున్నది. ఇప్పుడు చంద్రముఖిని ఏడ్పించడం సులభమైంది సీతమ్మకు. రోజుకో ముత్యం సులభంగా దొరుకుతోంది. చంద్రముఖి ఒంటిమీద గాయాలుండడంలేదు. కానీ, రోజూ ఆ బెత్తంవల్ల కలిగే బాధను ఆ కొద్ది క్షణాలు కూడా ఓర్చుకోలేకపోతోంది.

నానాటికీ సీతమ్మ సంపద పెరుగుతోంది. కానీ, ఆమె ఆశ తీరటం లేదు. సోమయ్య మాత్రం కూతురు సంతోషంగా లేదని తనలోతానే దిగులు పడేవాడు. కొన్నేళ్లు గడిచేసరికి, సోమయ్య మేడ కట్టాడు కానీ బెత్తం మనిషి పరిస్థితిలో పెద్దగా మార్పులేదు. అందుకని అతడో రోజున చంద్రముఖితో, "నీకీ బెత్తం బాధలేకుండా చేస్తాను. నాతో వచ్చేస్తావా?" అనడిగాడు.

అతడితో వెడితే, కనీసం తనకీ ఖైదు జీవితమైనా తప్పుతుందని ఆశపడిన చంద్రముఖి సరే నంది. అప్పుడు బెత్తం మనిషి సోమయ్యనీ, భార్యనీ బెత్తంతో చితకబాది, వాళ్లు గోలపెడుతూంటే చంద్రముఖిని తీసుకుని ఇంట్లోంచి వెళ్లిపోయాడు. వాళ్లిద్దరూ అలా వెళ్లి మార్గమధ్యంలో ఓ అడవిలో ఆగి ఓ చెట్టుకింద విశ్రాంతి తీసుకుంటున్నారు. అప్పుడు హఠాత్తుగా ఓ పులి వచ్చి, బెత్తం మనిషిమీద పడి చంపి లాక్కుని పోయింది. చంద్రముఖి ఆ అడవిలో ఒంటరిగా మిగిలింది.

కొందరు దొంగలు ఆ దారినపోతూ చంద్రముఖిని చూచి, పలకరించి ఆమె కథేమిటని అడిగారు. అమాయకురాలైన చంద్రముఖి, వారికి తన గురించి అంతా చెప్పేసింది. దాంతో, వారికీ ఆశ పుట్టింది. ఏడవకపోతే కాలి గోళ్లు పీకేస్తానని ఒకడు, అరికాళ్లలో సూదులు గుచ్చుతానని ఒకడు, కనుగుడ్లు పీకేస్తానని ఒకడు ఇలా అంతా ఆమెని బెదిరించారు.

చంద్రముఖికి ఏడుపు రాలేదు. కానీ వాళ్లన్నంత పనీ చేస్తారని భయపడింది. అప్పుడామెకి బెత్తం మనిషి వదిలిన బెత్తం కనబడింది. చటుక్కున దాన్ని అందుకుని, దొంగలందర్నీ ఎడాపెడా వాయించింది. వాళ్లు గగ్గోలెత్తిపోయి, గోల పెట్టసాగారు.

ఆ సమయంలో, లవంగదేశ రాజకుమారుడు ప్లవంగుడు అక్కడికి వచ్చాడు. ఒక ఒంటరి యువతి ధైర్యంగా దొంగలతో పోరాడటం చూసి, ఆమెకి సాయంగా వెళ్లాడు. ప్లవంగుడినీ, అతడి చేతిలోని కత్తినీ చూచి దొంగలు వెంటనే కాళ్లకి బుద్ధిచెప్పారు.

ప్లవంగుడు ఆమె సాహసాన్ని మెచ్చుకున్నాడు.

"ఇందులో నా గొప్పతనమేం లేదు? అంతా బెత్తం మహిమ" అంటూ ఆమె అతడికి తన కథ చెప్పుకుంది. కథ విన్న ప్లవంగుడు బెత్తాన్ని ఆమె చేతి నుంచి లాక్కున్నాడు. వెంటనే చంద్రముఖి, "అయితే, నువ్వుకూడా నన్ను హింసించి, ముత్యాలు సంపాదించాలని అనుకుంటున్నావా? ఇల్లొదిలి వచ్చినా, నా బ్రతుకు మళ్లీ మొదటికే వచ్చింది" అంటూ భోరున ఏడ్చింది.

వెంటనే ఆమె నోటివెంట ముత్యం పడడం చూసిన ప్లవంగుడు ఆశ్చర్యపడి, "నువ్వు చెప్పిందంతా నిజమేనన్నమాట!" అంటూ ఆ ముత్యాన్ని ఏరుకున్నాడు.

చంద్రముఖి దిగులుగా, "మా అమ్మలాగే నువ్వూ నన్ను గదిలో బంధిస్తావా? ఎలాగో అలా రోజుకోసారి ఏడుస్తాను. నన్ను బెత్తంతో కొట్టకు. నాకు మనుషుల మధ్య తిరిగే అవకాశం ఇవ్వు" అంది.

"లేదు చంద్రముఖీ! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నిజానికి నేను దేశాటనకు బయల్దేరాను. ప్రపంచంలో ఏదేశం బలహీనంగా ఉందో తెలుసుకుని, దానిమీద దండెత్తాలని నా ఆశయం. ఎందుకంటే మా దేశంలో కోశాగారం వట్టిపోతున్నది. అందుకు బలహీన దేశాలమీద దండెత్తడమొక్కటే మార్గమని మా తండ్రిగారు చెప్పారు. కానీ, నీ కథ విన్నాక డబ్బుకోసం యుద్ధాలు చేసి, మనుషుల్ని హింసించటం అన్యాయం అనిపించింది. ఇప్పుడు నా మనసు మారింది. నువ్వు నన్ను పెళ్లి చేసుకోవడానికి ఒప్పుకుంటే కనుక, ఇప్పుడే నా తిరుగు ప్రయాణం" అన్నాడు ప్లవంగుడు.

"నానోటినుంచి వచ్చే ముత్యాలకోసం వట్టి మాటలు చెబుతున్నావు. నీ మాటలు నమ్మను" అంది చంద్రముఖి దిగులుగా.

ప్లవంగుడు వెంటనే మాయ బెత్తాన్ని ముక్కలు ముక్కలుగా విరిచి అవతల పారేసి, "నిన్ను ఏడిపించి తెచ్చుకున్న ఈ ముత్యంతో కూడా నాకు నిమిత్తం లేదు. నీ ముఖం కళకళలాడుతూండాలి. నువ్వెప్పుడూ కిలకిల నవ్వుతూండాలి. అదే నా కోరిక. నన్ను నమ్ము" అంటూ ముత్యాన్ని కూడా దూరంగా విసిరేశాడు. అప్పుడు చంద్రముఖి ముఖం కళకళలాడింది. ఆమె కిలకిల నవ్వింది. ప్లవంగుడు ఆశ్చర్యపడి చూస్తూండగా, ఆమె నోటివెంట ఒకటికాదు, రెండుకాదు నవరత్నాలు రాలాయి. ఆనాటినుంచీ ఆమె నవ్వినప్పుడల్లా, నవరత్నాలు రాలుతూ ఉన్నాయి.

"స్వార్థం వదిలిపెడితే నీ తల్లికి కూడా ఈ రహస్యం తెలిసి ఉండేది. స్వార్థంకోసం ఎదుటి మనిషిని దుఃఖపెట్టే వాడికంటే, తనకు నష్టం కలిగినా, ఎదుటిమనిషిని సంతోషపెట్టేవాడికే ఎక్కువ ప్రతిఫలం లభిస్తుందని నీ కథ చెబుతుంది" అన్నాడు ప్లవంగుడు. ఆ విధంగా ప్లవంగరాజ్య ఆర్థిక సమస్యలు తీరిపోయాయి. ప్లవంగుడు చంద్రముఖిని పెండ్లి చేసుకుని, ఎంతోకాలం హాయిగా జీవించాడు.

మహారాణి ఈ కథ విని, "వినయశీలా, వినోద ప్రదర్శన పేరుతో నేను నా స్వార్థం చూసుకుంటున్నానా అని అనుమానం వస్తోంది. నువ్వు ఈ విధంగా కథలు చెప్పగలిగినన్నాళ్లూ ఆ ప్రదర్శనలు నిలుపు చేస్తున్నాను. రేపు మళ్లీ యథాప్రకారం మనం కలుసుకుంటాం. నువ్వు ఇంత చక్కనిదే మరో కథైనా చెప్పాలి. లేదా వినోద ప్రదర్శనకైనా సిద్ధపడాలి!" అంది.

వినయశీలుణ్ణి ఆవహించిన నూరుకట్ల పిశాచానికి ఓ కట్టు విడిపోయింది. దానితో ఆ పిశాచానికి ఎంతో ఉత్సాహం కలిగింది. మర్నాడు, వినోద ప్రదర్శనకు ముందు యథాప్రకారం కథ వినడానికి మళ్లీ వచ్చింది మహారాణి. వినయశీలుణ్ణి ఆవహించి ఉన్న పిశాచం మరో కథ చెప్పడం ప్రారంభించింది.

నవ్య

## సుధామ పదగారడి-322

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ❖ | 2 | 3 | | 4 | | ❖ | 5 |
| 6 | | ❖ | | ❖ | | ❖ | 7 | |
| | ❖ | 8 | | | | 8 | ❖ | |
| ❖ | 9 | ❖ | | ❖ | | ❖ | ❖ | |
| 10 | 11 | | ❖ | ❖ | ❖ | 11 | 12 | |
| | ❖ | 15 ❖ | 13 | ❖ | 14 | ❖ | | ❖ |
| | ❖ | 15 | | | | | ❖ | 16 |
| 17 | | ❖ | | ❖ | | ❖ | 18 | |
| | ❖ | 19 | | | | | ❖ | |

**ఆధారాలు**

**అడ్డం**

2. శ్రావణంలో వచ్చే విశేష సర్వపూజాదినం (5)
6. కానము, విక్షాపము (2)
7. కృష్ణాష్టమి నాడు కొట్టేది (2)
8. కాయ దాడిమమునకు చెందినది (5)
10. రాక్షసి (3)
11. త్రాసు (3)
15. '....బుద్ధిమట్టు' అని సామెత. కంగారు మనిషికి (5)
17. చరఖా (2)
18. యాంత్రికత చిహ్నం గల మరణం (2)
19. కలతలు లేని కాపురమే మరోలాగా! (5)

**నిలువు**

1. దీన్ని కొరుక్కుతింటామా? గుణం ప్రధానం (3)
3. పెద్ద నిమ్మ, లకుచము (4)
4. శీతవేళ అంటే ఇదే! (4)
5. జన్మదినం (5)
9. మౌనంగానే ఎదగమని నీకు చెబుతుంది! (2)
10. చాకిత (5)
12. రాజుగారి భార్య (2)
13. చిత్తరువు, ఒకానొక యప్సరస (4)
14. చెదరిపోయిన సాగుబడి (4)
16. పాలు (3)

### పదగారడి-321 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 బొ | 2 నా | లు | ■ | 3 సం | 4 ఋ | ర | 5 ము |
| 6 పా | ■ | గి | ■ | 7 కో | ■ | డ | ■ | డు |
| 8 తు | ది | ని | ■ | మ | ■ | 9 గ | 10 తు | కు |
| రా | ■ | ■ | 11 క | టి | 12 క | ■ | మ్మి | ■ |
| 13 జా | 14 ల | పా | లు | ■ | 15 వి | నో | ద | 16 ము |
| ■ | త్తు | ■ | 17 వ | 18 ని | త | ■ | ■ | చ్చి |
| 19 మై | క | 20 ము | ■ | ట్లూ | ■ | 21 బా | పు | రే |
| దా | ■ | ళ్లు | ■ | ర్పు | ■ | డు | ■ | కు |
| 22 నం | ద | ను | డు | ■ | 23 అం | గ | డి | ■ |






## కూతురిని వదలమంటున్న తల్లి

ఇక్కడ తల్లి శ్రీదేవి అయితే కూతురు జాన్వి కపూర్. జాన్వి సినీ రంగ ప్రవేశం చేయకముందే రకరకాల పుకార్లు, ఊహాగానాలు షికారు చేశాయి... చేస్తున్నాయి. తాజాగా జాన్వి ముక్కుకు సర్జరీ చేయించుకుందన్న వార్త బాగా హల్‌చల్‌చేస్తోంది. దాంతో జాన్వి అందంమీద పలు అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి. ఇవి ఇలాగే కొనసాగితే కూతురు కెరీర్ ప్రమాదంలో పడుతుందని గ్రహించిన శ్రీదేవి నివారణ చర్యలు చేపట్టింది. ఇందులో భాగంగా మీడియా అంటే ఎప్పుడూ చిర్రుబుర్రులాడే శ్రీదేవి మీడియాకు ఓ విన్నపం చేసుకుంది. తన కూతురు ఇంకా చిన్నదని, తన విషయంలో ఇలాంటి పుకార్లు వస్తే చిన్న పిల్ల కనుక బెదిరిపోతుందనీ, అందుకే తన కూతురు మీద ఇలాంటి పుకార్లను రాయవద్దనీ వేడుకుంది. ఇకనైనా తన కూతురిని వదిలిపెట్టమని గాసిప్స్ పుట్టించేవారికి విజ్ఞప్తి చేసింది.

## ఈ బాడీగార్డు జీతం 15 లక్షలు?



ఇది సంవత్సరానికి కాదు నెలకు. ఇది ఏ అమెరికాలోనో కాదు. సాక్షాత్తు మన భారతదేశంలోనే! ఇక అంత జీతం అందుకునే బాడీగార్డు ఎవరు? అన్న అనుమానం వస్తోంది కదూ! అతగాడెవరో కాదు బాలీవుడ్ కండల వీరుడు సల్మాన్ ఖాన్ బాడీగార్డు. పేరు గురుమిత్ సింగ్ జాలి(షేరా). ఈ సింగు గారు సల్మాన్ ఖాన్ దగ్గర గత పదిహేను సంవత్సరాలు పైనుంచే పని చేస్తున్నాడు. సల్మాన్ మీద ఈగ కూడా వాలనీయడట! అంత జాగ్రత్తగా చూసుకుంటాడు కనుకే సల్మాన్ గురుమిత్ సింగ్‌కి అంత జీతం ఇస్తున్నాడట! ఈ విషయం బాడీగార్డు నోటి వెంట వచ్చింది. ఇది విన్నవారికి కొద్దిసేపు మెదడు పనిచేయలేదట! సంవత్సరానికి దాదాపు రెండు కోట్లు జీతంగా తీసుకునే ఇతగాడు ఇప్పటికే కోటీశ్వరుడయ్యాడు అంటారు. ఎంత ఎదిగినా ఒదిగి ఉండాలన్నట్టుగా ఆర్థికంగా ఎంత బాగున్నా సల్మాన్ దగ్గర బాడీగార్డు పనిని మాత్రం వదిలిపెట్టడట! ఓపిక ఉన్నంత వరకూ సల్మాన్ సేవ చేసుకుంటానని చెబుతున్నాడు.

## జీతం మాత్రమే ముట్టిందట!

పూరీ కనెక్ట్ అనే సంస్థకు సిఇఓగా ఉన్న మాజీ హీరోయిన్ చార్మీకి ఆ సంస్థ ద్వారా నాలుగు కోట్ల రూపాయలు అందాయన్న వార్త బాగా వినిపించింది. ఈ సంస్థ తరఫున పూరీ జగన్నాథ్ బాలకృష్ణతో కలిసి పైసా వసూల్ అనే సినిమా చేస్తున్నాడు. ఇందుకు గాను చార్మీకి అంత పెద్ద మొత్తం ముట్టిందన్న ప్రచారం జరిగింది. అయితే అదంతా అబద్ధమేనట! మొత్తం సినిమాని 25 కోట్లతో ముగించారట! అందులో ఎక్కువ భాగం హీరో రెమ్యునరేషన్ కిందే పోయిందట! ఇక తనకు అంత మొత్తం ఎలా ఇస్తారని చార్మి తన సన్నిహితుల దగ్గర వాపోయిందట! ఈ సినిమా సందర్భంగా తనకు కేవలం జీతం మాత్రమే ఇచ్చారని చెప్పుకుందట! పువ్వులు అమ్మిన చోటే కాయలమ్మడం అంటే ఇదే అంటున్నారు సినీ జనాలు. ఒకప్పుడు స్టార్ హీరోయిన్ స్థాయికి చేరుకున్న చార్మి ఇప్పుడు ఓ ఉద్యోగిగా జీతం మాత్రమే ముట్టిందని చెప్పడం బాధాకరం అని కూడా అంటున్నారు. అయితే ఈ విషయంలో చార్మి మొసలికన్నీరును తాము నమ్మమని అన్నవారు కూడా ఉన్నారు.





## రజనీని భయపెట్టిన బిగ్‌బీ

భయపెట్టడం కాదు కానీ, రజనీకాంత్‌కి అమితాబ్ ఇచ్చిన ఓ సలహా ఇప్పుడు బోలెడన్ని రంగులు పులుముకుని చివరికి ఇలా వినిపిస్తోంది. ఇంతకీ అసలు జరిగిందేమిటంటే.... రజనీ రాజకీయ ప్రవేశం మీద ఇంత వరకూ ఓ క్లారిటీ రాలేదు. రజనీ రాజకీయాల్లోకి వస్తారన్న ప్రచారం జోరుగా సాగుతోంది. ఈ విషయం మీద ఎవరికి తోచింది వారు ఊహించేసుకుంటున్నారు. ఈ నేపథ్యంలో బిగ్‌బీ అమితాబ్ రజనీకి ఓ సలహా ఇచ్చారన్న వార్త బాగా హల్‌చల్ చేస్తోంది. ఇటీవల ఓ సినిమా షూటింగ్ సందర్భంగా రజనీ ముంబయి వెళ్ళారు. ఆ సందర్భంగా రజనీ అమితాబ్‌ని కలుసుకున్నారట! అప్పుడే అమితాబ్ రజనీకి రాజకీయ ప్రవేశం మీద సూచనలు చేశారట! రాజకీయంగా తనకు ఎదురైన అనుభవాలు చెప్పి, టాలీవుడ్ మెగాస్టార్ చిరంజీవి రాజకీయ పార్టీ ఎలా అయిందో చెప్పి మరోసారి ఆలోచించుకోమన్నారట! అన్నీ విన్న తరువాత మరోసారి ఆలోచిస్తాను అంటూ రజనీ అమితాబ్‌కి చెప్పారన్న వార్త బాగా వినిపిస్తోంది. అమితాబ్ చెప్పినది విని రజనీ బెంబేలు పడిపోయారనీ, అందుకే ఆయన ఆరోగ్యం కొద్దిగా క్షీణించిందనీ, దాంతో చికిత్స కోసం అమెరికా వెళ్ళారన్న వార్తలు బాగా వ్యాపిస్తున్నాయి.

## కమిట్‌మెంట్ ముఖ్యమట!



ఈ సంగతి గౌతమికి ఇన్ని రోజులకు గుర్తుకు వచ్చింది అంటున్నారు తమిళ తంబీలు. ఏ బంధమైనా నిలవాలంటే కమిట్‌మెంట్ ముఖ్యమని చెప్పుకొచ్చింది. ఆఖరికి స్కూల్లో చదువుకునే స్టూడెంట్స్‌కి కూడా కమిట్‌మెంట్ ఉండాలిఅంటోంది. అది లేకపోతే జీవితంలో ఏదీ సాధించలేమని కూడా చెబుతోంది. సరే ఇది అందరికీ తెలిసిందే ..అయితే ఇది లోపించే కమల్‌తో విడిపోయావా తల్లీ అంటున్నారు కోలీవుడ్ జనాలు. కమిట్‌మెంట్ గురించి ఇన్ని సంగతులు చెప్పిన గౌతమి తన బ్రేకప్ విషయంలో మాత్రం క్లారిటీ ఇవ్వడం లేదు అంటున్నారు.

# ఎప్పటికీ ఒంటరిదాన్నే!

**–టబు**

**'గ్రీకు వీరుడు... నా రాకుమారుడు' అంటూ సినిమాల్లోనే కాదు నిజజీవితంలో కూడా తన కలల రాకుమారుడి గురించి టబు రెండున్నర దశాబ్దాలుగా ఎదురు చూస్తూనే ఉంది. మంచి ఎత్తు, ఎదుటి వారిని కట్టిపడేసే అందచందాలు ఇవేవీ టబు పెళ్ళికి కలిసి రాలేదు. దాదాపు మూడు దశాబ్దాలుగా సినీరంగంలో ఉన్న టబుకి ఇంత వరకూ ఎవరూ నచ్చలేదు. తన కలల రాకుమారుడు ఇప్పటికీ కనపడలేదని అంటున్న టబుతో....**

**ఇన్ని సంవత్సరాల సినీ ప్రయాణంలో ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే ఏమనిపిస్తోంది?**

ఈ సుదీర్ఘకాలంలో సినీరంగం అనే పెద్ద సముద్రాన్ని దాటడానికి ప్రయత్నించాను. ఈ ప్రయాణంలో అప్పుడూ, ఇప్పుడూ ఒంటరినే! ఎప్పటికీ ఒంటరిదాన్నే అనిపిస్తూ ఉంటుంది. నా జీవితంలో ఏం జరిగినా అది పూర్తిగా నా సొంత నిర్ణయం మీదే జరిగింది. కొన్నిసార్లు కష్టాలు ఎదురయ్యాయి కూడా! ఈ విషయంలో నేను ఎవరినీ నిందించను.

**నాలుగు పదుల వయస్సులో కూడా ఒంటరిగానే ఉండిపోయారు, నచ్చిన వాడు దొరకలేదా?**

నచ్చలేదనే చెప్పాలి. నా ఆలోచనలకూ, అభిరుచులకూ సరిపడే వ్యక్తి దొరకనందువలనే ఇంకా పెళ్ళి చేసుకోలేదు. ఈ విషయంలో నేను ఎప్పుడూ బాధపడలేదు. నచ్చని సినిమానే వదులుకుంటాను. అలాంటిది నచ్చని వ్యక్తితో జీవితాన్ని ఎలా పంచుకుంటాను?

**ఎప్పటికీ ఇలాగే ఉండిపోతారా?**

అలా చెప్పడం కష్టం. భాగస్వామి విషయంలో నా ఆలోచనలు ఎప్పటి కప్పుడు మారిపోతూనే ఉన్నాయి. పాతికేళ్ళ వయస్సులో లైఫ్ పార్టనర్ గురించిన ఆలోచనలు అభిప్రాయాలు ఇప్పుడు లేవు. ఓ విధంగా చెప్పా లంటే నా ఆలోచనల్లో బాగా పరిణితి వచ్చింది. ఇప్పుడు అంత త్వరగా ఎవరూ నచ్చడం లేదు. నచ్చినవారు దొరకకపోతే బహుశా ఎప్పటికీ ఇలాగే ఉండిపోతానేమో! అప్పుడూ, ఇప్పుడూ ఎప్పుడూ నేను ఒంటరినే!

**మీ పెళ్ళి కాకపోవడానికి అజయ్ దేవగన్ కారణం అన్నది ఎంత వరకు నిజం?**

నేను సరదాగా చెప్పిన మాటల్ని చాలా సీరియస్‌గా తీసుకుంటు న్నారు. అజయ్‌దేవగన్ నా వెల్‌విషర్. నాకు సంబంధించి మంచి ఏది జరి గినా మనస్ఫూర్తిగా సంతోషించే మొదటి వ్యక్తి. అలాంటి వ్యక్తి నా పెళ్ళికి ఎలా అడ్డుపడతాడు? దీనికి సంబంధించి వార్తలు రాసే ముందు ఒక్కసారి ఆలోచించవచ్చు కదా? ఇంతవరకూ చెప్పని విషయాన్ని టబు ఇప్పుడే ఎందుకు చెబుతోంది? సరదాగా చెప్పిందేమో! అని ఆలోచిస్తే బాగుండేది.

**నెంబర్ వన్ స్థానంలో మీ పేరు తక్కువగా వినిపించడానికి కారణం?**

ఈ నెంబర్ గేమ్ మీద నాకు నమ్మకం లేదు. నా అదృష్టం కొద్దీ కెరీర్ ప్రారంభం నుంచీ ఇప్పటి వరకూ నాకు మంచి మంచి పాత్రలే దొరికాయి. నేను ఈ స్థాయికి రావడానికి నా స్వశక్తి ఒక్కటే

కారణం అని చెప్పను. దానికి నా కో–స్టార్స్ సపోర్ట్ చాలా ఉంది. నెంబర్ వన్, నెంబర్ టూ అనేది తాత్కాలికం. ఇప్పటికీ టబు చేసిన సినిమాల గురించి ప్రేక్షకులు మాట్లాడుతున్నారంటే దానికి మించిన స్థానం ఏముంటుంది? ప్రేక్షకుల హృదయాల్లో నా స్థానం ఎప్పటికీ పదిలంగానే ఉంటుంది.

**సినిమాలను బాగా తగ్గించుకుంటున్నట్టున్నారు?**

నా కెరీర్ మొదలైనప్పటి నుంచీ ఇప్పటి వరకూ దాదాపు ఎనభై సినిమాల వరకూ చేశాను. ఇక ఇప్పుడు వరుస పెట్టి సినిమాలు చేయడం అనవసరమనిపించింది. గ్లామర్ పాత్రలు చేయడం అంటే ఆలోచించాల్సిందే! అందుకే నాకు తగిన పాత్రలు వస్తేనే చేస్తున్నాను తప్ప అన్ని సినిమాలను ఒప్పుకోవడం లేదు.

**బాలీవుడ్, హాలీవుడ్, దక్షిణాది భాషలలో కూడా సినిమాలు చేశారు కదా? ఏ భాష బాగా సౌకర్యంగా అనిపించింది?**

అన్ని భాషలలోనూ సినిమాలు ఒకే విధంగా ఉంటాయి. నటన అనేది కామన్. ఇది అందరికీ తెలిసిందే! ఒక్కోచోట ఒక్కో సౌలభ్యం ఉంటుంది. అంతే  తప్ప ఒక చోట బాగుంటుంది మరోచోట బాగుండదు అని ఉండదు. నటనకూ, నటికీ భాషా భేదం ఉండదు.

**ఒక్కోసారి నెలల తరబడి పార్టీల్లో తరచుగా కనపడుతుంటారు? ఆ తరువాత కొన్ని నెలల పాటు అదృశ్యమైపోతుంటారు. ఎందుకలా?**

పార్టీకి పిలిస్తే వెడతాం తప్ప మనంతట మనం వెళ్ళలేం కదా! నన్ను ఎవరైనా పార్టీకి రమ్మని ఆహ్వానిస్తే తప్పకుండా వెడుతుంటాను. ముఖ్యంగా దివాలి పండుగ సందర్భంగా పార్టీలు ఎక్కువగా జరుగుతాయి. వాటన్నింటికి దాదాపు వెడుతుంటాను. ఆ తరువాత ఒకటి రెండు నెలలు ఎలాంటి పార్టీలు ఉండవు. ఆ తరువాత వచ్చే నూతన సంవత్సర వేడుకల్లో పాల్గొంటూనే ఉంటాను.

**మిమ్మల్ని బాగా ప్రభావితం చేసిన వ్యక్తులు?**

మా మదర్. తన ప్రభావం నా మీద చాలా ఉంది. నా జీవితంలో ప్రతి మలుపులోనూ తను ఉంది. తను నాకు మంచి గైడ్. మా మదర్‌తో పాటు మా ఫ్యామిలీ మెంబర్స్ సపోర్ట్ మరువలేనిది. వారి సహాయ సహకారాలు లేకపోతే ఇంత దూరం వచ్చేదాన్ని కాదు. ఈ రంగంలో ఇన్ని సంవత్సరాలు ఉండగలిగేదాన్ని కాదు.

**దక్షిణాది భాషలలో తక్కువ సినిమాలు చేయడానికి కారణం?**

తక్కువ అని కాదు చాలా సినిమాలే చేశాను. నటిగా నాకు మంచి పేరు తెచ్చిన సినిమాలు దక్షిణాదినే ఎక్కువచేశాను. తెలుగులో 'కూలీ నెం 1' తరువాత వెనుతిరిగి చూసుకోవలసిన అవసరం లేకపోయింది. ఇక 'నిన్నే పెళ్లాడతా' సినిమా నన్ను దక్షిణాదిన స్టార్ హీరోయిన్‌ని చేసింది. ఇక్కడ చేసిన సినిమాలన్నీ నాకు మంచి పేరును తెచ్చిపెట్టినవే!

**తండ్రీ కొడుకులతో చేయడం ఎలా ఉంది?**

ఏ నటికి అయినా అరుదుగా లభించే అదృష్టం అది. నాగార్జునగారితో రెండు మూడు సినిమాలు చేశాను. ఇప్పుడు ఆయన కొడుకు అఖిల్ సినిమాలో చేయబోతున్నాను. అఖిల్‌కి తల్లిగా చేస్తున్నాను. ఇప్పుడే ఈ సినిమా గురించి చెప్పలేను.

**ఇక్కడ మరికొన్ని సినిమాలు చేసే ఆలోచన ఉందా?**

ఇప్పుడే చెప్పాను కదా! ఏ భాషలోనైనా సినిమాలు చేయడానికి నేను సిద్ధం. మంచి కథ, మంచి పాత్ర లభిస్తే చేస్తాను. చిన్న పాత్ర అయినా సరే! నాకు తగినది అనిపించాలి. దక్షిణాదిలో కథలు వింటున్నాను. ఇంకా దేనికీ ఓకే చెప్పలేదు.

**బాలీవుడ్‌లో చేస్తున్న సినిమాలు?**

రోహిత్‌శెట్టితో 'గోల్‌మాల్ 4'లో చేస్తున్నాను. ఈ సినిమా షూటింగ్ ఇంకా మొదలు కాలేదు. రెండు సినిమాలకు ఓకే చెప్పవలసి ఉంది. అక్క, చెల్లి, వదిన ఇలా ఏ పాత్ర అయినా సరే నాకు నచ్చితే చేయడానికి ఎలాంటి అభ్యంతరం లేదు. కొందరిలా సినిమాలో నాదే మెయిన్ రోల్ కావాలన్న ఆశా లేదు.

**ఆ కొందరు ఎవరు?**

పేర్లు అనవసరం. సినిమా మొత్తం నా చుట్టూనే తిరగాలన్న కోరిక లేదు. నా వయస్సుకి తగిన పాత్రలు, ప్రాముఖ్యం ఉన్నవి వస్తేచాలు.

**మీమీద వచ్చే గాసిప్పులు విన్నప్పుడు, చదివినప్పుడు ఏమనిపిస్తుంది?**

చిన్నతనంలోనే సినిమాల్లోకి వచ్చాను. ఇక్కడ నిలదొక్కుకోవడం అంత తేలికైన పని కాదు. ఈ విషయం ఇక్కడకు వచ్చిన కొత్తల్లోనే అర్థమైపోయింది. నటనమీద దృష్టి పెట్టినప్పుడే ఇక్కడ ఉండగలం. మిగతా విషయాల గురించి పట్టించుకోకూడదు. ఈ విషయం అర్థమైన తరువాత గాసిప్పుల గురించి పట్టించుకోవడం మానేశాను. అలాంటి వాటిని చదవను కూడా చదవను. దక్షిణాదిలో ఓ స్టార్ హీరోతో నాకు రిలేషన్‌షిప్ ఉందని రాశారు. ఆ వ్యక్తికి అప్పటికే పెళ్ళయ్యింది. అలాంటి వ్యక్తితో రిలేషన్‌షిప్ ఎలా కంటిన్యూ చేస్తాను? సినిమాలు చేసినంత మాత్రాన ఆ వ్యక్తికీ నాకూ సంబంధం ఉందనడమేనా? కొంచెం కూడా ఆలోచించరా? ఈ విషయాలు విన్నప్పుడు చాలా బాధనిపించేది. ఇప్పుడు అలాంటివి పట్టించుకోవడం మానేశాను.



–స్పందన రెడ్డి

పుస్తకావిష్కరణ దృశ్యం



ఎడమనుంచి: కత్తి మహేష్, ఎ. సురేంద్రరాజు, టి. రాజేంద్ర, డా. శ్రీరాం, కె.వి.రమణాచారి, ఎ.ఎన్.జగన్నాథశర్మ, బిక్కి కృష్ణ, ప్రభాకర్‌జైని, శ్రీమతి విజయలక్ష్మి జైని చిత్రంలో ఉన్నారు.

# వెండితెర చీకటివెలుగులు 'సినీవాలి'

**'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వ'రన్న దశాబ్దాలనాటి కవి అంతరార్థం నేటికీ ప్రశ్నగానే మరుగునపడిపోయింది. కాయకష్టంచేసే కూలీలు కావచ్చు, ట్వంటీఫోర్ క్రాఫ్ట్సను నమ్ముకున్న హైదరాబాద్ కృష్ణానగర్‌లోని మెరికల్లాంటి 'సినీ కూలీలు' కావచ్చు చుక్క పొడుపువేళ చలినీ, వర్షాన్నీ లెక్కచేయకుండా రోడ్డెక్కితేనే ఆ పూటకి వాళ్ళ కడుపునిండేది. ఇలాంటి తెరవెనుక సినిమా జీవితాలపై గతంలో 'పాకుడురాళ్ళు', 'సినీ జనారణ్యం' లాంటి నవలలు వచ్చాయి. . కానీ ఇప్పుడు'తెర' చాటు పరిస్థితులు పూర్తిగా భ్రష్టుపట్టాయి.**




**సినీవాలి**
ప్రభాకర్ జైని
ధర: 400 రూపాయలు
పేజీలు: 376
ప్రతులకు: ప్రభాకర్ జైని, ఫ్లాట్ 111, సి–బ్లాక్, విష్ణు రెసిడెన్సీ, గాంధీనగర్, హైదరాబాద్ –80,
మొబైల్: 7989825420 మరియు అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు

గుత్తాధిపత్యం చేతుల్లో నలిగిపోతున్న సినిమాను హింస, దాష్టీకం పీడిస్తున్నాయి. కష్టపడి తీసిన అద్భుతమైన దృశ్యకావ్యాన్ని విడుదల చెయ్యాలంటే వారి కాళ్ళూ వీరి కాళ్ళూ పట్టుకోవాల్సిందే! ఇలాంటి లొసుగులన్నింటినీ 'సినీవాలి' నవలలో నిర్భీతిగా అక్షరబద్ధం చేశారు కవి, రచయిత, దర్శకనిర్మాత ప్రభాకర్‌జైని. అనుభవపూర్వక అధ్యయనంతో సినీరంగం లోతుల్ని జల్లెడపట్టిన లేటెస్ట్ నవలిది.

నవ్య వీక్లీలో 30 వారాలు వెలువడి పాఠకుల్లో ఉత్కంఠ రేపిన సంచలన సీరియల్ 'సినీవాలి' ఇప్పుడు పుస్తక రూపంలో ప్రచురితమైంది. హైదరాబాద్ రవీంద్రభారతిలో జూన్ 30, 2017 శుక్రవారం సాయంత్రం ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు. ప్రముఖ ఆధ్యాత్మిక గురువు, సభకు ముఖ్యఅతిథి డాక్టర్ శ్రీరాం పుస్తకాన్ని ఆవిష్కరించారు. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు డాక్టర్ కె.వి.రమణాచారి అధ్యక్షతన జరిగిన సభకు నవ్య వీక్లీ సంపాదకులు, ప్రముఖ రచయిత, కళారత్న అవార్డు గ్రహీత ఎ.ఎన్.జగన్నాథశర్మ విశిష్ట అతిథిగా హాజరయ్యారు.

## మేలిమి రచయితలకు నవ్యవీక్లి ప్రోత్సాహం



బంగారు పళ్ళేలవంటి రచయితలకు నవ్యవీక్లీ సంపాదక వర్గం, యాజమాన్యం ఎల్లప్పుడూ గోడచేర్పుగా నిలబడుతుందని ఎ.ఎన్.జగన్నాథశర్మ అన్నారు. వాస్తవికతకు దర్పణంపట్టిన ప్రభాకర్ జైని నవలకు మొదటి ఏడువారాలలోనే పాఠకుల నుండి అనూహ్యమైన స్పందన వచ్చిందని అన్నారు. విషాదం, సంతోషం, దారిద్ర్యం, అసహ్యం, కపటం, అభూత కల్పనలు.....ఇలా సినిమారంగంలో ఉండే కిటికీలన్నిటినీ తెరిచేసి అన్ని పవనాలనూ ఆహ్వానించి 'సినీవాలి' నవలను జైని అత్యద్భుతంగా తీర్చిదిద్దారన్నారు. తాను రాసినదానిని నమ్ముతూ, నమ్మిన దానికోసం నిలబడుతూ, చెప్పినది పాటించే గొప్ప రచయితగా జైనిని పేర్కొన్నారు. నవ్యవీక్లీలో జైని రాస్తున్న సరికొత్త సీరియల్ 'లాకర్ నెంబర్ 369'ను కూడా పాఠకులు ఎంతగానో ఆదరిస్తున్నారన్నారు.

## పుస్తకానికేదీ సాటిరాదు



'తెలుగునాట ఉద్దండ పత్రికగా పేరుగాంచిన నవ్య వీక్లీలో 30 వారాలు వెలువడిన 'సినీవాలి' సీరియల్ ప్రతివారం తాను చదివానన్నారు కె.వి.రమణాచారి. ఎప్పటికప్పుడు తన అనుభూతులను రచయిత ప్రభాకర్ జైనికి వివరించేవాణ్ణన్నారు. తన రచనలతో పాఠకలోకంలో అలజడి రేపిన జైని ఒక రచయితగా, వ్యక్తిగా ఆ సీరియల్‌ను ప్రతిబింబించారన్నారు.

రమణాచారి ఇంకా ఇలా చెప్పారు. 'ఒక రచన పుస్తకంగా వెలువడేముందు పత్రికలో రావడం ఒక ఆనవాయితీ. ఏదైనా పుస్తక రూపంలో రావాలి,

ఎందుకంటే ఎన్ని ట్విట్టర్లు, కంప్యూటర్లు, యూట్యూబులు వచ్చినా పుస్తకం చదవడంలో ఉండే ఆనందం డిజిటల్ ప్రపంచంలో ఉండదు. అందుకే పుస్తకం ఎప్పటికీ హస్తభూషణంగా ఉండాలి. పుస్త కానికున్న స్థానం ఎప్పటికీ చెక్కుచెదరదు.

అంపశయ్య, అమ్మా నీకు వందనం, ప్రణయ వీధుల్లో... మొదలైన చిత్రాలు నిర్మించిన దర్శకని ర్మాత జైని పడిలేచే కెరటంలా మరింత ఉత్సాహంతో మరో చిత్ర నిర్మాణానికి ఉద్యుక్తులు కావడం సంతో షదాయకం'.

## రచనల సారాంశం పాలకులు అమలు చెయ్యాలి



వ్యాపారాత్మకంగా మారిన సమాజంలో అవాంఛనీయ శక్తులు కీలకస్థానాలు ఆక్రమిం చాయని సభకు మాన్య అతిథి, ఆంధ్రప్రదేశ్ బ్రాడ్‌కాస్ట్ జర్న లిస్ట్ అసోసియేషన్ అధ్యక్షులు టి.రాజేంద్ర ఆవేదన వ్యక్తం చేశారు. సమాజంలో విలువలు వెనక్కు వెళ్ళిపోయాయనీ, పాజిటివ్ ఎన ర్జీగల సామాజికులు ఆ విలువల పునరావిష్కరణకు బాధ్యత చేపట్టాలని కోరారు. రచయితలకు సన్మా నాలు చేసి శాలువాలు కప్పి సత్కరించినంత మాత్రాన ప్రభుత్వం బాధ్యత తీరిపోదని ఆ రచన ల్లోని ప్రజాప్రయోజన సారాంశాన్ని పాలకులు అమలు చేయాలని అన్నారు. రచయితల మనోభావా లను రమణాచారిలాంటివారు పాలకులకు తెలియ జేయాలని విజ్ఞప్తి చేశారు.

## సినీవాలి రచన ఒక సామాజిక అవసరం



వెలుపలినుండి చేసే విమర్శల కంటే సినిమారం గంలో ఉంటూ ఆ రంగంలోని లోటుపాట్లను, సినీ వ్యవస్థను విమర్శించినప్పుడే ఎక్కువ విలువ ఉంటుందని సినీ దర్శ కులు, ఫిల్మ్ క్రిటిక్ కత్తి మహేష్ అన్నారు. అందుకే స్వీయానుభవాలతో రాసిన 'సినీవాలి' నవలకు మంచి రీడబిలిటీ లభించిందన్నారు. ఆయన ఇంకా ఇలా అన్నారు.

'సినిమా అంటే పాప్‌కార్న్ కాదు, ఐస్‌క్రీం కాదు, అదొక సోషల్ ప్రోడక్ట్, సమాజ ఆలోచనల్ని ప్రతి బింబిస్తుంది. కమర్షియాలిటీ పేరుతో సినిమాకూ, సాహిత్యానికీ విడాకులైపోయాక సీరియస్ సాహిత్యం సినిమాని పట్టించుకోవడం లేదు. ఈ పరిస్థితుల్లో సినిమా లోతుపాతుల్ని, లోటుపాట్లను విమర్శ నాత్మకంగా ఎత్తిచూపకపోవడం నేరమే అవుతుంది. ఆ నేరం జరగకుండా ఆ బాధ్యత నెరవేరుస్తున్న తక్కువమందిలో ప్రభాకర్‌జైని ఒకరు. ఈ నవల ఒక థ్రిల్లర్, ఒక సామాజిక అవసరం, తెలుగు సాహిత్య, విమర్శనాత్మక ధోర ణులకు అత్యవసరం' అన్నారు కత్తి మహేష్.

## అంతర్గత సంఘర్షణకు ప్రతిరూపం

నవల తన అస్తిత్వం కోల్పోయి సినిమా అనుకూల రచనగా మారడం కూడా ఇప్ప టివరకు మనం చూశాం, కానీ అందుకు భిన్నంగా సినీ జీవితాన్ని, దాని అంతరాంతరాల్లో జరిగే సంఘర్షణను రచయిత ప్రభాకర్‌జైని ఈ నవలలో ఆవిష్కరించారని సభకు ప్రత్యేక అతిథి, తెలంగాణ ప్రభుత్వ సాంస్కృతిక శాఖ సంచాలకులు డాక్టర్ మామిడి హరికృష్ణ అన్నారు. నవ్య వీక్లీలో 30 వారాలు ధారావాహికంగా వెలువడిన 'సినీవాలి' సీరి యల్ పుస్తకరూపంలో రావడం అభినందనీయమన్నారు.

మరో ఆత్మీయ అతిథి, సాహితీ విమర్శకులు అంబటి సురేంద్రరాజు మాట్లాడుతూ, అంపశయ్య, అమ్మా నీకు వందనం, ప్రణయవీధుల్లో మొదలైన చిత్రాలు నిర్మించిన ప్రభాకర్‌జైని తన సినీ అనుభ వాలు జోడించి ఇంత గొప్ప నవల రాయడం తన కెంతో సంతోషంగా ఉందన్నారు.

## పరిశోధనాత్మక నవల



సినీరంగంలోని లొసుగుల్ని వెలికితీసిన పరిశోధ నాత్మక నవల 'సినీవాలి' అన్నారు సభకు గౌరవ అతిథి, కవి, సాహిత్య విమర్శకులు బిక్కి కృష్ణ. జాలి, ప్రేమ, కరుణ, ఆర్ద్రత, ఆప్యాయత, సౌశీల్యంవంటి మానవీయ లక్షణాలున్న ప్రభాకర్‌జైని స్వయంకృషితో రచయి తగా ఎదిగారని ఆయన రచ నల్లో ఫైర్, లాజిక్, చదివించే స్టైల్ ఉంటాయన్నారు.

## అంతా గుత్తాధిపత్యమే

ఎన్నో వ్యయప్రయాసల కోర్చి రెండేళ్ళు కష్టపడి ఓ చిత్రం నిర్మించానని పుస్తక రచ యిత ప్రభాకర్ జైని అన్నారు. గొప్ప ఆశలు, ఆశయాలతో ఆ చిత్రాన్ని దృశ్యకావ్యంగా రూపొందించాను. అయినా ఫలితం లేకుండాపోయిందని ఆవే దన వ్యక్తం చేశారు. సినిమా ద్వారా సమాజానికి సందేశం ఇవ్వాలనుకునేవాళ్ళని ఇక్కడ నిరుత్సాహ పరుస్తారు. ఈ రంగంలో షూటింగ్‌కు అవసరమైన ఇడ్లీ దగ్గరనుండి క్యాబ్ వరకు అంతా గుత్తాధిపత్య మేనని అన్నారు. ఆ చిత్రంలోని అనుభవాలే ఈ సినీ వాలి నవల అని అన్నారు.



సభకు హాజరైన సాహితీ ప్రముఖులు

## వేలాదిమంది ఆకలి కేకలే 'సినీవాలి'



ఒక సినిమా నిర్మాణం వెనుక వేలాదిమంది పేదల ఆకలి కేకలు ఉంటాయి. తెలుగు సినిమా రంగంలో 98 శాతంమంది హైదరాబాద్ కృష్ణాన గర్ ఇరుకుగదుల్లో కాలం వెళ్ళ దీస్తూ ఉంటారు. ఇలా అవకా శాల కోసం ఎదురుచూసేవా రిలో చదువుకున్నవాళ్ళు, ఉద్యో గాలు వదిలేసి వచ్చిన సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు ఎందరో.

సినీవాలి అంటే అమా వాస్యనాటి నెలవంక. గోరంతవె లుగు. ఆ వెలుగుకోసమే అంతా కష్టపడతారు. వాళ్ళ వ్యధే ఈ నవల. అందుకే ఈ నవలకు ఆ పేరు సరిగ్గా సరిపోయింది. సినిమా నిర్మాణంలో ఎదు రైన కష్టనష్టాల అనుభవంతోనే ఈ నవల రాశా. ట్వంటీఫోర్ క్రాఫ్ట్‌లో ఉన్న లొసుగుల్నీ ఈ నవలలో బహిర్గతం చేశాను. ఈ నవలను ప్రచురించడం మామూలు విషయం కాదు. కానీ నవ్య యాజ మాన్యం ఆ సాహసం చేసింది. అందుకు వారికి కృతజ్ఞతలు.

—ప్రభాకర్ జైని

## రచయిత్రులకు సన్మానాలు

లబ్ధప్రతిష్ఠులైన నలుగురు రచయిత్రులకు, వర్ధమాన నటి, అంపశయ్య చిత్రంలో రతి పాత్రధారి పావని, కెమేరామెన్ తిరుపతిరెడ్డి, సెన్సార్‌బోర్డు సభ్యులు ఎం.ఎస్.ప్రసాద్‌లకు జైని ఫౌండేషన్ తర పున ప్రభాకర్‌జైని, విజయలక్ష్మి జైని దంపతులు ఆత్మీయ సత్కారాలు అందజేశారు.

ప్రముఖ రచయిత్రులు పొత్తూరి విజయలక్ష్మి, వాణీ దేవులపల్లి, గంటి సుజల, బులుసు సరోజినీ దేవి ఆత్మీయ సత్కారాలు అందుకున్నారు. ఫౌండేషన్ తరపున ఇద్దరు ఇంటర్మీడియట్ విద్యార్థులు ఎన్. హర్షిత, ఎన్.వి.ఎస్.పి. పవన్‌లకు ఐదువేల రూపాయలు వంతున ఆర్థిక సహాయం అందజేశారు.



జైని ఫౌండేషన్ తరపున ప్రభాకర్‌జైని కుమార్తె శ్రీమతి చైతన్య జైని తొలుత స్వాగతం పలికారు. ఆయన కుమారుడు ఫౌండేషన్ ట్రస్టీ ఆకాశ్‌జైని వందన సమర్పణ చేశారు.

—రామ్మోహన్

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**

# అవి ఇక్కడ చేయను

## -సాయేషా సైగల్



**సాయేషా సైగల్‌కి అందం అభినయంతో పాటు అదనపు క్వాలిఫికేషన్ కూడా ఉంది. అదే సినిమా నేపథ్యం. అలనాటి ప్రఖ్యాత బాలీవుడ్ నటుడు దిలీప్ కుమార్ మనవరాలే ఈ సాయేషా అన్న సంగతి తెలిసిందే! అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శని అన్న చందంగా ఓ నటికి కావలసిన అన్ని అర్హతలతో పాటు కావలసినంత బ్యాక్‌గ్రౌండ్ ఉన్నప్పటికీ సాయేషా సినిమాల్లో పెద్దగా రాణించలేకపోయింది. దానికి కారణాలేమిటో ఆమె మాటల్లోనే....**

---

**అన్ని అర్హతలున్నా గడచిన రెండు సంవత్సరాలలో పెద్దగా సినిమాలు చేయలేకపోవడానికి కారణం?**

ఓ విధంగా నా తప్పే! వచ్చిన అవకాశాలను చాలా వరకు వదులుకున్నాను. ఒక్క సినిమాతోనే ఎవరి సత్తా ఎవరికీ తెలియదు. నాలుగైదు సినిమాలు చేసిన తరువాత నేనేమిటో అందరికీ తెలుస్తుంది. తెలుగులో నా మొదటి సినిమా తరువాత దక్షిణాదిన అవకాశాలు వచ్చినా ఏవో కొన్ని కారణాల వలన వాటిని చేయలేదు. అది నా తప్పే. ఇక ముందు అలాంటి తప్పులు చేయ దలుచుకోలేదు. ఎక్కువ గ్యాప్ తీసుకోకుండా నా దగ్గరకు వచ్చిన అవకాశాలలో మంచివి ఎంచుకుని సినిమాలు చేస్తాను సినిమాల ఎంపికలో నా పంథా మార్చుకున్నాను.

**ప్రస్తుతానికి ఉత్తరాది కన్నా దక్షిణాదిలోనే సినిమాలు ఎక్కువగా అంగీకరించి నట్టున్నారు?**

కారణం తెలియదు కానీ, మొదటినుంచీ నాకు దక్షిణాది సినిమాలంటేనే ఎక్కువ ఇష్టం. భాష పెద్దగా తెలియక పోయినా వాటిని తరచూ చూస్తానే ఉంటాను. ముఖ్యంగా తమిళం అంటే చాలా ఇష్టం. నా అదృష్టం కొద్దీ ప్రస్తుతం తమిళంలో వరుస అవకాశాలు వస్తున్నాయి.

**కోలీవుడ్‌లో మీ మొదటి సినిమా గురించి?**

జయం రవిగారి పక్కన 'వన మగన్' సినిమాలో చేస్తున్నాను. నిజం చెప్పాలంటే నాకు తమిళం అంత బాగా రాదు. అయినా జయం రవిగారు చాలా బాగా సహకరించారు. కోలీవుడ్‌లో నా మొదటి సినిమానే ఆయనతో చేయడం నా అదృష్టం అనుకుంటున్నాను. కోలీవుడ్‌లో ప్రస్తుతం ఒక సినిమా చేయబోతున్నాను. మరో మూడు కథలకు ఓకే చెప్పవలసి ఉంది.

**ఈ సినిమాలో అవకాశం ఎలా వచ్చింది?**

ఈ సినిమా దర్శకుడు విజయ్ తెలుగులో నేను నటించిన 'అఖిల్' సినిమాను చూసి నాకు అవకాశం ఇచ్చారు. ఆయన నా మీద ఉంచిన నమ్మకాన్ని నిలబెట్టాననే అనుకుంటున్నాను.

**ఈ సినిమాలో డ్యాన్స్ బాగా చేశారట?**

చిన్నతనం నుంచీ డ్యాన్స్ నేర్చుకుంటున్నాను. దాంతో డ్యాన్సులు చేయడం నాకు పెద్దగా కష్టం అనిపించలేదు. ఈ సినిమాలో బాగా డ్యాన్స్ చేశానని నేను చెప్పుకోవడం కన్నా ప్రేక్షకులు చూసి చెబితే ఎక్కువ సంతోషిస్తాను.

**ప్రభుదేవాతో చేయబోతున్నారట?**

ఆయన డ్యాన్సులకు నేను వీరాభిమానిని. 'వన మగన్' సినిమాలో నేను చేసిన ఓ పాటకు ఆయన డ్యాన్స్ కంపోజ్ చేశారు. ఆ సమయంలో ఆయనతో మాట్లాడడం జరిగింది. ఆ పాటలో నా డ్యాన్స్ చూసి నామీద నమ్మకంతో ఆయన సినిమాలో నాకు అవకాశం ఇచ్చారు. ఆయన నమ్మకాన్ని నిలబెడతాను.

**నటి కాకపోయుంటే...**

కచ్చితంగా మంచి డ్యాన్సర్ అయ్యుండేదాన్ని. డ్యాన్స్ అంటే చిన్నతనం నుంచీ నాకు పిచ్చి. చాలా చిన్నతనం నుంచీ శాస్త్రీయ నృత్యం నేర్చుకున్నాను.

**తెలుగులో చేసే అవకాశం లేదా?**

ఛాన్స్ వస్తే ఎందుకు చేయను? నాకు తగ్గ పాత్రలు వస్తే తప్పకుండా చేస్తాను. అలాగని మరీ బరువైన పాత్రలు కాదు. నా వయస్సు అమ్మాయి చేసే పాత్రలు అయితేనే నాకు ఇష్టం.

**బాలీవుడ్‌లో అంగీకరించలేదా?**

'శివాయ్' తరువాత కోలీవుడ్‌కి వచ్చేశాను. ఇక్కడ వరుస సినిమాలు చేస్తుండడంతో అక్కడ కథలు వినే టైం కూడా దొరకడం లేదు. బాలీవుడ్ దర్శకనిర్మాతలు మంచి కథతో వస్తే కచ్చితంగా చేస్తాను.

—కె.రామకృష్ణ





# తెలంగాణ అభివృద్ధి ఫలాలు.. ఇంటింటికి చేరే వెలుగు దివ్వెలు

## సంక్షేమంలో సువర్ణాధ్యాయం

శాంతియుత పోరాటం ద్వారా తెలంగాణ సాధించి, తొలి ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టిన శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖర్ రావు గారి నాయకత్వంలో తెలంగాణ రాష్ట్రం ప్రగతిపథంలో పరుగులు తీస్తున్నది. వినూత్న కార్యక్రమాలతో యావత్ దేశం దృష్టిని ఆకర్షిస్తున్నది.




మాతా-శిశు సంరక్షణకు కేసీఆర్ కిట్స్


ఒంటరి మహిళలకు నెలకు రూ.1000/- భృతి పంపిణీ కార్యక్రమం


ఎకరానికి రూ.8 వేల చొప్పున వ్యవసాయ పెట్టుబడి


మిషన్ భగీరథ


కోటి ఎకరాలకు సాగునీరు (మిషన్ కాకతీయ)


డబుల్ బెడ్ రూమ్ ఇండ్లు


నిరంతర విద్యుత్ సరఫరా


కళ్యాణలక్ష్మి


షాదీ ముబారక్


వరల్డ్ బెస్ట్ ఇండస్ట్రియల్ పాలసీ
ఐటీ రంగంలో అగ్రగామి


గ్రామీణ ఆర్థిక వ్యవస్థ పరిపుష్టం


తెలంగాణకు హరిత హారం


సమర్థ వంతంగా శాంతి భద్రతల నిర్వహణ


ఎస్సీ, ఎస్టీల కోసం ప్రగతి నిధి


మైనారిటీ సంక్షేమానికి అత్యధిక ప్రాధాన్యం


అమరవీరుల కుటుంబాలకు కుటుంబానికి 10 లక్షల సహాయం. కుటుంబంలో ఒకరికి ఉద్యోగం.


కొత్తగా 510 రెసిడెన్షియల్ స్కూళ్ళు


తల్లి బిడ్డలకు ఆరోగ్య లక్ష్మీ


ఉచిత ప్రమాద జీవిత బీమా
భవన నిర్మాణ కార్మికులకు, డ్రైవర్లకు, హోంగార్డులకు, జర్నలిస్టులకు ఐదు లక్షల రూపాయల


చరిత్రలో లేని విధంగా ఎం.బి.సి.ల కోసం రూ.1000 కోట్లతో కార్పోరేషన్


కాంట్రాక్టు టీచర్లు, అంగన్వాడీ టీచర్లు, 108 ఉద్యోగుల, ఉపాధి హామీ పథకం


బ్రాహ్మణుల, న్యాయవాదుల, జర్నలిస్టుల సంక్షేమం


ప్రభుత్వ ఆసుపత్రుల నుండి పేదల మృత దేహాలను స్వస్థలాలకు చేర్చేందుకు పరమపద వాహనాలు

**40 వేల కోట్లతో 35 సంక్షేమ పథకాలు**

**మన తెలంగాణ - మన ప్రభుత్వం - మన పాలన**